**DEDICATED**

TO

**HIS HOLINESS**

**MAHATMA GANDHI,**

THE MASSIAH OF "**India,**"

AS

*A Humble Token of*

*Admiration*

*For His*

*Leonine courage,*

*Unparalled Self-Sacrifice,*

*Unstinted Love*

AND

*Unsophisticated Service*

TO

*Mother India*

**AND**

**Humanity**

**BY**

**The Humble Author.**

# కృత్యాది

చిన్ననాఁటనె తాను కన్న భారతిఁ గాంచి
కన్నీరుఁ గార్చిన ఘనుఁ డెవండు?
మాతృమానము నిల్పి, భ్రాతృసేమముఁ గూర్ప
స్వేచ్ఛాతపముఁ జాల సేసె నెవఁడు?
బీదల నందఱిన్ సోదరులంబలె
భావించి సేవకుఁడై పరఁగె నెవఁడు?
ఉపవాసవ్రతములు నోర్పునఁ గావించి
పలువుర కలుషముల్ బాపె నెవఁడు?
తనవారికష్టముల్ తా వెయుం జెంచియుఁ
ఖైదునందు నెగులు బొందె నెవఁడు?
దౌర్జన్యము ద్రుంపి, దైన్యంబుతోఁ జత
శాంతజన్యంబుఁ దా జరిపె నెవఁడు?
అస్పృశ్యతన్బాపి, యంగాజ గోకకంటఁ
గాంచిన సద్గుణకంధి యెవఁడు?
భారతమాతను భక్తితోఁ గొల్చుచుఁ
దాఁ గూడ యోగియై తనరె నెవఁడు?
కటిక నేలె తనకు గరిమంపుశయ్యంచు
ధరఁ గ్రాలు కౌపీనధారి యెవఁడు?
కుష్ఠుల మేనులఁ గూర్మిఁ దాకుచు, వారి
మూర్తిఁ బోనాడు మహాత్ముఁ డెవఁడు
మానవపంకము ల్మాయింపఁ బుట్టిన
భారత "ఏసని" (jesus) వరలె నెవఁడు?
నేల యేలికలైన నెన్నఁడు నెఱుఁగని
ఘనమాన్యమందిన ఘంత యెవఁడు?

గీ. అట్టి సుగుణధాము, సదమలాత్ము, నిఖిల
విశ్వవిశ్రాంత యశవంతు, వీర్యవంతు,
కలియుగదధీచి, దుర్వారకలుషహరణు,
గాంధిదేవుఁ గృతిపతిసేతుఁ గౌతుకమున.

# పీఠిక

ద్విజేంద్రవిరచిత నాటకములన్నింటిలో "దుర్గాదాసు" పవిత్రమైనదని చెప్పవచ్చును. నిజదేశస్వాతంత్ర్యాభిలాషియై, స్వామిభక్తిపరాయణుండై, నిజధర్మ-మహిమాన్వితయాదర్శమూర్తియై ఆర్తజనరక్షాపరతంత్రుండై, క్షత్రియకులసత్తముండై, రసపుత్రకులశమంతకమై పలుప్రలోభములు తన్ను గభీరవాంఛాపరిధియందుం బడిత్రోసేయ నుంకించినను వానిదిక్కు భ్రుకుటీకరింపగ దుర్గాదాసు పెక్కుయిక్కట్టులక విచలితచిత్తుండైలోనై, పదంపడి కాదంబినీ ముక్త కమలాప్తు కరణి నిజమహాత్మ్య జ్యోతిచే భారతవర్షమును భాసమానమొనరించెను. ఇమ్మహనీయగుణగరిష్ఠుని పుణ్యచారిత్రముం బఠించువారలు పవిత్రాత్ములు కాకపోనరు. ఆంధ్రసోదర సోదరీమణులిందుల్లేఖింపంబడిన మహాదాదర్శములనన్నింటిఁ దమవిగాఁజేసికొని, రామాయణాది పురాణగ్రంథములభాతి నీ పుణ్యగ్రంథము నజస్రము పఠించి యిందలి పరమార్థము గ్రహింతురుగాక.

దీని నాంధ్రీకరించుటకుం బ్రేమపూర్వకముగ ననుమతి నొసంగిన శ్రీదిలీపకుమారరాయులుగారికిని, దీనిని దేశాటనమున కంపు భారముఁదమపైఁ బూనుకొనిన శ్రీఅద్దేపల్లిలక్ష్మణస్వామినాయుఁడుగారికిని సదాకృతజ్ఞుఁడనై యుండెద. మఱొకవిషయము:

విమర్శాశిలరాపిడిచేతనే గ్రంథకారుని మహిమాస్వర్ణము భాస్వరమై తనరారుచుండును. బహుళవిమర్శనలకతననే షేక్స్పియరు మహాకవి మానవస్మృతి మందిరమునం దేజోవంతుఁడై యున్నాఁడని

యొక యాంగ్లవిద్వాంసుఁడు సత్యము వ్రాసెను. ఆంగ్లనాటకము
లకుఁ బెక్కులు విమర్శనలున్నవి. కాని యాంధ్రనాటకములకుఁదగు
విమర్శన లేవియుఁ జూపట్టుట లేదు. పూర్వవిమర్శనాచర్చ సలుపుట
కీగ్రంథమందు పూనుకొనుచున్నను, అవసరమగుతావుల నాంగ్లమున
నొకించుక సారాంశమున్నను సరిపెట్టితిని. విమర్శనా భూయిష్ఠములైన
నస్మదాంధ్రకృతి ద్విజేంద్రనాటకరాజములు సాహిత్యభవనమునకు
బలంబులగు భిత్తికలై యుండునని నేను విశ్వసించెద. విమర్శనాచర్చ
కళాశాలా విద్యార్థుల కనివార్యము. దానంజేసి విమర్శనానుకూలంబు
లగు నీ నాటకములు నిక్కముగఁ గళాశాలాపాఠకులకుఁ బఠనార్హం
బులై యుండుననఁ నక్కాక్షింపవచ్చును. భారతాభ్యుదయకర్తలగు
యువకులు ధ్రువంబుగ నిద్విజేంద్రనాటకముల బఠించుటవసరమని తలం
చెద. కాన విశ్వవిద్యాలయాధికారులు వీనికుచిత స్థానమొసంగు
దురని

కలకత్తా
10—12—1925

విశ్వసించు విశ్వవిద్యాలయవిద్యార్థి,
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

| | |
|---|---|
| ఔరంగజేబ్ | భారతాధీశ్వరుఁడు. |
| రాజసింహ | మేవారు రాణా. |
| శ్యామసింహ | బికనీరుపతి. |
| శంభుజీ | మరాఠాధిపతి. |
| దుర్గాదాస్ | మార్వారు సేనాధిపతి. |
| దిలీర్ఖాన్, తాహబర్ ఖాన్ | మొగలాయి సేనాపతులు |
| మాజామ్, అజీమ్, అక్బర్, కామ్బక్ష్ | ఔరంగజేబు పుత్రులు |
| భీమసింగు, జయసింగు | రాజసింహుని నందనులు. |
| సమరదాస్ (సోనింగ్) | దుర్గాదాసు భ్రాత. |
| అజితసింహ | యశవంతుని తనూభవుఁడు |
| కాశిమ్ | ఒక ముసల్మాను |

## స్త్రీలు.

| | |
|---|---|
| గుల్నేమూర్ | భారతసామ్రాజ్ఞి. |
| మహామాయ | మృతయశవంతసింహునిపత్ని |
| సరస్వతి, కమల | జయసింహునిసతులు |
| రజియా-వుతున్నిసా | అక్బరు కూతురు |

శ్రీ ర స్తు

శ్రీ పరమాత్మనేనమః

# దుర్గాదాస్

# DURGADAS

## (A Historical Drama)



## ప్రథమాంకము



### ప్రథమదృశ్యము

స్థానము—ఢిల్లీప్రాసాదభవనమందలి సార్వభౌముని కొలువుకూటము

కాలము—ఉదయము

సింహాసనమందు ఔరంగజీబు ఆసీనుఁడైయుండును. వామపార్శ్వమున బికనీరు మహారాజగు శ్యామసింహుఁ డుపవిష్టుఁడైయుండును. దక్షిణపార్శ్వమున సైన్యాధ్యక్షుఁడైన తాహబ్ఖానును, ఇరువురు ప్రతీహారులును నిబమ్మభావమున నిలువఁబడియుందురు. సమ్ముఖమున రాథోరు సేనాధిపతియగు దుర్గాదాసు నాతనిసోదరుఁడగు సమరదాసును నిలువంబడియుందురు.

ఔరం—దుర్గాదాసూ! యశస్తిలకుండైన యశవంతసింహుని మరణము మొగల్సామ్రాజ్యముయొక్క దౌర్భాగ్యముకదా!

దుర్గా—ప్రభూ! సామ్రాజ్యకల్యాణార్థము రాజాజ్ఞఁ బాలించి ప్రాణంబులవీడుట మహత్తరమైన కార్యముకాదా!

ఔరంగ—నీవుచితంబు వచించితివి! విక్రమశాలియగు, ఆయశవంతుఁడుతక్క నొరులేరు దుర్జయులైన కాబూలీవిద్రోహుల దమన

మొనరింపఁ జాలియుండను. ఆపురుషసింహుని ఋణమును నే నీ జీవనమందుఁ దీర్పఁజాలను. [శ్యామసింహునుద్దేశించి] ఏమనెదరు మహారాజ్జీ?

శ్యామ—నిస్సందేహముగనట్లే.

సమర—అట్లుచింతింపనేల? యశవంతునితనయుఁడైన పృథ్వీసింహునను దను కడుపునఁ బెట్టుకొని దేవర యీఋణమును పూర్తిగ దీర్చివైచితిరికదా!

ఔరం—ఏమి! నేను వానిఁ జంపితినందువా? యువకుఁడా! నీవేమను చుంటివో యెఱుంగకున్నావు! ప్రాణమిత్రు పుత్రుని సంహరించుటకు నాకు నేతులెట్లువచ్చెనని దలఁచితివి! నిజమందనుమాడ్కి నేనా రాకుమరుఁ బ్రేమించువాఁడను. స్వహస్తములతో సమ్మానవసనంబుల నాతనికిఁ దొడిగితిని.

సమర—ఓహోహో! అవునా! ఆయజ్ఞానుఁడు కూడనట్లులే భావించెను. కాని, భవద్హస్తపరిచ్ఛదములు విషార్తములని, యర్భకుఁడైన పృథ్వీసింహుఁడెఱుంగ నేరకపోయెను!

శ్యామ—యువకా! నీవేరితోఁ బ్రసంగించుచుంటివో యెఱుంగుదువా?

సమర—ఎఱుంగకేమి?—యెఱుంగుదును—బికనీరు మహారాజ్! నేఁ బ్రసంగించుచుండుట మీప్రభువుతోఁ గాని నాప్రభువుతోఁ గాదు!

ఔరంగజీ బాకించుక చకితుఁడగును. తన సమ్ముఖమున నింతకు మున్నెరును నిర్భీకులై యుత్తేజముగనుఁ బ్రసంగించి, తనపై దోషారోపణ మొనరించు టాతఁ డెఱుంగఁడు. దానంజేసి యాతని భ్రూయుగళమీంపదాకుంచితమాయెను; కాని తోడనే యాతఁ డాత్మసంవరణ మొనరించుకొని—"ఆసమ్మానాంబరములు విషా

క్తములని యెవరని ? ” రనెను.

దుర్గా—స్వామీ ? దానికేమియుఁ బ్రమాణములేదు. అట్లని లోకులు తలఁచిరి. అ నుమానము మాత్రమే !

సమర—[సక్రోధమున]—అనుమానము మాత్రమేనా ! ఆదుకూలములఁ దొడిగికొనిన పరముహూర్తమందే, విషజర్జంత శరీరుండై దారుణ యంత్రణంబుచే నాయభాగుఁడు మృతినొందెను. నేనా దుస్మరణమును స్వచక్షులతోఁ జూచి యుండలేదా ?—అనుమానము మాత్రమేనా ? అట్లైన యశవంతసింహుని గాంధారభూమికంపి హాస్యఁ గావించుట కూడ ననుమానము మాత్రమే ! నేఁ డాతని సతీ పుత్రుల ఢిల్లీ నగరమందవరోధ మొనరించుట కూడ ననుమానమాత్రంబే ! అట్లైన నీవూ యనుమానమాత్రంబవే ? నేనూ యనుమానమాత్రంబునే ! ఈయౌరంగజేబూ యనుమానమాత్రంబే ! మొగల్సామ్రాజ్యమూ యనుమానమాత్రంబే ! ఈనిఖిలవిశ్వమూ యనుమానమాత్రంబే !—దుర్గాదాసూ ! ఇదనుమానముకాదు—యిది ధ్రువము ! స్థూలము !! [Here it means vivid] ప్రత్యక్షము!!!

దుర్గా—అన్నా ! శాంతింపుము—ఏమి ప్రతిజ్ఞఁ గావించివచ్చితివో జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

సమర—మంచి దూరకొనుచుంటిని. [ఔరంగజేబు నుద్దేశించి]—మొగలాయీ ! ఒకమాట సెప్పెదను వినుము! మేము పాలుత్రావు పసిపాపలమనియు, బ్రపంచమేమో యెఱుంగని వారమనియుఁ దలంపఁబోకుము. మనీషులము కాకున్నను, దుగ్ధపోష్య శిశువులమాడ్కి యజ్ఞానులము కామని యెఱుంగుము!

దుర్గా—రాజాధిరాజా ! నా యుగ్రభ్రాతను మన్నింపుఁడు. దేవరపదతలమున నేఁడొక వినీతప్రార్థనము నివేదనమొనరింప వచ్చితిమి.

ఔరం—మంచి దదేమో నివేదన మొనరింపుము.

శ్యామ—దుర్గాదాసూ! చెప్పఁదలఁచిన దేదియో చెప్పివైచుము. భయమొందనక్కఱలేదు. సార్వభౌము లతియుదారులు. వారు నీ సోదరుని దుండగమును మన్నించివైచిరి. నీవు వెఱగొందవల సిన పనిలేదు.

దుర్గా—యోధపురమహారాణి నిజపుత్రకన్యల దోడం దోడ్కొని స్వరాజ్యమునకు మగుడి పోఁగోరుచుండెను. దానంజేసి దేవర యనుమతి భిక్షవేఁడ వచ్చితిని. మావినీత నివేదన మిదియే!

ఔరం—నా యనుమ తెందులకు?

దుర్గా—దేవర యనుమ తెందులకో నేఁ గూడ నెఱుంగను. కాని మొగలాయి సైన్యాధ్యక్షుఁడైన తాహబర్ఖాను స్వామి యనుమతి బడసినగాని వారల విడువదలఁచుట లేదు.

ఔరం—[తాహబర్‌ను వీక్షించి]—తాహబర్ఖానూ! అట్లేలవారల విడచుచుంటివికావు?

తాహబర్—అది దేవరయాజ్ఞ యని యెఱింగి.

ఔరం—ఓ! అవును—ఢిల్లీనుండి మగుడి నిజసీమ కరుఁగని పూర్వము యోధపురాధీశ్వరి కుచితపురస్కార మొసఁగఁదలఁచి నే నట్టి ముదల నొసఁగినట్లు నా కిపుడు జ్ఞప్తికివచ్చినది. ఏ యనుగ్రహమును యశవంతసింహునకు సూప నే నెన్నండును సంకోచింప లేదో, దాని నాతని దారసుతాదులకుఁ జూపకుండుట జాల యన్యాయము! మహారాజ్ఞీ! మీ యభిప్రాయ మేమి?

శ్యామ—దేవర యెన్నండును నిక్కము వక్కాణించుచుందురు. ఇపుడు మీరనినది నిక్కమని వేఱుగ నేఁజెప్పనేల? చిరకాలము నుండి యశవంతుని పత్నీపుత్రి పుత్రులపై దేవర కసీమయనుగ్రహముండుట మా కందఱకు విదితమే!

సమర—సామ్రాట్టూ!—[దుర్గాదాసూ! నేనూరకుండ లేకుంటిని]—
సామ్రాట్టూ! నీవు వారికెట్టి యనుగ్రహము సూపకుండుటే గొప్పనగు యనుగ్రహము! నీ భ్రుకుంచనము విలోకించిన మేము భీతులము కాము,—మేలను దానిభావము మేము బాగుగ గ్రహింపఁగలుఁగుదుము. కాని నీ నగవుఁజూచి మేముకరంబువెఱ గొందుచుందుము,—మేలను దానిభావము దుర్గ్రాహ్యమై యుండును. యశవంతునిపై బగసాధింప నిశ్చయించి, యాతనిని, యాతని జ్యేష్ఠపుత్రుఁడైన పృథ్వీసింహుని నీ వెత్తెఱంగున వధించితో, యాతని పత్నీపుత్రిక నిష్టపుత్రులఁగూడ నత్తెఱంగుననే దునుమాడ నువ్విళులూరుచున్నట్లు స్పష్టీకరించి తెలిపితివె చుము. మృషాప్రణయము సూపుచు నీనిజోద్దేశ్యము నీకు దాపనేల? యశవంతసింహుని కులమున నొక్క పురుషునైన మిగల్పఁదలఁచుటలేదని చెప్పితివె చుము—అట్లు తెలిపిన మాకంతయు బాగుగఁదెల్లమగును. మా ప్రార్థన మేమన దేవా మనుగ్రహము సూపవలదనే!—ఔరంగజీబూ! నీశత్రుత్వము కంటె మైత్రి కడుభయంకరమైనది!

దుర్గా—అన్నా! నీవు నాప్రార్థనవ్యర్థ మొనరింపవచ్చితివా?—నీవు తిరిగి పొమ్ము.

[The fiery retorts of Samar Das indicate how the vile and crafty Aurangzeb brought about the deaths of Jeswant and his son Prithwi Sing.

The reader may be requisitioned in this connexion with the following information :

"It is related, in the chronicles of Maroo, that Aurangzeb having commended the attendance at court of Jeswant's heir, he obeyed, and was received not only with the distinctions which were his due, but with the most spacious courtesy . that

one day, with unusual familiarity, the King desired him to advance, and grasping firmly his folded hands (the usual attitude of deference) in one of his own, said "Well, Rahthore' it is told me you possess as nervous an arm as your father; what can you do now?" "God preserve your majesty," replied the Rajpoot Prince, "when the sovereign of mankind lays the hand of protection on the meanest of his subjects, all his hopes realized; but when he condescends to take both of mine, I feel as if I could conquer the world." His vehement and animated gesture gave full force to his words, and Aurangzeb quickly exclaimed, "Ah! here is another Khootun,' (the term he always applied to Jeswant); yet, affecting to be pleased with the frank boldness of his speech, he ordered him a splendid dress, which as customary, be put on, and having made his obeisance, left the presence in the certain assurance of exaltation.

That day was his last! he was taken – ill soon after reaching his quarters, and expired in great torture, and to this hour his death is attributed to the poisoned robe of honour presented by the King."

A great English literateur says "The cruel sacrifice of his (Jeswant's) heir, and the still more barbarous and unrelenting ferocity with which he pursued Jeswant's innocent family, are the surest proofs of the dread which the Rahthore prince inspired while alive."

That the belief of depriving a man of his life by making him wear poisonous dress (E, G. the unfortunate end of Prithwi Sing) is of ancient date can be well understood if we recall the story of Hercules put into doggerel by Pope:

.................. "He whom Dejanira

"Wrapped in the envenomed shirt, and set on fire." ]

సమర—సోదరా! పోయెదను. మఱొక్కమాట—ఒక్కమాట మాత్రమే చెప్పి పోదును. [ఔరంగజేబు నుద్దేశించి]—స్వామి

వారి పూర్వపురుషులైన యక్బరుమహాశయులకంటె స్వామివారే యొక్క యంశమున నధిక సమ్మానపాత్రులు! ఏలనన, స్వామివారక్బరు సార్వభౌముల పగిది కపటస్వాములవారు కారు! స్వామివారసలైన ముసల్మానులు—కఠినాచారపరాయణులైన ముసల్మానులు! స్వామివారు తమ ప్రపితామహులవలె వివాహమిషచే హిందువుల హిందుత్వము నాశన మొనరింప గడంగలేదు. పరిష్కారశాణితసనాతన ఇస్లాము మతాచారానుసారముగ స్వమతప్రచార మొనరించుచుండిరి—అట్లొనరించిన మాకేమియు భయములేదు! కాని, యనుగ్రహము మాత్రము మాపై స్వాములవారు చూపరాదు. ఇదివఱలోఁ జూపిన యనుగ్రహమే మాకుఁ జాలును! ఆ యనుగ్రహము కతన నిప్పుడు కూడ జర్జరితులమై యుంటిమి! ఇఁక మా కెట్టి యనుగ్రహము చూపకుండుటే మాకు స్వాములవారు చూపు మహోపకారము! మాపై కృపావలోకము బఱపరాదు—స్వాములకు పదివేల సలాములు!

[నిష్క్రమించును.]

[తాహబ్ఖా నాతని నడ్డుకొన యత్నింప నౌరంగజీ బాతని వలదని వారించును.]

ఔరం.—దుర్గాదాస్! నీముఖముఁ జూచి కూళుఁడైన నీయనుజుని మన్నించితిని. కాని, నేను ప్రవంచకుండను కానని మాత్ర మొక సత్యము వచించెదను. నే నంతరబాహ్యములందుఁ గూడ ముసల్మానుండను! ఈ సనాతనధర్మమును భారతవర్షమునకుఁ బ్రచార మొనరించుట కయ్యే నే నీరాజ్యభారముఁ బూనితిని! రాజ్యభారగ్రహణ మొనరించుటకు బూర్వ మేమి కావించినను, తద్భారము నిజౌదల వహించినప్పటినుండి ఫకీరునై, స్వమతప్రచారార్థము

వేయివెఱవ్రుల గోయుచుంటిని!

దుర్గా—స్వామీ! మీ వచనములు విశ్వసనీయములే—తదనంతరము కూడ దామెప్పుడైన శాఠ్యాచరణ మొనరించినను, అట్లు శత్రుల యెడలనే గావించి యుండురు! అది గర్హితముకాదు. ఉదారాచరణము కాకపోయినను, యనుచితకృత్యము కాదు!

ఔరం—అట్లని యొప్పుచుంటివా?

దుర్గా—ఒప్పుచుంటిని. కాని, యశవంతసింహుఁ డెప్పుడైన భ్రమవశమున నేదేని ప్రతికూలాచరణ మొనరించియున్నను, ఆతని యర్ధాంగియు, నిరీహులైన కుమారుని బిడ్డలును ప్రతిహింసాపాత్రులు కారు. వా రెట్టి యపరాధముఁ గావించియుండలేదు.

ఔరం—దుర్గాదాసూ! నేను వారిలఁ బీడింపఁ దలఁచుటలేదు. ఉచితమైన కెలింగుల వారిలఁ బురస్కృతులఁ గావింప నుంకించుచుంటిని.

శ్యామ—దుర్గాదాసూ! సార్వభౌములు సిక్కము వక్కాణించుచుండిరి.

దుర్గా—సార్వభౌముల యిచ్ఛామాత్రంబుననే మహారాణి పురస్కృతయాయెను.—ఇఁక వెడలిపోవ ననుమతిఁ బ్రసాదింపుఁడు.

ఔరం—[బికనీరుపతిని సంబోధించి] మహారాజా! తా మిపుడు నా నిభృతాగారమునకరిగి వేచియుండుఁడు. నే నిపుడే వచ్చెదను.

శ్యామసింహుఁడు నిష్క్రమింపగనే యౌరంగజేబు దుర్గాదాసు నుద్దేశించి—"రసపుత్రా! నీవు ప్రభుభక్తభృత్యుండవే కావు; చతురరాజనైతికుండవుకూడయని యిపుడు గ్రహింపఁగలిగితిని. నీకడచాతుర్యము నిష్ఫలము.—అట్లైన నిజంబు వచించుచుంటి వినుము! యశవంతసింహుని దారాసుతాదులు నాకుఁ గావలయును. నా నిజోద్దేశ్యమిది!" యనును.

దుర్గా—ప్రభూ! అట్లని నేనీవఱలో నే యెఱుంగుదును. కాని కారణ మేమో యెఱుంగను. మా రాణియబల. యశవంతుని తనూభవుఁడు పాలుత్రావు పసికూన. దేవరకువారలయక్కఱ యేమో నాకు దోఁపకున్నది.

ఔరం—దుర్గాదాసూ! తన కార్యములన్నింటి యక్కఱయేమో తన ప్రజలంకఱకు భారతాధీశ్వరుఁడు తెలుపవలసిన యక్కఱ లేదని తలఁచెద!

దుర్గా—[క్షణము చింతించి] అట్లైన నా వేఁడికోలు నిష్ఫలమేనా?

ఔరం—సంపూర్ణ నిష్ఫలము!

దుర్గా—అట్లైన నే నిఁకఁ జెప్పవలయున దేమియు లేదు.

ఔరం—యశవంతుని జాయనీవు నాకరములందు సమర్పణ మొనరింపఁదలఁచుట లేదా?

దుర్గా—ఈ గ్రీవమం దసువులు నిలచునంతకాలమట్లు తలఁపను!

ఔరం—దుర్గాదాసూ! నామాట వినుము. నీవు యశవంతుని దారానందనుల నాహస్తములందు న్యస్త మొనరింపుము. గొప్పబహుమాన మొసఁగెద!

దుర్గా—[మందహాస మొనరించి] సామ్రాట్టూ! ఆ శ్రేణిమానవుల కంటె నే నొకించుక పైవాఁడను! దుర్గాదాసు జీవనకర్తవ్యము మాత్ర మెఱుంగును. దుర్గాదాసు ప్రాణములున్నంతకాల మాతని మృతప్రభుపత్నీ పుత్రాదుల కాయములఁ దాకనేరికిని సాధ్యము కాదు.—ప్రభూ! ఇఁక నే సెలవు కైకొందును. ఆదాబ్ (సలామ్)

ఔరం—నిలువుము!—దుర్గాదాసు ప్రాణములున్నంతకాల మట్లొనర్చుట సాధ్యముకాక పోవచ్చును. కాని, దుర్గాదాసు యంత మొందిన యనంతర మదిసాధ్యము కాకపోదు.—తాహబర్ ఖానూ! బంధింపుము!





తాహబర్ ముందునకురాగనే, క్రోధఘూర్ణమానమానసుండై దుర్గాదాసు పేశినుండి యసిందీసి,—

"సామ్రాట్! ఖబర్దార్! ఇందులకై కూడ దయూరై వచ్చితి" నని యూతఁడు కటి విలంబిత తురిందీసి మ్రోయించును.

అమ్ముహూర్తమందే సశస్త్రులైన యోధులేవురు, నగ్నతర వారుల ఝళిపించుచు దర్బారుమందిరమునఁ బ్రవేశింతురు!

దుర్గా—సామ్రాట్టూ! ఈ యేవురుయోధుల వీక్షింపుము! మ ఱొండు తురీధ్వనిచే నేఁబదురుసైనికు లీ తావుం జేరుదురు— కనులవిప్పి కార్య మొనరింపుము!

ఔరం—పొమ్ము.

[యోధసహితుఁడై దుర్గాదాసు నిష్క్రమించును. ముహూర్త కాలము స్తంభితుఁడై నిలచి]

ఔరంగ—(స్వగతమున)—దుర్గాదాసూ! ప్రభుభక్తుండవనియు, జతురుండవనియు, విక్రమశాలివనియు, సాహసోపేతుండవనియు, శూరప్రవరుండవనియు నే నెఱుంగుదును. కాని, నీ కిట్టి స్పర్ధ యున్నదని యెఱుంగనైతిని!

[పిలచి]—తాహబర్ఖానూ!

తాహబర్—ఖోదాబండ్ [ఏమి ప్రభూ!]

ఔరంగ—సైన్యసమేతుఁడవై, యీ ముహూర్తమందే యశవంత సింహుని యాలయము నవరోధింపవలెనని నేముదల నొసఁగి నట్టీవు బిఱానపోయి, సేనాధిపతియైన దిలీర్ఖానున కెఱింగింపుము. పొమ్ము.

[తెరమారును. Change of Scene.]

**[The reader is requested to closely follow the character of Durgadas. Now he saw that the great hero is not at all dazzled by the bait which the crafty Aurangzeb administered unto him.]**

## ద్వితీయ దృశ్యము

ఢిల్లీ ప్రాసాదాంతఃపురమున గుల్నేయార్ సామ్రాజ్ఞివిశ్రామ యాగారము—ద్విప్రహరకాలము. సామ్రాజ్ఞియామందిరమునఁబచారి చేయుచుండును.

సామ్రాజ్ఞి—యోధపురమహిషీ! నీవొకప్పుడతిగర్వితవై, 'క్రీతదాసి వైన యవనసామ్రాజ్ఞి' వంచు నన్నేవగించితివి. ఆగరువ మంతయు నేఁ జూర్ణ మొనరించితినా లేదా? నీ భర్తను గాంధార సీమకంపి సమయింపఁ జేసితిని. నీ జ్యేష్ఠపుత్రుని విషప్రయోగముచే హత్యగావించితిని. ఇపుడు నీ సముఖమందే నీ కనిష్ఠపుత్రుఁ దెగ టార్చెదను. నీచే నా పాదోదకముఁ ద్రావించెదను. పదపడి, సప్రాణవై యుండగనే నిన్ను భూమిపాత మొనరించివైచెదను. యోధపురాధీశ్వరీ! 'క్రీతదాసి' యైన యీ యవనసామ్రాజ్ఞియే నేఁడు సువిస్తీర్ణమైన మొగల్సామ్రాజ్యము నేలుచుండెనని యెఱుంగుము. ఇఁక నౌరంగజీబా?—ఔరంగజీబునా యీ తర్జనీ సం లగ్నరశ్మిసంచాలితకాష్ఠపుత్తళికము! లోకులన్యవిధంబున భావిం తురు. అది వారి యూఢతాపరాకాష్ఠము! కాకున్న యశవం తుని రాజ్ఞియు, వాని సద్యోజాతశిశువును యౌరంగజేబున కెం దులకని వారు లోకమాతైనఁ దమ్ముఁ దారైనఁ బ్రశ్నించు కొంటిరా?

[ఈసమయమున నౌరంగజీబా యాగారమునఁ బ్రవేశించును.]

గుల్—ఎవరు? ఓహో! సామ్రాట్టా!—వందేగి జాంహాపనా! (ప్రభూ! సలామ్.)

ఔరం—పత్నీ! ఏకాకివై యుంటి వేల?

గుల్—యోధపురరాణి నపేక్షించుచు గూరుచుని యుంటిని— ఏదీ యామె?

ఔరం—ఇంకను పట్టుబడలేదు.

గుల్—ఏమీ! ఇంకను పట్టుబడలేదా?

ఔరం—లేదు!—దుర్గాదాసు మె నొసంగుట కియ్యకొనక మరలి పోయెను.

గుల్—ప్రాణములతోనే?

ఔరం—అవును! వానివెంట సైన్య మున్నది.

గుల్—సైన్యము లేకపోవుట మొగల్సామ్రాజ్యమందేనా!—ఛీ! సిగ్గు!! సిగ్గు!!!

ఔరం—ప్రియతమా!—

గుల్—ఇంక నే నేమియు వినఁజాలను!—నేఁటి సంధ్యాకాలమునకు బూర్వమే నాకు యోధపురమహిషి కావలయును!

ఔరం—సతీ! ఆ రాణిసదనము నవరోధ మొనరింపుమని నే దిలీర్ఖానున కాజ్ఞాపించితిని.

గుల్—మంచిది! గోధూలిసమయమునకుఁ బూర్వమే యామెం దెచ్చి నాపాదములపై బడవేయవలయును. మఱువవలదు! మఱువవలదు!!

[ఇట్లని యామె నిష్క్రమించును.]

ఔరం—[పోవుచుఁబోవుచు] ఈ దుర్గాదాసు సాహస మెంత యద్భుతమైనది! ఇంకను, యావీరమూర్తి నామనఃచక్షుసమ్ముఖమునఁ గన్పట్టుచుండెను.—దర్బారుమందిరమున నాసమక్షమున నిశిత తరవారిందీసి, నిర్భీకవచనవర్షణ మొనరించి, ఘోటకారోహుఁడై యతఁ డవలీలగ నావలకరిగెను!—ఈ దృశసాహసోపేతు నే నీనడుమ నెన్నఁడుఁగాంచి యుండలేదు;—అతని ప్రభువైన యశవంతసింహునికైన నిట్టి యద్భుతావహ సాహసముండుట వీక్షించియుండలేదు!— [ఇట్లని సామ్రాట్ మెల్లగనాయా

గారమునుండి బాహిరమునకు నిష్క్రమించును.]

తృతీయదృశ్యము

మొగలాయి సేనాధిపతియైన దిలీర్ఖాను బహిర్గృహము. అపరాహ్ణకాలము.

దిలీర్ఖాను కవచము దొడుగుకొనుచుండును; సమ్ముఖమున వాని ప్రధానసైన్యాధ్యక్షుడైన తాహబర్ఖాను నిలువంబడి యుండును.

దిలీర్—ఖన్సాహేబూ! ఏమనుచుంటివి?—రాణాగు సేనాధిపతి సామ్రాట్టు నాసికపరిసరమునుండి తనవారిని రక్షించి వెడలిపోయెనా?

తాహబర్—అవును! ఆతడు వెక్కిరించి వెడలిపోయెను.

దిలీర్—నీ వూరక జూచుచు నిలువంబడితివా?

తాహబర్—అవును! నే నూరక జూచుచు నిలువంబడి పోతిని!

దిలీర్—కదలమెదలకుండ నే నిలువంబడితివా?

తాహబర్—అవును. కదలమెదలకుండ నే నిలువంబడితిని!

దిలీర్—నిలువు నిలువంబడితివా?

తాహబర్—అవును. సాధ్యమైనంతవఱకు నిలువున నే నిలువంబడితిని!

దిలీర్—అట్లైన రణవిద్యయందు నీవు గొప్పవేధవే!

తాహబర్—అనుకో! నీ పాపమున నీవే పోదువు! నీ పనిసంత మాత్రమున నే వేధనై పోను. జాలిపడుటకుమాఱు నన్నుం దూలనాడు చున్నావు!

దిలీర్—జాలిపడు టెందులకు?

తాహబర్—చూడుము. వాడి వాడికత్తి నాముక్కు చివరనుండి యేలాదూసుకొని పోయినదో!

దిలీర్—అయ్యో! పాపము? అట్లు జరిగిం దిటోయి!

తాహబర్—జరిగిందంటే జరిగింది!

దిలీర్ — మహాయోధులకుకూడ నిట్టి ఘోరాపదలు కలుఁగుచుండును! యోధులైతే మాత్రమేమి! — ప్రారబ్ధకర్మం తప్పునా! అయితే బాబయ్యా, నీవు మొద్దువలెనే నిలువం బడితివా?

తాహబర్ — మొద్దువలెనో యెద్దువలెనో నిలువంబడితిని. ముక్కు మీఁదనుండి బాగా దూసుకుపోయిందికత్తి! [కండ్లు తుడుచుకొనును]

దిలీర్ — అబ్బె అబ్బె! ఇంతట్లోనే కంటఁదడిపెట్టుకోవాలా! వీరవరా!

తాహబర్ — [డగ్గుత్తికతో] ఏంచెయ్యను! నన్నింక తన దరిమేనా చేయనియ్యదు!

దిలీర్ — ఎవరది?

తాహబర్ — ఇంకెవరు! అదే!

దిలీర్ — అదంటె?

తాహబర్ — మా బిడ్డ లల్లి! లేనగానే ఆవేళ దాని మొగమే చూచాను! [వెక్కి వెక్కి యేడ్చును!]

దిలీర్ — ఊరుకో! బాబూ దిగమ్రింగు!! నాయనా దిగమ్రింగు!!! అయితేకాని, ఆ సమయమున కొంచె మొఱగలేకపోయినావూ!

తాహబర్ — ఒఱగబట్టే యింతపని జరిగింది. గభాలున క్రిందపడి చిత్తైతే యింతమట్టుకు రాకనే పోవును! తెలివైనపని చేశాను కాను! ఏమైతేనేమి! — ఇప్పు డనుకుంటే యేమిలాభము? సమ యానికి తోచిందికాదు! అయ్యో! దానిమొగం చూడ్డం మాత్రం యెల్లాగ!

దిలీర్ — ఊరుకో! వూరుకో!! బెంబేలుపడకు! ఏది! పాపము!! — యెంతముక్క కోసుకుపోయింది! [అని తాహబర్ ముక్కుమీద నున్న కట్టుదీసి వేయును.]

తాహబర్ — అయ్యో! అయ్యో!! అయ్యో!!! ముక్కో ముక్కో!! అయ్యో ముక్కో! ఓయిముక్కా! ముక్కు ముక్కో! ముక్కు ముక్కా!!

ఓయి నాముక్కు ముక్కో! ముక్కు ముక్కో! ఓయి ముక్కో ముక్కా! నువ్వింతట్లోనే పోయావా! ముక్కో! ముక్కా!!
(దిగమింగుచు) ముక్కో! [రోదనమొనరించును.]

దిలీర్—[పకపకనవ్వుచు] యోధవరా! నీ కంఠం చాలాబాగుం దోయి! కాని, నీ ముక్కు కోసుకుపోతాయెక్కడ?

తాహబర్—[ముక్కుతడుముకొని] ఇదేమి! యిదేమి!! ముక్కు సరిగ్గానే వుందే! ఎంతపొఱపాటుపడ్డాను! నిజంగా ముక్కూడి పోయిందే అనుకున్నాను! ఎంతపొఱపాటు! కట్టుకూడాకట్టేను! నా తెలివిమండా! చూసిచేసుకోని పనులన్నీ యీలాగేవుంటాయి!

దిలీర్—కాని, శూరాగ్రేసరా! ఆ సమయమున గృపాణము నొర నుండి వెలుపలికేల దీసితివికావు?

తాహబర్—వీలు చిక్కలేదు—సమయముమాత్ర మెక్కడిది?

దిలీర్—అవును పాపము! ఒరలోనుండి కత్తిఁదీయుటకు సమయ మేది!

తాహబర్—అరే! ఆ వాడిన యెంత హఠాత్తుగా దీనూలో యంత హఠాత్తుగా కఠారిదీసెను! అట్లే పెద్దమనిషి తీయసాహసింపడని నే నప్పుడే అనుకున్నాను. ఉన్నట్లేవుండి, అతఁ డేభయములేక చూస్తూచూస్తూవుండగా వెలుపలకు దాటెను.—

దిలీర్—అప్పు డొరలోనుండి కరవాలముఁ దీసితివి కాఁబోలు!

తాహబర్—అపుడు తీసిమాత్రమేమి చేయుదును!

దిలీర్—అట్లైన నతఁడరిగిన పిదప నేమి చేసితివి?

తాహబర్—ముక్కుందో లేదో యని ముఖమంతా తడిమిచూచు కున్నాను! ఏమిమాయయోకాని, అప్పుడది లేనట్లే తోఁచింది!

దిలీర్—పాపము నీ కప్పుడే శంకతోఁచింది కాఁబోలు!

తాహబర్—అవును! ఎందుకుచేతనంటే,—అప్పటికే నా మనసు

చాలా దుడుకుగా వున్నది! గాడిదొక్కదూపుతో చివాలున ఖడ్గ మొావలకుఁ దీసి త్రిప్పినపుడు దానితోఁకూడ ముక్కముక్కంతా యూడిపోవుట అమ్మక్కయేమిటి!

దిలీర్—[సస్మితముఖుఁడై] ఈవ్యాపారమంతయుఁ గ్రొత్తరకముగనే యున్నది! అటువంటివాని నొకసారి చూడవలసినదే!

తాహబర్—వానిని చూపవలెననియే చక్రవర్తి నీకు కబురంపెను! నీ కవచధారణమింకా పూర్తికాలేదు! ఇందాకటినుండి అదే వరుసగ బిగించుచున్నావు!

దిలీర్—మిత్రమా! అసహాయ్యానమయమునఁ సాగించుచుక విశ్రమించు యభ్యాసముకలదు. కొందఱు భృత్యులను వెంటఁగొని ఆవెఱ్ఱి వానిని తీసికొని రాఁగలవా?—ఈ సామాన్యకార్యము నీవంటి మహాశూరున కెంతో పాటిదికాదని యెఱిఁగియే నీ కీపని నొప్పగింప సాహసించుచుంటిని!

తాహబర్—ఖన్సాహేబూ! నీ వన్నట్లు నా కీకార్యమెంతపాటిదైనను, యిందులోఁ గాలుపెట్టుట నా కెంతమాత్రమూ యిష్టము లేదు. ఎందువలన నంటే, ఆ గాడిదతో విశేష పరిచయము చేయుట నా కిష్టములేదు. వాఁడి ముఖం చూచితేనే నా గుండెలు దడదడా కొట్టుకుంటాయి! నాకు కోపమే రాదు. కాని, వచ్చిందంటేనా, వాఁడింక బ్రతుకఁ గలఁడా? ఇంతకూ నే నీయుద్ధములో నెక్కి దిగకుండుటకు ముఖ్యకారణమేమంటే—అది నీకుమాత్రము తెలియదా యేమి?

దిలీర్—అదేమి? చెప్పుము.

తాహబర్—ముఖ్యకారణం యేమంటే, రాజపుత్రులంటే, నా కరికాలుమంట తలకెక్కును! యుద్ధమేమో యెఱుఁగని వారితో యుద్ధము చేయుటేమి?

దిలీర్—ఏమేమి?

తాహబర్—ఏమేమేమి? యుద్ధంచేసేవారొక నియమమును ననుసరించి నడువవలయును! రాజపుత్రు లేనియమమును లెఖ్కచేయరు. చటాలున నోరునుండికత్తారిని దీసి, ఆనమఅప్రగానున్నప్పుడు మీాఁద దెబ్బవేయుదురు! తర్వాత తమ తలపై నేమి పడునో చూడాచూడరు.—యెదుటివారలును తమతలపై నేమిపడుచున్నదో చూడనీయరు! వారల సూటిమొప్పుడూ యీాతలమీాఁద నున్నట్టే తోఁచేది! అట్టి చచ్చుచెవలమ్మలతో యుద్ధం చెయ్యానుని యున్నదా!

దిలీర్—వారల సూటిమొప్పుడు నీ తలపైనే యున్నదా? అవును. మగవాఁడు మహావీరుఁడై యుంటే వారు చూచిసహింపఁజాలరు!

తాహబర్—సహించటం మా టటుంచుము. అట్టివాఁడు త్వరలో నంతమొందితేనేకాని, వారి మాటలుసాగవని వారట్లు చేయుచుందురు! అట్టివారితో యుద్ధముచేయునప్పుడు మన జాగ్రత్తలో మన ముండవలెను. సాధ్యమైనంతవఱకు తల దాఁచుకొనుటే మంచిది!—మొలనంటే రాజపుత్రులంటేఅూ దెబ్బపై దెబ్బవేసే జ్ఞాపతు! అంటెఱు వొకటేసుచ్చు! పగవారలకుఱు పచ్చివంకాయలను కొనేవారి దరిమేనా చేరుటెందులకు?

దిలీర్—అయితే, తాహబ్ఖానూ! రాజపుత్రసైనికు లెంతఱుందురు?

తాహబర్—రెండు వాజులయేఁబది మంది యుందురు.

దిలీర్—మంచిదిఁక నీవు పోయి మైదువేల మొగలాయి సైనికులకు సమరసన్నద్ధులఁ గావించి యుంచుము. పాపిష్టులు దుశ్చర్య మొనరించి పవర మొనరించు వారతిభయంకరులు;—అట్టివారినిఁ బోరున డీకొనవలెనన్నఁ జాల యోచింప వలయును! అయిదు

వేల యశ్వారోహకులుసుమీ—తెలిసినదా ?—హొమ్మ్.

[తాహబర్ నిష్క్రమింపగనే స్వగతమున] దిలీర్—రసపుత్రులందఱు అసమసాహసికులు!—సామ్రాట్టుయొక్క యీ యాదేశార్థమేమో నాకుఁ దెలియకున్నది. అతఁడు యశవంతసింహుని వధింధించివైచెను— యేలనన నా శూరుఁడన నాతనికిఁ జాలపక్క బెదురుండెడిది! కాని సిరీహులైన యాతని దారాసుతులపై జక్రవర్తికింత పగయేల?— మంచిది! ఏమికానున్నదో కాక మానదు! భృత్యుఁడనైనపుడు స్వామియాజ్ఞ మాఱిదాల్పక తప్పదు! ఇఁక గృహాభ్యంతరమున కరిగి యాత్మీయులకడ సెలవుగైకొని వచ్చెదను! తిరిగి వత్తునను నిశ్చయమేమి !

[ఇట్లని దిలీర్ఖా నంతఃపురాభిముఖుఁడగును.]

## చతుర్థదృశ్యము

మీవారు రాణా రాజసింహుని యంతర్గృహము— అపరాహ్ణకాలము. రాజకుమారుఁడైన జయసింహుని నూతన వధువును, ద్వితీయపత్నియునగు కమల యేకాకినియై నిలువంబడి యుండును.

కమల—వల్లభా! మిమ్మెట్లొకజాల మందుఁ బడవైచితినో యెఱుంగుదురా? ఇపు డెచటికిబోదురో పొంచు. అక్క యవాక్కైపోయెను! ఈ యల్పసమయములో మఱొకర్తుక వచ్చి పాపము నీ ముఖసమ్ముఖమందలి గ్రాసము నాకస్మికముగ లాగుకొనిపోయెను! ఎంత దుఃఖ మెంతదుఃఖము!—హాః హాః హాః—అక్కా నే నుంత్ర మెఱుంగుదును!—మంత్ర మెఱుంగుదును!!—చాల బాగుగ జరిగినది! రాణా రాజసింహుని పుత్రుని పతిగఁ బడసి, నిజేశుని నిభృత మందదుకొని, నీ వొకర్తుకవు సర్వభోగముల ననుభవింప నిశ్చయించితివా అక్కా!— ఇపుడు బిడియ పడకు

ము!—రాణాయొక్క ద్వితీయనందనుఁడే మీవారాధీశ్వరుండగును!—పాపము నీవొక్కర్తుకవు రాజ్ఞి వౌదువని యాశపడితివి! అక్కా! నీ యాశనిరాశయై పోవుచున్నది! బుడుతని కరములనుండి గాళిపడగను యూడలాగుకొను లాగున నీ సేతులనుండి భాగ్యమంతయు నే నెల్లూడ వెఱికివైచు కొంటిని!—బాగా జరిగినదా! రాణివౌదువా? కమ్మ!—ఇఁక భీమసింహుఁడో!—భీమసింహా! నీవు యేలికవౌదువా?—అయిలనా? ఇఁకేమి!—పాపమెంత పేరాస!—కాని నీ వేలిక వెట్లగుదువు? స్వహస్తములతో రాణా నావల్లభుని కరమునకు రాజకోశమును కట్టినని యెఱుఁగవు కాఁబోలు! భావగాహా! మీ మూర్ఖ యెంత దురాశ! ఏమిజరిగెనో కొంచెము తెలుసుకొన నక్కఱలేదా? నా ప్రియుఁడే రాణాకుఁ బ్రియపాత్రుఁడని యెఱుంగవేదా? భీమసింహా!—ఇఁకేమి చేతువు?—అన్నదమ్ములిద్దరకు మంచికయ్యము కల్పించితిని! భీమసింహా! ఇఁక నీ ప్రతాప మెట్టిదో చూచెద! ఇప్పుడైన బుద్ధిఁ దెచ్చుకొని, నీ యాశ నిరాశ జేసికొమ్ము!—ఎట్టి బోనులోఁబడ వైచితిని! అక్కపటయంత్రమునుండుఁ బడకుండుట నీతరమా! ఇప్పుడు జరుగునదేమి? శ్రీ జయసింహుఁడే మీవారు పతియగును! శ్రీమతి కమలాదేవి మీవారు రాజ్ఞియగును!—ఇఁక నక్కా! నీ వేమగుదువు? దూరముగఁ దొలఁగి పోదువా పోవా? అక్కా! నిన్నుఁ జూచిన జాల జాలివేయుచున్నది! కాని నీవొక జోహారిడి దూరముగఁ దొలఁగి పోవలయును!—వే ఉపాయ మేమియు లేదు!

[పెద బొబ్బలఁ బెట్టుచు పరిచారిక యొకర్తుక పరువున నాట్యాగారమునఁ బ్రవేశించును.]

పరిచారిక—ఓరి బాబో!

కమల——ఏమి! ఏమి!!

పరిచారిక——ఓరి నాయనో! కురుక్షేత్ర యుద్ధమై పోయిందిరో బాబో! ఇంకే లాగురో నాయనో !

కమల——హా! ——ఏమి మునిఁగిపోయిందో చెప్పు !

పరిచారిక——అయ్యబాబో! ఏకంగా దక్షయజ్ఞమే అయిపోయింది నాయనో! ఇట్టి ఘోరము,——యెన్నఁడూ——యెక్కడా——యెవ్వరూ చూడలేదు బాబో! అచ్చంగా నిశుంభవధైపోయింది నాయనో !

కమల——ఏమి పుట్టిమునిగిందో చెప్పు!

పరిచారిక——ఇంకేమి ములఁగాలి బాబో!——లంకాయుద్ధమే అయింది నాయనో !

కమల——ఛీ! పాడుముండా! ఏమైనదో చెప్పు!

పరిచారిక——చెప్పనా! అయ్యో నాయనో!! అయ్యబాబో!!!

కమల——చెప్పు!

పరిచారిక——చెప్పనా ?——చిన్న రాజకుమారుఁడు——మీఆయనే——ఓరి బాబో!

కమల——ఏమి? మా నాయనయేమో చెప్పు! త్వరగా చెప్పు! ఏమైనదో చెప్పు! చెప్పు!!

పరిచారిక——పెద్ద రాజకుమారుడిని——అయ్యబాబో——కత్తితో ఒకే వ్రేటు!——రక్తగంగాజాహ్నవిభాగీరథై పోయింది బాబో!

కమల——తర్వాత! తర్వాత?

పరిచారిక——తర్వాత యింకేమి? పెద్దవాఁడైన భీమసింగు, చిన్నవాఁడైన జయసింగును కంఠం బట్టుకొని, విసరి క్రిందఁ బడవైవబోవు చుండ, హఠాత్తుగా రాణా చక్కావచ్చెను! చక్కావచ్చి పెద్ద వాఁడికి ముఖం వాచేటట్టు పెట్టెను!——భూతభవిష్యద్వర్తమాన

కాలములం దెఱుఁగరాని చీవాట్లను, యేడుకాండముల రామాయణ పారాయణం చేసినట్లు, నాకేవరుసగా నేకరుపెట్టెను! భీమసింగునకు నోటమాట రాలేదు! ఆతనిముఖమంతా బూదివర్ణమైపోయినది! కత్తివ్రేటు వేసినారక్త ముండదనుకున్నాను!— తండ్రి తట్టవమన పూర్తికాగానే, తలవంచుకొని, యాతఁడు మెల్ల మెల్లగా నావలకు దాటెను!

కమల— మా బాగా జరిగినది! అతని కాలా కావలసినదే!

పరిచారిక— ఓ యమ్మా! ఆలా అనకుము! పెద్దవాఁడు చాలా మంచివాఁడు! పెద్దమనిషి! దేశంలో ప్రజలంతా అతఁడే మంచి వాఁడనుచున్నారు!— ఇఁక చిన్నవాఁడా!— చిన్నబిడ్డా మంచి వాఁడే! నేనే వానిని పెంచి పెద్దవానిని చేసినాను! కాని యతఁడీమధ్యనే పాడైపోయినాఁడు! సర్వనాశీ! ఈ కుటుంబములోఁ బ్రవేశించి యెంతగోలఁ దెచ్చిపెట్టేవు! కులానికంతా ముసలం దెచ్చిపెట్టేదవు కాంబోలు!— ఎంతఘోర మెంతఘోరము!

కమల— ఛీ! పాడుముండా! ఆవలకుపో!

పరిచారిక— ఓరి నాయనో యిది అచ్చంగా భూతకిరాతుసిరో! శూర్పణఖ రాతుసిరో నాయనో! హిడింబిరో బాబో! ఇదెక్కడి నుండివచ్చి పడిందిరోనాయనో!—

[అని మొగరోజుచు బలాయన మొనరించును.]

కమల— ఏమి! ఇంతదనుక వచ్చెనా! ఇంతవఱకు వచ్చునని నే నను కొనలేదు— అయ్యైన త్వరలోనే మీ మాంస జరిగిపోవలెను!

[ఈ సమయమున నామె సపత్ని యైన సరస్వతి ఆయాగారమునఁ బ్రవేశించును.]

సరస్వతి— కమలా! ఇది యుచితమని తలంచితివా? నేఁ డేమైనదో యెఱుంగుదువా?

కమల—ఎఱుఁగకేమి!—ఎఱుఁగుదును! కాని, యుచితమని తలఁచుట దేనిని?

సరస్వతి—క్రమక్రమముగ వల్లభుని వారి సోదరునిపై బురికొల్పుటను!

కమల—ఎవరు పురికొల్పిరి?

సరస్వతి—నీవే!

కమల—చక్కని యబద్ధము! పెద్దవాఁడే ప్రారంభమున గయ్యమునకుఁ గాలుద్రువ్వెనఁట—చిరకాలమునుండి యాతని చూపు మీవారు సింహాసనముపై బడి యుండెను! అదే యాతని దోషము!

సరస్వతి—కమలా! బావగారి కీరాజ్యమక్కఱలేదు! అట్లని నేను బాగుగ నెఱుంగుదును—ఒకవేళ కావలసియున్నను, వారే యగ్రజులు కదా!

కమల—అవును! ఒక ఘడియ యాతఁడే పెద్ద! మన ప్రియుఁడు పుట్టినపుడు రాణాస్వయముగ వారి కరమునకుఁ బసుపుదారమును కట్టి యుండలేదా? ఇప్పుడీక జగడ మెందులకు?

సరస్వతి—సోదరీ! అట్లయిన్యు, యీ వైరమును భ్రాతృప్రణయముగఁ బరిణత మొనరించుటయును, యీ కృష్ణపయోద విద్యుద్ధార మొనరింపక సలిలమై వసుమతిపై బడుటకు దగు వెరవు రోయుటయును, యీ వహ్ని ప్రజ్వలింపక జల్లనై రెండు యెడదలను యుక్త మొనరించు తెఱంగెఱుంగుటయు మన కుచితమైన కర్జములు గావా?

కమల—నాకీవు యుచితానుచితములు బోధచేయ నక్కఱలేదు. ఆవిషయచర్చ నాకడ నెన్నఁడుఁ గావింపకుము. నా ప్రియుని విషయమేమో నేనే బాగుగ నెఱుంగుదును.

సరస్వతి—సోదరీ! వారు నీవల్లభులు మాత్రమేనా? నాకేమియు

గారా?

కమల—అట్లైన నీవే వారికిఁ దెలియఁ జెప్పుము. నాకు జగడమాడ రాకుము.

[ఇట్లని ద్రుతపదమున నా స్థానమునుండి యామె ప్రస్థాన మొనరించును]

సరస్వతి—నేను వారికిఁ దెలియఁజెప్పిన ప్రయోజనముండునా! హా! ఘటన! ఒకప్పుడు నాయందెంతో యనురాగము చూపుచు వల్లభులు నాపలుకులు సావధానులై వినుచుండువారు! ఇప్పుడా దినములన్నియు గడచిపోయెను! చెల్లెలా! నీవు వచ్చి, వారికెట్టి మందు బెట్టితివో కాని, యతఁడు నా ముఖమునైన విలోకింపక, యహర్నిశములు నీ యూరుతలమందే వసించుచుండెను! మంత్రముగ్ధు గావించి వారినెట్లు నీ మాయలోఁ బడవైచుకొంటివే పోకిరీ!

[జయసింహుఁ డాగారమునఁ బ్రవేశించును]

జయ—ఎవరు! సరస్వతీ! నేను కమలనుకొన్నాను?

సరస్వతి—అగునునా! అంత పొరపాటు కలిగెనా? కాని, ఆ పొరపాటెంత లోనే తెలిసిపోయెనా? పొరపాటు తెలియక పూర్వమొకమారు 'ప్రాణేశ్వరీ!' యని యేల పిలిచితిరి గారు? నన్నేఁ బిలచితిరని తలఁచి నే నెంతయో నానందించుచుందును! పిదప పొరపాటు తెల్లమైనను, ముహూర్తమాత్రపు కాలమైన స్వర్గసుఖ మనుభవించెడు దానను!

జయ—సరస్వతీ! నేనిఁక బోయెదను. చాల తొందరపని యున్నది.

సరస్వతి—ఒకించుక తాళుఁడు—మీకు నా హృదయావేగముఁ దెలుపనుంకించుటలేదు. గడచినదానికై వందురు దానఁగాను! మిమ్మొక విషయమునుగుఱించి యడుగుచుంటిని. మీ జ్యేష్ఠునితో మరల వివాదపడితిరా?

జయ—అందు నా దోషమేమియు లేదు.

సరస్వతి— అట్లయిన దోషమంతయు వారిదే నా?

జయ—కోపముచే నేను వానికాలిపై గత్తి వ్రేటు వేసితిని. పిదప నాతఁడు నా మెడ బట్టుకొని పిసరపోయెను.

సరస్వతి—దోషము వారిదే! —ప్రభూ! మీరీవరలో నిట్లుండువారు కారు. మీచేఁగములయెన్నేనియాటలనాడించుచుండెను. సైదోడులయ్యుమీరలునిర్హేతుక వైరముగల్పించుకొనుచుండిరి. అర్ధాంగి నైన నా పలుకుల నాలించి మీరిఁక గయ్యమునకు గాలుఁ ద్రువ్వకుఁడు. మీ యగ్రజుఁడు మీవారుసింహాసనకాంక్షియని కమల మీతోఁజెప్పియున్న, నదివట్టి మిథ్యయనియెఱుంగుఁడు. బావగారుదారులు— సత్పురుషులు.

జయ—అట్లయిన నేను నీచుండనా?—మంచిది!—

సరస్వతి—నేనట్లనలేదు. కాని మీకర్ణములు దీదుర్మంత్రోచ్చారణ మొనరించు నాఁడుది నీచమతియనియు భర్తృహితార్థి కాదనియు బలుకుచుంటిని. ఆవగలాడి మిమ్ము నాశనపథమునకుఁ గొంపోవుచుండెను!—అరిగో! బావగారిట్లే వచ్చుచున్నారు. నేనికఁబోయెదను నాథా! మీయందుమనుష్యత్వమున్న వో యీక్షణమందే మీయగ్రజు క్షమాభిక్ష వేఁడుఁడు.— [ఇట్లనియామె నిష్క్రమించును]

పరక్షణమందే భీమసింహుఁ డాయాగారమునఁ బ్రవేశించి మృదుస్వరమున సోదరుని,—'తమ్ముఁడా! జయసింహా!' యని సంబోధించును.

జయసింహుఁడు నీరవుఁడై యుండును.

భీమ—తమ్ముఁడా! దోషమంతయు నాయదియే! నన్ను క్షమింపుము.

జయసింహుఁడప్పుడుకూడ నుత్తరమేమియు నొసఁగక క్షూరకుని యుండును.

భీమ—సోదరా! క్రోధమును పూర్తిగ నడంప నేర్వలేదు. తమ్ముని క్షమించు టుచితమయ్యు, నే నట్లొనర్ప లేదు—సోదరా! నన్ను మన్నింపుము.

జయసింహుఁడపుడు నిరుత్తరుఁడై యుండును. ఈసమయమున రాణా రాజసింహుఁ డరుదెంచి భీమసింహునుద్దేశించి—“తనయా! తమ్ముఁడు నీపై దరవారి యాఘాత మొనరించెనా?” యని విషణ్ణవదనుఁడై ప్రశ్నించెను.

భీమ—లేదు. జనకా! విశేషమేమియు జరుగలేదు.

రాజ—నే నదెఱుంగను. పరిచారికలందఱుఁ జెప్ప[illegible]టిని. పిదప గదియందు రక్తరేఖఁ గాంచి, యది [illegible]యని యెం[illegible]. తండ్రీ! గాయమెచట యాయెనో చూ[illegible]




భీమ—గాయ మేమియు గాలేదు.

రాజ—చూడనిమ్ము.

భీమసింహుఁడు దక్షిణపాదమును చూప[illegible]

రాజ—ఆహా! భీమా! నాయనా! నే నిదెఱుంగక నిన్ను దూఱితిని. అపు డొడ లెఱుంగనైతిని. నీ తమ్ముని దండించు టుచితమయ్యు నే నాతనిని వెనుకవైచుకొని వచ్చితిని. ఇదిగో నా తరవారిఁ దీసుకొని, నాబదులు నీవే వానికిఁ దగుదండన మొసఁగుము.

భీమ—జనకా! దోషమంతయు నాయదియే—తమ్ముఁ డజ్ఞానుఁడు.

రాజ—నందనా! అన్యాయ మొనరించితిని. ఇపుడు న్యాయవిచార మొనరించెదను. నేను జయసింహుని పక్షపాతినని ప్రజలందఱు జెప్పుకొనుచుండిరి. అట్లే కావచ్చును. కాని, న్యాయవిచారణ మొనరించుట నా కర్తవ్యము.

భీమ—నేను వానిని మన్నించితిని.

రాజ—భీమసింహా! శాస్త్రవిధాన మొనరింపు[illegible] విష

యము గోచరమగుచున్నది-కతిపయదినములనుండి మీ కిర్వుర కేకతననో పడుటభవిష్యమందుఁ గూడఁబడనట్లు తోఁచుచున్నది. ఇరువురు రాజ్యార్థము రణ మొనరించుకొనెదరు. నేను మృతుం డైనపిదప కంటె బ్రదికియుండగనే, మీకదనమును కానిండు. అట్లైన రాజ్యమున కమంగళము కాఁజాలదు. ఇదిగో! కృపాణ ముఁ దీసుకొనుము. ఆల మొనరింపుము.

భీమ—పితా! నాకు రాజ్య మక్కఱలేదు. దానికొఱకై జన్యము సలిపి, భ్రాతృరుధిరముచే నాకరములఁ దడపఁజాలను—రాజ్య మక్కఱలేదని శపథపూర్వకముగఁ జెప్పుచుంటిని.

రాజ—ప్రమాణమేమి?

భీమ—నే నీముహూర్తమందే రాజ్యపరిత్యాగ మొనరించుచుంటిని. ఈ రాజ్యమందు నే నిఁక జలగ్రహణ మొనరించిన, రాజసింహుని పుత్త్రుఁ గానని ప్రతిజ్ఞఁ గావించుచుంటిని!!!

రాజసింహుఁడు—[కియత్కాలము నిస్తబ్ధుఁడై యుండి, తదనంతర మున]—భీమా! నీవు నేఁడతి కఠోరప్రతిజ్ఞఁ బూనితివి. తనయా! నీవు నిర్దోషివి; జయసింహుని దోషము కతన నీవు నేఁడు నిజ సీమనుండి చిరనిర్వాసితుఁడ వౌచుంటివి! కాని, భ్రమవశమున రాజబంధనమును నేను జయసింహుని కరమునకుఁ గట్టియుండి నందున, రాజ్యమంగళార్థము నీవు నీజనకుని మన్నించి, రాజ్య పరిత్యాగ మొనరించుటే యుచితమని తోఁచుచున్నది. కాని, భీమా! ఈ స్వార్థత్యాగమును రాజ్యమంగళార్థమయ్యే కావించుచుంటివి కాని రాజ్యవిద్వేషవశమున కాదని యెఱుం గుము.

భీమ—ఈ రాజ్యకల్యాణార్థమ య్యేనసువులఁ బాయఁ గలుఁగుఁ గాక!—జనకా! ప్రణామము [పితృచరణముల కెరలి పిదప సోదరు

నుద్దేశించి] తమ్ముండా! ఆశీర్వాద మొనరించుచుంటిని—జయో
పేతుండవై నామసార్థక మొనరించుకొనుము. యశస్వివై, చిర
కాలము సుకం బుండుము.

[ఇట్లని భీమసింహుండు నతవదనుండై వెడలిపోయెను.]

రాజ—నిక్కముగ నాపుత్రుండే—జయసింహా ! వీరత్వ మన నేమో
యెఱుంగ బ్రయత్నింపుము!

[ఉభయులు చెరియొకవైపున కనుగుదురు.]

I may with advantage quote the parallel passage from the 'Annals of Rajastan':

"Raja Jey Sing took possession of the *Gadi* ('The cushion') by which a Rajpoot throne is designed) in Saka 1737 (A.D. 1681). A circumstance occurred at his birth, which as descriptive of manners may deserve notice. A few hours only intervened between his entrance into the world and that of another son called Bheem It is customary for the father to bind round the arm of a new-born infant a root of that species of grass called *amirdhob*, the 'imperishable' *dhob*, well known for its nutritive properties and luxuriant Vegetation under the most intense heat. The Rana first attached the ligature round the arm of the youngest, apparently an oversight, though in fact from superior affection for his mother. As the boys approached to manhood, the Rana apprehensive that this preference might create dissersion, one day drew his sword, and placing it in the hand of Bheem (the elder), said, it was better to use it at once on his brother, than hereafter to endanger the safety of the state. This appeal to his generosity had an instantaneous effect, and he not only ratified, "*by his father's throne,*" the acknowledgment of the sovereign rights of his brother, but declared to remove all fears, he was not his son if he again drank water within the pass of Dobari;" and, collecting his retainers, he abandoned Oodipur to court fortune where she

**might be kinder. The day was sultry, and on reaching the barrier he halted under the shade of a sacred fig-tree to bestow a last look upon the place of his birth. His cup-bearer *(Panairi)* brought his silver goblet filled from the cool fountain, but as he raised it to his lips, he recollected that his vow was incomplete while within the portal; he poured the libation on the earth in the name of the Supreme, and casting the cup as an offering to the deity of the fountain, the huge gates closed upon the valley."]**

## పంచమదృశ్యము

ఢిల్లీనగరమందు యశవంతసింహుని భవనమందలి రెండవ యంతస్తుపైగల యాగారము. అపరాహ్ణకాలము.

దుర్గాదాసు సోదరుండగు సమరదాసును, యోధపురసామంతులును, యుత్తేజితులై నిలువంబడి యుందురు.

విజయసింహ—అట్లైన నీవు మన కార్యమంతయు విఫల మొనరించి వచ్చితివా ?

సమర—విజయసింహా! నేఁ గ్రోధసంవరణ మొనరింప నేర్చుకొని యుండలేదు.

ముకుందసింహ—అట్లైన నీ వచటి కేల యరిగితివి ?

సమర—ఒక్క యుద్దేశ్యముతోనే పోతిని.—ఆ పాపిష్టి నొకమాఱు సమ్ముఖమునఁ జూడఁదలచితిని. చూచియే వచ్చితిని. అంతకంటె వేరుద్దేశ్యమేమియు లేదు. చక్రవర్తిసముఖమున నెట్టి భిక్షఁగాని వేఁడ నేఁబోయి యుండలేదు. ఆకర్జమును దుర్గాదాసునే కావింప నిమ్ము. నాకుఁ గౌశలముకాని, చాతురముకాని లేదు. నాకు సహాయులు భగవానుఁడును, యీాతరవారియు మాత్రము లే!

సుబలదాసు—సేనాధిపతి యింకను రాలేదేమి ?

విజయసింహుఁడు—చక్రవర్తి యాతనిని మాయోపాయముచే బంధించి యుండఁడుకదా ?

సమరదాసు—[ఆకస్మికముగఁ జీత్కారమొనరించి] ఏమి !—అది సంభవమా ! !

సుబల—సమరా ! కాదు ! సేనాధిపతి చాల సతర్కుఁడుకాక, యే కార్యమందును కరమిడఁడు.

ముకుంద—ఈ దుర్దినములందాతఁడే మనయాశ. ఇదిగో ! తురీధ్వని వినఁబడుచున్నది. అడుగో ! సేనాధిపతి తురగము నడాయించుచు వచ్చుచుండెను !— ఓః ! ఎంత జవోపేతముగ వచ్చుచుండెను !

విజయ—నచ్చిపడెను ! రండు. క్రిందకుఁబోయి వార్తయేమోవిందము రండు.

సుబల—అంత తొందరేల ? ఆతనినే యిచటికి రానిండు.

[నేపథ్యమున దుర్గాదాసు స్వరముశ్రుతమగును. "సంసిద్ధులు కండు ! సంసిద్ధులుకండు ! !"

సమర—ఎందులకెందులకు !

సుబల—అడిగో ! దుర్గాదాసు పైకేవచ్చుచుండెను.

[ఘర్మార్తశరీరుండై దుర్గాదాసాయాగారమునఁ బ్రవేశించును.]

దుర్గా—అందఱు సన్నద్ధులుకండు.

సమర—ఎందులకు ?

దుర్గా—ఆత్మరక్షార్థము !

విజయ—సంగతియేమో తెలుపుము ?

దుర్గా—విస్తరించి చెప్పుటకిది సమయముకాదు. విశేషకాలము లేదు. చక్రవర్తి యశవంతునిపత్నిని వీడఁడు. ఆతనికి వారలు కావలయునఁట ! మహారాణి పుత్రపుత్రికల రక్షింపవలయును— ఇపుడే వచి మొగలాయి సైగ్రహమును ముటడించును !

విజయ—ఇపు డుపాయ మేమి?

దుర్గా—మీప్రాణముల సమర్పించుటే యుపాయము. వే ఉపాయ మేమియు లేదు. మిత్రులారా! మన రాణ్గారి కొఱకెవ రెవరసువులర్పించ సంసిద్ధులై యుంటిరి?

అందఱు—అందఱము సంసిద్ధులమయ్యే యుంటిమి!

దుర్గా—కాని, ప్రాణములు విడిచినంతమాత్రమున గార్యసాఫల్యము కానేరదు. బిడ్డల సహితముగ మహారాణికి మనము రక్షణ మొసంగ వలయును. ఈయాపదనుండి యెట్టులైన నామెను గట్టెక్కింప వలయును?

సరిగా నాముహూర్తమందే యశవంతునిపత్ని, ఆయాగార మందుఁ బ్రవేశించి, స్థిరస్వరమున నిట్లనును!—

'యశవంతతుని సతి నిరాధారయై యుండెను. దుర్గాదాసూ! ఆమెకొఱకై చింతింపవలదు. ఆమెపుత్రుని,—యోధపురవంశ ప్రదీప మును రక్షింపుము—మీతేని వంశమును గాపాడుము—యిదియే నా వేడికోలు! రాణికొఱకై భయ మొందనక్కఱలేదు. ఆమె నిర్భయ ముగఁ బ్రాణములు వీడఁగలదు—దుర్గాదాసూ! శిశువును మాత్రము కాపాడుము.'

దుర్గా—అమ్మా! ఆయత్నమం దెట్టి త్రుటియు నుండఁజాలదు— జననీ! శిశువు నిటకుఁ గొనిరండు.

[యశవంతుని సతి నిష్క్రమించును.]

దుర్గా—విజయా! కాశిమును పిలువుము.

[విజయసింహుఁడు నిష్క్రమించును.]

దుర్గా—అన్నా! వెలుపల నొక మిఠాయిగంప యున్నది. దానిని తీసికొనిరమ్ము.

పనుగ—మిఠాయిగంపా! ఎందులకు?

దుర్గా—ఇది తర్కసమయముకాదు. అన్నా ! పొమ్ము.

[సమరదాసు నిష్క్రమించును.]

దుర్గా—ముకుందదాసూ ! అడిగో ! కాశిమ్ వచ్చుచున్నాడు.

ఈసమయమున విజయసింహ కాశిములా యాగారమందుఁ బ్రవేశింతురు. కాశిము దుర్గాదాసున కభివాదన మొనరించును.

కాశిము—హుజూర్ ! ఏమియాజ్ఞో సెలవిండు.

దుర్గా—కాశిమూ ! నీ వొకకార్య మొనరింపవలయును. మహారాజు కుమారుని రక్షింపవలయును. తల్లికరములనుండి వాని నూడవెతికి కొనిపోవుటకై మొగలాయిసైనికు లిప్పుడే యీతావునకు వత్తురు—నీవు వానిని రక్షింపవలయును.

కాశిమ్—హుజూర్ ! ఏలినవారి యాజ్ఞప్రకార మాచరించెదను. పిల్ల బాబయ్యగారి నేలా కాఁపాడవలెనో సెలవిండు.

[సమరదా సొక గంపఁ దీసుకొని ప్రవేశించును.]

దుర్గా—ఇదిగో ! నీ వీమిఠాయిగంపలోనుంచి, యశవంతుని బిడ్డను తీసుకొనిపొమ్ము. నీవు ముసల్మానుండవు. ని న్నెవరు శంకింపఁ జాలరు—తెలిసినదా ?

కాశిమ్—హుజూర్ ! ఎచటికి తీసుకొనిపోవలెను ?

దుర్గా—దూరమందున్న, ఆ మందిరమును చూడుము—చూచితివా ?

కాశిమ్—చూచితిని బాబయ్యా !

దుర్గా—ఆ మందిరమందున్న పురోహితునకు శిశువు నిచ్చి రమ్ము. తదనంతర మేమి గావింపవలెనో యాతఁడే యెఱుఁగును. మొగలాయిసైనికు లిప్పుడే వచ్చి పడుదురు—శిశువు నిపుడే తీసుకొని పోవలెను.

కాశిమ్—మీ యాజ్ఞప్రకార మాచరించెదను. బాబయ్యగారూ

పిల్లవానికొఱకు నేను నా ప్రాణములను విడువఁగలను!

దుర్గా—అట్లని నే నెఱుంగుదును. లేకున్న నీభారమును నీపై మోపకనే యుందును.

[శిశువుఁ గొని రాణి ప్రవేశించును.]

దుర్గా—మహారాణీ! శిశువును కాశిము కరములం దుంచుడు.—ఏమియు భయములేదు. అమ్మా! నాపలుకుల విశ్వసింపుఁడు.

రాణి—దుర్గాదాసూ! నీవు చెప్పినపుడు నా కేమియు సందియము లేదు—కాశిమూ! నీవు కూడ ధర్మానువర్తివే కదా?

కాశిమ్—అమ్మా! ఏమియు భయములేదు! నే నీబాలుని నిజాసువులకంటె నెక్కుడుగ నెంచి కొనిపోదును.

[కాశిమ్ శిశువును రాణికరములనుండి తీసుకొనును. రాజ్ఞి శిశువును కాశిమ్ హస్తములనుండి తీసుకొని, చుంబన మొనరించి, గద్గదస్వరమున]—బిడ్డా!—

దుర్గా—బిడ్డనీయుఁడు—ఇఁక సమయములేదు.

రాణి—[మరల బాలునిఁ జుంబన మొనరించి, కాశిమ్ కరములందు వాని నిడుచు]—కాశిమూ! ధర్మమే సాక్షి!

కాశిమ్—అమ్మా! ధర్మమేసాక్షి! జననీ! ఏమియుభయములేదు-(ఇట్లనికాశిమ్ బిడ్డను గంపలోనుంచి దానినిశిరముపై నిడుకొనును)

సమర—ఒకవేళ పట్టుబడితే?

రాణి—పట్టుపడిన, నీ ఛురికమును పట్టువానితోమ్మున గ్రుచ్చుము. నీ కంఠమునఁ బ్రాణములుండ బాలునెవరునుయవ్వారంగ జేబుకడకు గొనిపోలేకుందురుగాక!

(కాశిమునకు ఛురికము నొసఁగును.)

దుర్గా—జననీ! ఏమియుభయములేదు!—(కాశిము నుద్దేశించి)—పొమ్ము. ఈ వెనుక ద్వారమునుండి వెడలిపొమ్ము.—రమ్ము.

ద్వారముఁజూపెదను.

దుర్గాదాసు నడువసాగును. శిరమందు గంప నిడుకొని కాశీ మాతని ననుసరించి నడచును- వారల ననుగమించి రాజ్ఞివెలుపల కరుగును.

విజయ—దుర్గాదాసూ! ఏమినీబుద్ధి! నీయుపస్థితబుద్ధి (Presence of mind) కడుశ్లాఘనీయము. నీకు నే ధన్యవాద మొసఁగుచుంటిని.

సుబల—ఈ కార్యముల నన్నింటిని దుర్గాదాసుసామ్రాట్టుకడకరుగక పూర్వమే సరిపఱచుకొని పోయెనని నేనుసిక్కముగ వక్కాణింపఁ గలను.

ముకుంద—అదిగో! మొగలాయిసైన్యమరుదెంచుచున్నది!

విజయ—అవునవును! ఏమివాహిని!

సుబల—దానితో సేనాధిపతి దిలీర్ఖానుండెను!

దుర్గాదాసు— (మరలఁబ్రవేశించి) —మంచిది!-ఇఁక నిశ్చింతులమై యుండఁగలము. మొగల్సైనికులు వచ్చిపడిరి—యిప్పుడు మీారలు మరణింపసంసిద్ధులుకండు.

విజయ—ఇఁకఁ దక్కుంగల కాంతలేమగుదురు?

దుర్గా—వారల గాపాడు యుపాయము నేను రోయుదును—చక్రవర్తి కడకుఁ బోనిపూర్వమే నా విషయము భావించియుంటిఁగాను? అన్నా! వారలఁ దీసుకొనిరమ్ము.

(సమరదాసు మరల వెలుపల కరుగును)

ముకుంద—అదిగో! మొగలు సైన్యము సమీాపించినది;

విజయ—ఫెళ్లు ఫెళ్లుమని తుపాకులఁ బేల్చుచుండిరి!

సుబల—ద్వారము బ్రద్దలుచేయఁ బ్రయత్నించుచుండిరి!

ముకుంద—అగ్ని రగుల్కొలుపుచుండిరి! భవనమును భస్మీభూతము సేతురు కాఁబోలు!

దుర్గా—ఆహా! కాంతల రక్షింపఁజాలకపోతినికదా! ఇఁకసమయము లేదు.

(వనితలఁదోడ్కొని సమరదాసాగదిలోఁ బ్రవేశించును.)

దుర్గా—తల్లులారా! నేఁడొక కఠోర విధానము సలుపవలసివచ్చెను. నేఁడు మీరందఱుహుతాశనున కాహుతులు కావలయును.

ఒకప్రౌఢనారి—సేనాధిపతీ! అదిమాకుఁ గ్రొత్తకాదు! మేము క్షత్ర రమణులము. మీ త్రియన మాకు భయములేదు.

దుర్గా—అమ్మా! ఇపుడన్యోపాయ మేమియులేదు! మేముకూడ మరణింపఁబోవుచుంటిమి —తల్లులారా! ఇఁకపొండు!!—ఆగదిలోఁ బ్రవేశింపుఁడు!!!—ఆగదియంతయు వారుద [Ordnance] ములతోనిండియున్నది. అందుమీరలు నిలుచుటకుఁజాలిన తానము మాత్రముండెను. పో యువారుదముపై నిలువంబడుఁడుతదుపరి,- తల్లు—లారా!—యిఁక—నేమం—దును?—

ఉక్తినారి—(పై జెప్పినకాంత)—తదుపరి నేను స్వహస్తములతో నా వారుదములం దనలము నగులొల్పెదను! అక్కలారా! రండు.

(ఆలులాయితకేశయై, రాణి ఆ యాగారమందుఁ బునఃప్రవేశ మొనరించును)

కాంతలు—రాణీమాతకుజయమగుగాక!

రాణి—జయమా!—మన జయము మృత్యువే! సమయింపఁబోవుచుంటిరా?—పొండు! స్వర్గధామమునకుఁ బొండు!—నేను మిమ్మనుసరించి నేఁడురా.ు. సాధ్యమైనయెడల, నేఁటికి నేను మనెదను!—దుర్గాదాసూ!—ఇపుడే యసువులవీడ వాంఛించితిని! "ఇంకను సమయముకాలేదు.—నీపనియింకను శేషించియున్న" దని యంబరమునుండి యెవరో నన్నుఁ బిలచి చెప్పిరి. నేఁటికి నేను బ్రతికెదను. అశరీరవాణియాన! దుర్గాదాస్! సాధ్యమైన, నన్నీ

దినము—యీ యొక్క దినముమాత్రమే నన్ను రక్షింపుము. [నతజానువయ్యె, కరకమలములు ముకుళించి] ఈశ్వరా! జగదీశ్వరా పరమేశ్వరా!!! నేఁటికి మాత్రమునన్నుఁ గావుము! [లేచి]—తదుపరి?—తదుపరి?—దేశము నందనలము రగుల్కొలిపెదను! సప్తసింధువనముచే నైన నార్పజాలని మహాస్ఫులింగమును! జ్వలించెదను!

దుర్గా—మాతా! సాధ్యమైన నేఁడు మాప్రాణములతో మిమ్ముఁ గాఁపాడెదము.—తల్లులారా! మీ రిఁకఁ బొండు! ద్వారముబ్రద్దలు కానున్నది! [కాంతలందఱు "జయ్ మార్వార్ మాతకు జయ్! జయ్! మార్వార్ మాతకుజయ్!! జయ్! మార్వార్ మాతకు జయ్!!!"

[అని యుచ్చైస్స్వరమునఁ బలుకుచు నిష్క్రమింతురు.]

రాణి—దుర్గాదాసూ! అట్లైన నడువుము.—నేను పుత్రినిఁగొని వచ్చెదను. దానిని విడచిపోఁజాలను. అంతమున్న నిడుకొనివత్తును—మీ రిఁక ముందునకు లంఘింపుఁడు.

[ఇట్లని మహారాణి నిష్క్రమించును.]

దుర్గా—అన్నా!

సమర—ఏమితమ్ముఁడా!

దుర్గా—అట్లైన ప్రాణములఁ ద్యజింప ముందునకురమ్ము.

సమర—నడువుము.

దుర్గా—ఒకించుక తాళుము. ఈకాంతలయంతముకాంచి, పోదము. అదిగో! అదిగో!!— [భీషణదారుణశబ్దము] ఆహా! ముగిసెను! సర్వము ముగిసెను!!—అన్నా! ఇఁక నడువుము.

సమర—నడువుము.

దుర్గా—సోదరా! సోదరా!! ఇదేకడసారిచూపు కాఁబోలు. మర

ణించుటకు బూర్వమొకమా ఆలింగన మాచరించు కొందము రమ్ము!

[ఇరువురు భ్రాతలు యాలింగనమాచరించుకొందురు.]

The paralled historical passage is:—

"In the midst of the furious contest, this infant prince was saved. To avoid suspicion the heir of Marwar concealed in a basket of sweetmeats, was entrusted to a Mooslem (Kasim) who religiously executed his trust and conveyed him to the appointed spot, where he was joined by the gallant Doorgadas with the survivors who had cut their way through all opposition, and who were doomed often to bleed for the prince thus, miraculously preserved."

### షష్ఠదృశ్యము

చక్రవర్తియంతఃపురమందిరము—ప్రభాతకాలము.

ఔరంగజీ బేకాకియైయుండును.

ఔరం—ఏమి!—యశవంతునిపత్ని రెండువందలయేఁబది సైనికుల మాత్రముగాని, యైదువేల మొగలాయిసైనికుల వ్యూహమును భేదించివైచి వెడలిపోయెనా!—మొగలైనికుల కధినాయకుఁడు స్వయముగ దిల్లీర్ఖానేకదా!—అట్లైన నిట్లాయెనేల?—ఇందేదో రహస్యముండియుండును!—దౌవారికా!—

నేపథ్యమున—ఏమి ప్రభూ!

ఔరంగ—సేనాధిపతి నొకమాఱు పిలువుము.

నేపథ్యమున—జోహుకుమ్ [చిత్తము ప్రభూ]

ఔరం—ఇపుడు సామ్రాజ్ఞికి ముఖముఁ జూపు టెట్లు?—అవమానముచే నా యంగప్రత్యంగములు జ్వలించుకొని పోవుచుండెను!

[వేగముగ గుల్‌నేయూం రాయూగారమునఁ బ్రవేశించును.]

గుల్‌నేయార్—సామ్రాట్టూ—ఇది సత్యమేనా?

ఔరం—ఏమి?

గుల్—యశవంతుని పత్ని రెండువేలాఱుల నేఁబది సైనికుల సాయమున మొగలు కటకమును భేదించి వెడలిపోవుట!

ఔరంగ—ప్రియతమా!—అది సత్యమే!

గుల్—ఏమి! ఇట్టి సైన్యముతోడను,—యిట్టి సేనాధిపతితోను,—యిట్టి మహాశక్తితోడను నీవు భారతవర్షపాలన మొనరింపఁ గోరుచుంటివా?

ఔరం—ప్రియతమా—

గుల్—సామ్రాట్టూ! మరులుకొలుపు పలుకుల ప్రయోజన మేమియు లేదు! సామాన్యవాంఛ నొండు పూర్తి మొనరింపుమని యడుగఁ బరిణామ మిట్లు సూపితివి!

ఔరం—యథాసాధ్యము సలిపితిని!

గుల్—యథాసాధ్య మీవు సలిపితివా?—నీకైన సాధ్యమిదియా!—"నేఁడు నాకరములందుఁ బడి, మొగలు రాజశక్తి యత్యధికముగ క్షీణించినకతన నారితొక రుక మ్రుష్టిమాత్రపు సైనికుల దోకొని, నాకు గల యణుమాత్రపుశక్తిం గూడ దీర మొనరించి,—చూర్ణముగావించి,—దలితము సలిపి వెడలిపోయెనని సెప్పఁ దలఁచుచుంటివా? సామ్రాట్టూ! నీశక్తి యంతగ సన్నమై పోయెనా?—హిందూనారికంటె దుర్బలుఁడవై పోతివా?—'అది సత్యమే' యని చెప్పుటకు నీకు సిగ్గగుచుంటలేదా? ఇపుడు తలయెత్తి యేల నాతోఁ బ్రసంగింప సాహసించుచుంటివి?

[ఔరంగజీ బుత్తర మీయక నతముఖుఁడై యుండును.]

గుల్—ఆజాణ యిపు డెచట నున్నది?

ఔరం—[ఒకించుక శిరమెత్తి]—ఏజాణ ?

గుల్—ఏజాణఁ గాంచి బెగ్గిలితివో యాజాణ!

[ఔరంగజీబు నీరవుఁడై యుండును.]

గుల్—యశవంతుని సతి యిప్పు డెచట నున్నది ?

ఔరం—ఆమె ప్రాయశః యిప్పుడు మీవారు నందు రాజసింహుని యాశ్రయమందుండి యుండును.

గుల్—అట్లైన మీవారును ముట్టడింపుము—యశవంతుని పత్నీ పుత్రుల వేళంబ నాకడకుఁ దోడితెమ్ము.

ఔరం—సామ్రాజ్ఞీ! ఈ విషయమున వివేచన మొనరించెదను.

గుల్—వివేచనమా ?—బేగమ్ గుల్నేయారుయొక్క యిచ్ఛ మాత్రమే. సామ్రాట్ యౌరంగజీబునకు యుద్దేష్టముకాదా ? [Is not the very intention of the Begum quite sufficient for the Emperor?] ఆయిచ్ఛవిషయమై వివేచనము కూడ గావలయు నా?—వినుము—నేఁ జెప్పుదానిని వినుము!—నాకు యశవంతుని జాయ తప్పక కావలయును. ఆమె స్వర్గమం దుండినను, మర్త్యమం దుండినను, పాతాళమం దుండినను, నాకామె తప్పక కావలయును. నీవు తక్షణమే మీవారు నాక్రమణ మొనరింపుము.

ఔరం—ప్రియతమా—

గుల్—నే నిఁక నేమియు విన నిచ్ఛగింపను—మీవారును ముట్టడింపుము !

ఇట్లని సామ్రాజ్ఞి గభీరాభిమానమున నాగారమునుండి వెడలి పోవును. ఔరంగజీ బొక్కరుం డాగదిలోఁ బచారి చేయుచుండును.

ఔరం—నే నీవిషయమును విశ్వసింపఁ జాలకపోవుచుంటిని. రెండు నూఱుల యేఁబది రసపుత్రసైనికులు మాత్ర మైదువేల మొగలు

యోధుల వ్యూహమును భేదించి పోయిరా! నిక్కముగ నిందు విశ్వాసఘాతకత యుండి యుండును!—కాని సేనాధిపతి దిలీర్ఖాను విశ్వాసఘాతకత గావించునని మాత్ర మెట్లు విశ్వసింతును? దిలీర్ఖాను బాల్యమున నామిత్రుఁడు; యౌవనమున సహాయుఁడు; వార్ధక్యమున మంత్రి; అతఁడు సరళస్వభావుఁడు, సుహృదుదారుఁడు, నిర్మలచిత్తుఁడు—అట్టి దిలీర్ఖాను విశ్వాసఘాతకతఁ గావించునా—అది విశ్వసనీయము కాదు—దానిని నేఁ దలఁపనైన దలఁపఁజాలను! కాని, రెండునూఱుల యేఁబదుగురు రసపుత్రులైదు వేల మొగలువీరులఁ బ్రతిఘటించి బాహిరమునఁ బడిరి! ఆ మొగ ల్సైనికుల సేనాధిపతి నిర్భీక, పరాక్రమోపేత వీరవరుండైన దిలీర్ఖాను!—ఇట్లని నే నెట్లు విశ్వసింతును?—నిశ్చయముగ దీనియం దేదేని గూఢరహస్య ముండక మానదు—అడిగో! దిలీర్ఖా నిట్లే వచ్చుచున్నాఁడు!

దిలీర్ఖాను ప్రవేశించి యభివాదన మొనరించును.

దిలీరు—వందేగి జాంహాపనా! [ప్రభూ! సలాము.]

ఔరం—దిలీర్ఖానూ! ఈవార్త సత్యమో లేక యసత్యమో యని యెఱుంగ, నిన్నిత్తావునకు రావించితిని. రెండువందల—

దిలీర్—దేవర వినిన దంతయు సంపూర్ణసత్యము.

ఔరం—నేఁ జెప్పుదానిఁ బూర్తిగఁ జెప్పనిమ్ము—రెండువందల యేఁబది రాజపుత్రసైనికులు మాత్ర మైదువేల మొగలాయి శూరులఁ ద్రొక్కివైచి, వెడలిపోవుట నిక్కమేనా?

దిలిర్—ప్రభూ! అది నిక్కముగ నిక్కము!!!

ఔరం—ఆ సైన్యమున కధినాయకుండవు నీవేనా?

దిలీర్—అవునుజనాబ్ (అవునుప్రభూ)

ఔరం—యుద్ధ మొనరించితివా?

దిలీర్—చిత్తము. ఈ యుద్ధమందు మనయైదువేలసైనికులందైదు నూఱులయోధులుమాత్రము కొనప్రాణములతో నిలచిరి. రసపుత్రసైనికులందైదుగురుమాత్రము మిగిలిరి!

ఔరం—యశవంతునియర్ధాంగియేమాయెను?

దిలీర్—సామంతసహితయై యామె యుదయపురాభిముఖముగఁ బోయెను.

ఔరం—శిశువేమాయెను?

దిలీర్—ప్రభూ! శిశువు నా సైన్యాభ్యంతరమందెచ్చటను గాంచలేదు. కాని యశవంతుని పత్నివక్షముపై మూఁడేండ్లబాలిక మాత్రముండెను.

ఔరం—రెండునూఱులయేఁబది సైనికులమాత్రమే వెంటనిడుకొని యరుదెంచిన యొక యాఁడుదాని గతిఁ బ్రతిరోధమొనరింపనేరకుండుటకు, మొగలుసైన్యము మేషడింభముకంటె నధమంబై పోయెనా?

దిలీర్—ప్రభూ! ఏమైపోయెనో నే నెఱుంగను!—కాని, యన్నారీశిరోమణి, నిరవగుంఠనయై, యాలులాయితకేశయై, వక్షమున సుషుప్తిమగ్నయైన పసిపాప నిడుకొని మొగలువాహినీవ్యూహసమ్ముఖమున నిలువంబడి నపుడామె రెండు నూఱులయేఁబది సైనికులు రెండునూఱులయేఁబదిలక్షల మహాయోధులైనట్లుతోఁచెను. మొగలైన్యకృష్ణమేఘముపైనుండి యా కాంత శమంతకము విద్యూతము వడువున వెడలిపోయెను. ఎవ్వరామెను స్పృశింపఁ సాహసింపఁజాలరైరి!

ఔరంగ—నీవేమి చేసితివి?

దిలీర్—ఆ యపూర్వమాతృమూర్తిని విలోకించుచు, దూరంబున నిలువంబడితిని! “యశవంతునిపత్నిని పట్టుఁ” డని యనఁబ్రయు

త్నించితిని; కాని, కంఠముఋద్ధమైపోయెను! పిధానమునుండి తర వారిని వెలిదీయ గమకించితిని; కాని, కరవాలమొరనుండి వెలుపలకు రాలేదు! పిస్తోలుదీసితిని!—కాని, యది కరమునుండి వసుంధరపై బడిపోయెను!!

ఔరం—దిలీర్ఖానూ! నీవు యున్మాదుఁడవై పోతివా?

దిలీర్—ప్రాయశః యట్లేయైతిని! ఎట్లయితినో యెఱుంగను. కాని, యాముహూర్తమందు నే నన్యవ్యక్తినైనట్లు నాకుఁ దోఁచెను! ఒక్కముహూర్తములోనెవరోయరుదెంచి నాహృదయద్వారమున నాఘాత మొనరించి రుద్ధద్వారమును దెఱచినట్లాయెను. నూతన జగంబొండు గాంచితిని!

ఔరం—అందుచే నీవైదు వేల సైనికులవెంట నిడుకొని, తుఱకవయ్యు మొఱకుపగిది కదలక మెదలక నిలువంబడివింతఁజూచితివా?

దిలీర్—ప్రభూ! అవును. అదొక మహిమామయదృశ్యము! అదెట్టి మహిమ! ఆశ్చర్యము!—ఆ లులాయితకేశయైనవనారి! ఆమ్మపై నిదురించు పసిపాప!—ఆహా! ఏమిదృశ్యము!—నిర్మేఘయుషాకంటె నది నిర్మలమైనది! వీణాఝంకారముకంటె సంగీతమయమైనది!— ఈశ్వరనామముకంటె బవిత్రమైనది!—ఏమి యామూర్తి!—వజ్రాహతువడువున నిలువఁబడిపోతిని!

ఔరం—తదుపరి?

దిలీర్—తదనంతరమున నామూర్తి యంతర్హితముకాగా నేచేతనుఁడనైతిని. 'ఆక్రమణ మొనరింపు' డని బిగ్గఱగ నఱచితిని! మా మైదు వేలతరవారులు సంధ్యాలోకమున నేత్రములు మిరుమిట్లు గొలుపుతెఱంగునఁ బ్రకాశించెను. విపక్షులుపోర మరల నిలువంబడిరి! విదారణ మారంభమాయెను! భూమికంపమందలి వాలు స్తూపములవడువున సైనికులందఱు వసుమతిపై గూలసాగిరి. సం

గ్రామము శేషించినపిదపజూడగా మనసైనికులం దేనూర్గురు మాత్ర మవశిష్టులై యుండిరి;—విపక్షపక్షయోధుం డొకండైన గానంబడలేదు. మృతులైనవారినడుమ నెంతవెతకినను, దుర్గాదాసుసమరదాసులు కన్పింపలేదు!

ఔరం—దిలీర్! నీ వాడుదానికంటె నధముండవు! పొమ్ము! నీ ముఖమిఁకఁ జూడరాదు.

[ఉభయులు చెరియొకదిక్కుగా నిష్క్రాంతులగుదురు.]

## సప్తమదృశ్యము

రాణా రాజసింహుని బహిర్గృహము—అపరాహ్ణకాలము. రాజసింహుఁ డుచ్చాసనమందుఁ గూరుచునియుండును. సమ్ముఖమున శిశుహస్తయై యశవంతసింహునియర్ధాంగి మహామాయనతజానువయై కూరుచునియుండును. దక్షిణపార్శ్వమున దురాదాసు కాశిము లుందురు.

రాణి—రాణా! నా యీబిడ్డకుఁ గృపాపూర్వకముగఁ దమ దుర్గమందు స్థానమొసఁగుఁడు. విశేషదినములవఱకుగాదు—కొలఁది దినములవఱకు మాత్రమే!

రాజ—మహామాయా! నీ నందనుఁడు నా కన్యుఁడుకాఁడు. దీనికొఱకై యింతగా వేఁడనక్కఱలేదు—దుర్గాదాసూ! ఔరంగజేబీ శిశువునుకూడ వధింపనుంకించుచుండెనా?

దుర్గా—కాకున్న, మఱేమి యుద్దేశ్యమై యుండును?

రాణి—మహారాణా! ఒకపుత్రుఁడు, నొకపుత్రిక—యీసంపత్తి మాత్రముఁగొని, యానాఁడు ఢిల్లీనుండి బయల్వెడలితిని. పథమందుఁ బుత్రిఁ గోల్పోతిని! నాసంపత్తియం దవశిష్టమైయున్న దీపసికూనమాత్రమే! రాణా! నాయీ శేష, యేకమాత్ర, సర్వ

స్వధనపుత్రుని రక్షింపుఁడు. ఈశ్వరుఁడు మీకు మంగళ మొసఁగును.

రాజసింహ——రాజ్ఞీ! నీ నందనునికొకకైన సుంతైన వంతఁజెందకుము. నీ శిశువును నేను నిజాశువులతోఁ గాఁపాడెదను.

రాణి——దేవరకు జయమగుఁగాక!

రాజసింహ——దుర్గాదాసూ! ఔరంగజేబు దౌరాత్మ్యము క్రమ క్రమముగ హెచ్చుచున్నది. అతఁడు హిందువులపై మరల జిజియాపన్ను విధించెను. అంతియకాక మా న్వారాధిపుఁడైన యశవంతసింహునిపత్ని కీదృశదారుణ యవిచారము సూపసాహ సించెను!——పత్ర మొండు లిఖించి, సావధానుఁ గావించి, వాని యాచరణముల నివృత్తిగావింపఁ గలుఁగుదునేమో యత్నించి చూచెదను.

మహామాయ——పత్రము లిఖించియా?——దుర్మార్గమును మానుమని యనునయ మొనరించియా? నతజానువులై బిచ్చవేఁడియా? ఇఁకేల? ఇఁక తడవేల! ఈమాఱు నేనే యవనరాజ్యోచ్ఛేద మొనరించెదను.

రాజసింహ——రాజ్ఞీ! వినాబాహు రక్తపాతమున నది సిద్ధికానేరదు. ఒకరాజ్యము ప్రతిష్ఠితమైనపు డద్దానిని ధ్వంశమొనరింపఁజూచుట న్యాయము! అట్లొనర్చుటకుమాఱు దానిని మఱింత సుప్రతిష్ఠిత మొనరింపఁ బ్రయత్నించు టుచితము!

మహామాయ——విజాతిశాసనముఁ గాఁపాడు టుచితమా?——ఇది క్షత్రధర్మమా?

రాజసింహ——రాజ్ఞీ! క్షత్రధర్మము కేవలము వధఁగావించుటకాదు! వధవిద్య యొకయుచ్చాంగవిద్యగాదు. ఆర్తరక్షార్థముకాక యన్యోద్దేశ్యమునఁ గావింపఁబడువధ హత్యనాఁబరగు.

పిదప రాజసింహుఁడు (కాశిము విలోకించి) ఈతఁడెవరు?

దుర్గా—కాశిముల్లా. మా పురాతనమిత్రుఁడు. ఈతఁడు నిజాసులఁ దుచ్ఛ మొనరించివైచి నాప్రభుపుత్రుని రక్షించెను!

కాశిమ్—మహారాణా! నేను వీరల పూర్వభృత్యుండను. మహారాజొకమారు నన్నొక మహావిపత్తునుండి రక్షించెను. అప్పటి నుండి నేను వీరిం గనిపెట్టుకొనియుండి, దయాపూర్వకముగ వీర లొసఁగు యన్నవస్త్రములతో జీవనము సలుపుచుంటిని.

రాజ—దుర్గాదాసూ! కాశిమ్‌కూడ ముసల్మానుజాతివాఁడేకదా?

కాశిమ్—మహారాజా! మాజాతిని నిందింపకుఁడు. మాజాతి పాడు జాతికాదు. మే మేమైన గావచ్చును; కాని, విశ్వాసఘాతుకులము కాఁజాలము!

రాజ—కాశిమూ! మీజాతిని నిందించుటలేదు. కాని, పాదుషాకును నీకునుగల భేదమును యోచించుచుంటిని! పాదుషా యీ శిశువును సమయింప సమకట్టెను. పాదుషావలె ముసల్మానుండ వయ్యు, నీ వీ పసికూనను—

కాశిమ్—ఆహా! చూడుఁడు! ఈబిడ్డఁజూడుఁడు! ఇంకను కండ్లు తెఱువలేదు!—ఎండలోను, చలిలోను చాల బాధపడ్డావుబిడ్డా! చంటినాయనా! ఇపుడు మెల్లమెల్లగాఁ బెదవిఁ గదపి కొంచెము కొంచె మేడ్చుచున్నావు!— ఆహా! యివి కండ్లుకావు—నీల పద్మములు!

రాజసింహ—ఔరంగజీబూ! నీవు ఢిల్లీసింహాసనమున నాసీనుఁడవై యొక నిరీహశిశువును హత్యగావింప వ్యగ్రుండవై యుంటివి; మఱి నీజాతివాఁడేయైన యీ కాశి మాశిశువును నిజప్రాణములతో గాఁపాడ సమకట్టెను!—ఔరంగజీబూ! ఈశ్వరచక్షులందు మీ యిరువురిలో నెవరెక్కుడో చెప్పుము.

Tod says "It is pleasing to find that if to 'the leader of the faithful' the bigoted Aurangzeb, they owed so much misery to one (and he of humble life) of the same faith, they owe the preservation of their live".

రాణి—రాణా! నేనీ ఘోరదార్జన్యమునకుఁ బగఁదీర్చుకొానెదను!— ప్రతిహింసకొఱకే, యానాఁడు నే నన్యనారులఁ గూడి మంటఁ గలియలేదు!— దానికొఱకే నే నింకను బ్రదికియుంటిని— మీ రీ శిశువునుమాత్రము కాఁపాడుఁడు!

రాజ—రాజ్ఞీ! ఈ శిశువుకొఱకై వందురవలదని నేఁ జెప్పుచునే యుంటిని. నీవును, నీ బిడ్డయుఁ గూడ నిచట నిశ్చింతహృదయులై వసింపుఁడు.

రాణి—ప్రభూ! నే నిచట వసింపను. నా యాలయమిదికాదు. నేను నా మృతవల్లభుని రాజ్యమునకు మగుడిపోదును. సంపదయందును, విపదమందును, సుఖమందును, దుఖమందును, శాంతియందును, విగ్రహమందును, జీవనమందును, మరణమందును, భర్తృనిలయమే నారియొక్క తావలము—పితృగృహమన్యము! నేను మార్వారు మరలిపోదును.

[The Indian literature is beamed with the flush of the great ideal expressed in this connexion by the spirited queen of Marwar.]

రాజ—జననీ! కాని యాస్థానమిపుడు నీకు నిరాపదమై యుండఁజాలదు.

రాణి—నిరాపదమా! నేనిపుడు నిరాపదము నన్వేషింప వచ్చితినా? ప్రభూ! ఇఁక నే నిరాపదము నన్వేషింపను. నేనిపు డాపదనే యన్వేషించుచుంటిని. ఆపదయొక్క క్రోడతలమందే నేను లాలితనైతిని; భూమికంపమున నాజన్మము; ఝంఝుమధ్యమున నాయావాసము; ప్రళయమేఘమున నాపర్యంకము— విషాదమా!

దానితో నేను మైత్రి సలిపితిని. నాకు విషాదమా—భర్తృరహిత నైననాకు,—పుత్రహారనైననాకు,—హృతసర్వస్వనైననాకు,—పథభికారిణినైననాకు విషాదమేమి?— ప్రభూ! ఒకేవిషాదము మాత్ర మవశిష్టమై యుండెను—అదీశిశువుహత్య! కృపాళులరై నాబిడ్డను రక్షింపుఁడు! ఇఁక నే నేమియు వేఁడను! నా కన్నతండ్రిని వీనిని కాఁపాడుఁడు. నేను మార్వారు మరలిపోదును! అగ్ని రగుల్కొలిపెదను!— అనలము జ్వలించెదను!—ఔరంగజేబును,—ఔరంగజేబునే యననేల, సమస్త మొగల్సామ్రాజ్యమును ధ్వంశ మొనరించి, చూర్ణముగావించి, భగ్నముసలిపి దిగంతములను మొగలుభస్మపూర్ణ మొనరింపఁగలుఁగు ఘోర దావానలము జ్వలించెదను! జ్వలించెదను!! జ్వలించెదను!!!

శ్రీ

# దుర్గాదాస్

## ద్వితీయాంకము

### ప్రథమదృశ్యము

ఢిల్లీప్రాసాదాంతఃపురస్థోద్యానవనము

సంధ్యాకాలము: ఔరంగజీబు పౌత్రియు, నక్బరు పుత్రియు నైన రజియా యేకాకినియై, అయ్యుద్యానవనమందు విహరించుచు బాడుచుండును.

గీతమాల

అంధకార ప్రపూర్ణమౌ యవనియందు;
నిఖిల విశ్వముఁ బూరించు నీరమందు;
జగముఁ జాలగ నొప్పించు ఝంఝయందు;
ఆశయను తెప్ప పీడకనంటియుండి,
నెగులతోడను యిలయందు బొగులలేను;
గరిమదోఁకొని చనియెదు కమలమిత్ర!
నీదు వెనువెంట నన్గూడ నెమ్మితోడ,
దోడుకొనిపొమ్ము దివినున్న వాడకిపుడు.

నికటస్థవకుళవసుమతీజశాఖోపరికులాయమునఁ గూరుచుండి కోకిల పాడుచుండును. ఏకాగ్రమనస్కయై, రజియా ఆ గానము వినుచుండును.

ఆ సమయమున గుల్నేయారు ప్రవేశించి పౌత్రిని 'రజియా!' యని సంబోధించును.

రజియా—ఊరకొనుము! కోకిల పాడుచుండెను.

గుల్—ఎట్టి తెలివిమాలిన పిల్ల! కోకిలపాట నెన్నఁడూ విననేలేదా?

రజియా—వినకేమి? వింటిని. వింటినని యిఁక వినఁగూడదా—ఆహా! ఏమి మధురగానము! వినుము!—అయ్యో! ఆగిపోయినది!—బామ్మయ్యా! ఈ జగమంతయు నొక యశ్రాంతఝుంకారమై పోయిన నుల్లమెంతయో యానందించుఁ గదా!

గుల్—ఆనందమా? ఆనందమే!—ఆనందమటులుండ, నిరంతరగాన ఝుంకారము కతనఁ బ్రాణము లోష్టగితము లగును! ఒక్కనుడువు నైన దెలుపుట యసాధ్యమగును.

రజియా—నుడువా? నుడువనిన నాకుఁ దలనొప్పి కలుఁగును! ఒక్కొక నుడువెంతయో యర్థముతో నిండియుండును! అందుచే దాని కెడను పెడనుకూడ యర్థమే యుండును. ఎందఱికినను యది వెన్నాడించుచు చిత్తమునకుఁ జాల యుత్తలపాటుఁ గలుఁగఁ జేయును. దాని కతనమందున కంజవేయుటే కష్టమై తోఁచును!

గుల్—గానమో?

రజియా—గానమందువా? దానియర్థమేమో తెలియనే తెలియదు! కేవల మొక యుదాసభావమునుమాత్ర మది మనసులోనికిఁ గొనివచ్చును! దాని గంభీరార్థ మెఱుఁగుట దుస్తరము. ఇదిగో! వినుము—"మల్లెలు, మొల్లలు, మఱివిరజాజులు" అని యనఁగనే స్పష్టముగఁ బదార్థము దెలియుచున్నది. కాని [భైరవి రాగాలాపమొ కించుకగావించి] 'మల్లెలూ మొల్లాలూ, మఱివి యీ రాజాయాజుయులూ' (అనిపాడి)-నీకేమి తెలిసినదో చెప్పుము! చూచెదను!!

గుల్—అవును నీవనినది నిక్కమే—దానియర్థము గ్రహించుట కష్టము. అది మధురంబుగమాత్రము తోఁచుచుండెను!

రజియా—బామ్మయ్యా! నీకు సంగీతమన నేమియు నిష్టము లేదని

మెఱుంగుదును! నేఁ బాడినపుడు, తెలియుచుఁ నీవు కినియుచుందువు. కాని, గానము నా కతిప్రియము. గానవారిధియందజస్రము మునుఁగఁగోరుదును?—ఉద్యానతలమం దేకతంబుండి సంగీతసుధచేఁ గర్ణములఁ దనుపుచు, సౌఖ్యపరవశనై యుందును. [కూనిరాగముఁ దీయుచు] 'మల్లెపూవుల సౌరభ ముల్లమునకు'— [అని పాడుచుండ]—

గుల్—పౌత్రీ! నీవు సంగీతము నెవరికడ నేర్చుకొంటివి?

రజియా—జనకునికడ [illegible] దక్షిణాసీమ శాస్త్రికడ నేర్చుకొంటిని. అతఁడు గొప్పవిద్వాంసుఁడు—సంగీతమం దతఁ డద్వితీయుఁడు. ఆతనియెడ జనకునకుఁ జాల గౌరవము కలదు. శాస్త్రిజీ శ్రావ్యముగఁ బాడునపుడు జనకుఁ డాతనిపార్శ్వమున గూరుచుండి మోహమున [illegible] గానకళ నన్నింటిని హృదయంగమము గావించుకొనుచుండును? జనకుఁడు స్వయముగఁ గొన్ని కీర్తనలరచించి శాస్త్రిజీ [illegible] రాగతాళములతో వానిని పాడుచుండు [illegible] కీర్తనల, [illegible] పాడుదుఁగాని, మా శాస్త్రీజీ చెప్పిన త్యాగరాజ సత్కృతులు [illegible] విశేషహర్షజనకంబులగుటచే వానినె యెక్కుడుగఁ బాడఁగోరుచుందును. వినదలఁతువేని వినుము:—

నాగవరాళిరాగము—ఆది తాళము

ప॥ నగుమోము గనలేని నాజాలి దెలిసి రఘువర నన్నుబ్రోవరారా నీ॥

అ॥ నగరాజ ధరనీదు పరివార లెల్లా ఒగిబోధన జేసేవారలు గారె।

అటు లుండదురాన॥ న॥

ఖగరాజ నీ యానతి విని వేగ చనలేదో।

ఖగనానిలకు బహుదూరం బనినాడో।

జగమేలే పరమాత్మ నెవరితో మొరలిడుదు।

వగజూపకు తాళను నన్నేలుకోరా త్యాగరాజ నుతనీ॥ న॥

—తనదరినాం తోంతోం తనదరినాం.....................

.....................[రాగాలాపనతోఁ గృతి ముగించి]

భాన్మతియమ్మా! ఈగాన మెట్లుండెను?

గుల్—అది సరిగా గుంటూరు గోంగూర పచ్చడివలె నున్నది!

రజియా—నాయనమ్మా! నీవు నిక్కముగ నాయనమ్మవే! గార్ధభమున కెంత రాగజ్ఞానమున్నదో, నీకంతైన లేదు—మంచిది! భామ్మా! నీ వెన్నడైన గార్ధభ రాగాలాపన వింటివా? అది నీ చెవులకుఁ జాల మధురముగ నుండక మానదు! అనగననగ రాగ మతిశయిల్లుచునుండు ననునట్లు గార్ధభస్వాములవారుకూడ, పాడి పాడి మంచికళలనే వేయుచుందురు. ప్రథమమున వారి రాగసంగతులు భయముఁ గొలుపును, కాని క్రమక్రమముగ వారి రాగాలాపనమును వినుచు దుదకొకే పెద్ద సంగతిలో బూర్తియగును. ప్రక్కనున్నవారి సోకులా రాగమును మరల నెత్తుకున్నయెడల బ్రహ్మానందమే మనయందుఁ గలుగకమానదని చెప్పవచ్చును!

గుల్—అవునట్లే చెప్పవచ్చును!

రజియా—సరే, భామ్మా! కోకిలస్వర మెంత మధురముగను, కాకస్వర మంతకర్కశముగను యుండునేల?—కోకిలస్వరమునుండియే గానసృష్టి మూలముగనని తోఁచెను. స, రి, గ, మ, ప, ధ, ని, స,- స, ని, ధ, ప, మ, గ, రి, స,—సరిగ కోకిలస్వరము—వినుము— కు, కూ, కు, కూ, కూ—సరిగనట్లే సుమా!

గుల్—నీ జనకునితో నీవు చాలకాలము వంగసీమయందుంటివి గదా! ఆ సీమగాన మేమైన నేర్చుకొంటివా?

రజియా—నేర్చుకొంటిని; కాని వంగదేశీయులు కీర్తనములు విశేషముగఁ బాడుదురు. అందుచే జనకుఁడు శాస్త్రిచే నాకు కృతు

లను జావళీలు తానవర్ణములాది దక్షిణగాన వస్తువులను నేర్పించెను. దేశభాషలన్నిటికంటెనాంధ్రభాష యెట్లుమధురముగనుండునా యాంధ్రగానము కూడ తక్కుంగల భాషల గానమునకంటె నధికమాధుర్యముకలిగియుండునని జనకుండు శాస్త్రికి పాడినప్పుడనుచుండువాడు. ఆస్వాద్యభాష కృతిని మఱొకండు పాడెదను వినుము:—

సురటరాగము—రూపక తాళము.

ప॥ భజనపరుల కేలగలుగు దండపాణి భయము రామ॥
అ॥ అజరుద్రసురేశులకైన నూన్యాన మొసగు రామ॥
అండకోట్లు నిండిన కోదండపాణి సుఖమున।
హృత్పుండరీకమున జూపి పూజనర్పి।
నిండుప్రేమతో కొలిచు నిష్కామము గను నరదా।
దండపాణి దాసుఁడైన త్యాగరాజు సేయు రామ ॥భ॥

మఱొకండు కృతిఁ బాడెద వినుము:—

భైరవి రాగము—రూపక తాళము.

ప॥ ఉపచారము చేసే వారున్నారని మరువకు రా॥
అ॥ కృపగావలెనని నే కీర్తిని బలుకుచు నుండగ॥
వాకిట నే పదిలము గావా। తాత్మజుఁ డున్నాడని
శ్రీకరులగు నీ తమ్ములు। జేరియున్నారని
యేకాంతమున సుజానకి। యేపడి యున్నదని
శ్రీకాంతపరులెవ్వరు। శ్రీత్యాగరాజవినుత ॥ఉ॥'

రజియూ—బొమ్మయ్యా! ఈ కృతు లెట్లున్నవి?

గుల్—ఒకటి యావకాయి పేషువలెను, మఱొకటి యుల్లిపాయి పకోడీవలెను యున్నది!

రజియూ—'ఎద్దున కేమి తెలియును యటుకులరుచి' యన్నట్లు నీకు

సంగీతరుచి యేమి తెలియును?—బొమ్మయ్యా! నీ వలెనే దాదాజీకి కూడ సంగీత మసహ్యముగ నుండును. ఆనమటపురం గూని రాగముం దీయుట వినిన యతడు చట్టున నాపై లేచును! నా యెడలం బ్రేమగలిగియున్నను, నాగానమున నాతని కంత కినుక యేలనో నాకు బోధపడకుండును!

గుల్—నీ తాతగారు నిన్నును జాల ప్రేమింతురా?

రజియా—ఓః! ఎంత ప్రేమించు నెంత ప్రేమించును! [కల్యాణి రాగాలాపన మొనరించి]—ఆ! బొమ్మా! ఆఆయియీయాయీ ఆతడు-తనకీ—నిన్న తోం, దనరినాం—కూడ—తోం—జాలా—ప్రేమించునుకదా! రీరీరీ."

గుల్—సన్నా!—అయినను నొకమాఱు నీదాదాజీ నడిగిచూడుము.

రజియా—[బేగడరాగముం దీయుచు]—"ఓసి! నాయనమ్మా! ఆఆఆ ఏమేవు నాయనమ్మా తోం తోం తోం. ఇంక దాదాజీ నేమి యడుగుదునే తరినాం [రాగము చాలించి]—బొమ్మయ్యా! దాదాజీ యెల్లప్పుడు నీయిష్టప్రకారముగానే నడచుచుండును. నిన్నుం దాను ప్రేమించునాయని యాతనిని వేఱుగ నడుగనేల?

గుల్—ఆతం డెన్నండును నామాట కడుగుదాటనికతననే, యిపుడు నాముదల నొదలదాల్చి యాతం డొక యాలమునకు సంసిద్ధుం డగుచుండెను!

రజియా—ఏమి!—ఆలమా!!—బొమ్మయ్యా! ఆలమననేమి?

గుల్—పోరాటము.

రజి—ఓః!—అదా! తెలిసినది. ఒకం డొకకత్తిం బూని, మఱొకం డింకొక కఠారిం బూని తదనంతర ముభయులు మృదంగధ్వానము ననుకరించి, తకుకుచుం దాఱుచు నృత్యమొనరించి వలయాకారముగం దిరుగుదురు—అట్టియాటనునేం జాలమాఱులు వంగసీమయం

దుఁ గాంచితిని. అయితే బామ్మయ్యా! ఇవుడాలమెవరితో జరగును?

గుల్—మీవారుతో.

రజయా—నాయనమ్మా! మీవారుమగదా, లేక యాడవాఁడా?

గుల్—ఛీ! మాలోకపుపిల్లా! మీవారొకసీమ!

రజయా—సీమంటే!—సీమంటే?

గుల్—సీమంటేనే యెఱుఁగవా? జల్లిసీమ, రెడ్డిసీమ, కోనసీమయని మీ శాస్త్రీజీ చెప్పుచుండుట వినలేదా?

రజ—వింటిని! బాబో! ఒక సీమతోనే యుద్ధమగుట?—ఏల?—బామ్మయ్యా! యుద్ధ మెందులకు?

గుల్—ఒకరాణినిపట్టి యీడ్చి తెచ్చుటకు.

రజ—నీవే యామెనట్లు తెమ్మని చెప్పుచుంటివి కాఁబోలు!

గుల్—అవును.

రజయా—పట్టి యీడ్చి తెచ్చి యామె నేమిచేతువు? ప్రేమపూర్వకముగఁ గవుంగిలించుకొందువా?

గుల్—కవుంగిలించుకొనను;— కాటిలోఁ బెట్టి, తరువాత శ్రాద్ధమొనరించెదను.

రజ—ఏమి! బ్రతికియుండగనే యట్లొనరించెదవా? మృతిఁజెందిన యనంతరమే యట్లు గావింతురని నేను వింటిని! కాని నీవు బ్రదికియుండగనే యక్కార్యములఁ గావింతువా? రామరామా! రఘురామా [అని]:—

శ్రీరాగము—ఆదితాళము.

ప॥ రఘువీరా రావదేరా।

అ॥ అఘదూరా యనుపమశూరా ॥రఘు॥

చ॥ చిన్నియన్నా చేరరావా।

నాకన్నులకరువెల్లదీర యో ॥రఘు॥

నీరదశరీర నిన్నే।
కోరియున్నా గురిగమున్నే యో ॥రఘ
కుంజరా భూధరవిహారా।
పదకంజములె నమ్మినారా యో ॥రఘు॥'

[అని పాడి రాగాలాపన మొనరించుచుండ యౌరంగజేబు యక్బరులు ప్రవేశింతురు]

ఔరం.—[పౌత్రి రాగాలాపననిని, విసుగున]—ఛీ! వూరుకో! మరల మొదలిడితివా?

రజియా—బాప్మయ్యా! చూచితివా దాదాజీ విసుకు—హాః హాః హాః—అని నవ్వుచు దూరముగ పదపడి నీరవమై నిలువబడి యిట్లు పాడనాగును:]

గీ త మా ల

ప్రణయపాశంబుతోడను ప్రాణనాధ!
గట్టివైచితి వీవు చేపట్టినన్ను,
నీదుపాదములకుఁ జాలనేర్పుతోడ;
ఇట్టినెయ్యము సూపగ, నిలను నాకు
నీవెపతివై చునుండుము నిక్కముగను;
జన్మజన్మములందును నన్ను తాఁగ!
అట్టు లయ్యెదవేని, నే నహరహంబు
భక్తి పుష్పాంజలినొసఁగి బరగుచుందు.

అనిపాడి, శుద్ధతోడిరాగ మాలాపన మొనరించుచుండ, నౌరంగజేబు మరల—ఛీ! పో!" యనును.

[రజియా మరలఁ గిలకిలనవ్వుచు బలాయన మొనరించును.]

ఔరం.—తనయా! పాలనా కార్యమందు శిక్ష బడయుదువని తలఁచి నిన్ను వంగసీమ కంపితిని. శాసనవిధాన మెఱుఁగుటకు మాఱు

నీవు నృత్యగీతములతోఁ గాలహరణ మొనరించితివి! ఈ పిల్లకుఁగూడ సంగీతము నేర్పితివి!—నీవిట్టి పనికిమాలినవాఁడవని నే నెఱుంగ నైతిని.

గుల్—నిజమునిజము. పిల్లకు సంగీతధోరణియేకాని, మతేధోరణి లేదు. ప్రసంగించు సమయమందుఁగూడ రాగాలాపన మొన రించు చుండును. దివారాత్రము లేదియో కూనిరాగముఁ దీయు చునే యుండును—ప్రాణము విసిగిపోవుచున్నది!

ఔరం—(తనయ నుద్దేశించి)—పిల్లను పూర్తిగఁ బాడుచేసితివి! భవిష్యమున దాని దినము లెట్లుగడచునో దెలియకున్నది! పోనిమ్ము—దానికేమి? ఆ విషయమై యథావిహితము సలుప వచ్చును. ఇపుడు నీవు మీవారు రణమున కరుగుము. ఏఁబదివేల సైనికుల నీకుఁ దోడిచ్చుచుంటిని. పోయి మీవారును ముట్ట డింపుము.

అక్బరు—చిత్తము.

ఔరం—నీవత్యంత యలసుండవనియు, విలాస సంభోగప్రియుండ వైతి వనియు వింటిని. జీవనకఠోరత నోకించుక నేర్చుకొనుటయవసరము. మీవారు యాహవమున కంపుటకే నిన్ను వంగభూమినుండి రావింపలేదు. ప్రధానతః నీ సంస్కారార్థము నిన్ను బిలపించి తిని. ఇఁకఁ బోయి పోరునకు సంసిద్ధుఁడవుకమ్ము. సేనాధిపతి యగు దిలీర్ఖాను నీకు సహాయుఁడగును. నేనును, యజీమును దోవారి (Dovari) పోయి మీజయలాభముఁ బ్రతీక్షించు చుందుము—పొమ్ము.

(అక్బరు మాఱువలుకక నిష్క్రమించును.)

ఔరం—సతీ! నీవాంఛఁదీర్ప నేఁడొక దారుణంబగు ప్రవిదారుణ మునఁ గాలిడితిని.

గుల్—దారుణంబగు ప్రవిదారుణమా!— ఒక సామాన్యజనపదముతో సలుపు సమరము దారుణమైనదా! భారతసామ్రాట్టునకిదత్యంత తుచ్ఛకార్యమని నేఁ దలచితిని! ('తుచ్ఛ' doesn't in this connexion mean 'despicable' but 'Easiest')

ఔరం—సామ్రాజ్ఞీ! అట్లుకాదు. ఏనాఁడు రెండు నూఱులయేఁబదుగురు రసపుత్రులైదువేల మొగలు వ్యూహమును మథితమొనరించి, ముందునకుఁ జనిరో,— నానాఁడే రాజపుత్రుల సమసాహసికులని యెఱింగితిని. దానంజేసి నే నీయూలార్థము వంగవిషయమునుండి యువరాజ్ యక్బరును, గాంధారభూమినుండి కుమార్ యజీమును బిలిపించితిని.—మీవారు జయమతిసులభమై, స్వతఃసిద్ధమైన కారియముకాదు.

గుల్—మీవారు జయమును నేను వాంఛించుటలేదు. నేఁ గోరునది యశవంతుని పత్నియే!— ఆ కాంత యొకమాఱు చేతులు మొగుడ్చుకొని నా మ్రోల నిలువం బడవలెను!

ఔరం—ఈమారక్లే యామెను నీ మ్రోలనిలువంబడఁ జేతును.— సతీ! ఇఁక నీవు లోని కరుగుము. వర్షము వచ్చుచున్నది.

[ఇట్లని నాతఁడు నిష్క్రమించును.]

"With the sole surviving scion of jeswunt, the faithful Doorga and a few chosen friends repaired to the isolated rock of Aboo, and placed him in a monastery of recluses. There the heir of Marwar was reared in entire ignorance of his birth."

## ద్వి తీ య దృ శ్య ము

ఆబూగిరి దుర్గము—పగలు రెండుయామముల సమయము

దుర్గాదాసును, రాఠోరు సామంతులగు ముకుందసింగు, శివసింగులును నిలువంబడి యుందురు.

దుర్గా—సుహృద్వరులారా! రాణీపుత్రుని మీ రక్షణమం దుంచి వెడలి పోవుచుంటిని. ఈ యావాసస్థానా స్తిత్వము మాత్రము ప్రకాశము కా కూడదు సుడీ! (See that this whereabouts is not known to others).

ఉభయులు—సేనాధిపతీ! అట్లు ప్రకాశము కానేరదు.

దుర్గా—సైన్యసమేతుఁడై సామ్రాట్టు మీవారు నాక్రమణ మొన రించెను. కుమారునిఁక నదయపురమున నుంచుట శ్రేయము కాదని తలఁచి రాణా యుపదేశానుసారముగ నాతని నిటకుఁగొని వచ్చితిని!

ముకుంద—సామ్రాట్టు మీవారును ముట్టడించుటకుఁ గారణమేమి?

దుర్గా—యోధాపురాధీశ్వరి పుత్రసహితముగ నచ్చోనాశ్రయము బడ యుటే ప్రధానకారణము. కాని, యౌరంగజీబు దౌర్జన్యమును,—ముఖ్యముగ హిందువులపై నాతఁడు విధించిన జిజియాసుంకమును ప్రతిఘటించుచు, రాణా పత్రము లిఖించుటయే మీవా రాక్ర మణ కారణమని ప్రజలు సెప్పుకొనుచుండిరి. కాని యది యొక మిషమాత్రమే. ఆ యుత్తరము సతేజమై, నిర్భీకమగుట నిక్కమే; కాని యందతి నమ్రసరళభావములుకూడ వ్యక్తీకరింపఁ బడినవి. ఆ కమ్మయందుఁ జక్రవర్తిఁ గుపితుఁ గావించు లిఖింపరాని యంశము లేవియు లేవు. నే నాపత్రమును జూచితిని.

[The parallel passage together with the glowing commentation of the Rana's letter. I venture to quote from the Annals of Rajastan: "Foiled in his ('his' refers to Aurangzeb) plot to entrap the infant son of the Rahtore by the self-devotion of his vassals (Two hundred and fifty Rajpoots opposed five thousand of the imperialists till the family of Jesswunt escaped, the compound treachery evinced that their

only hope lay in a deadly resistance. The mother of Ajit, the infant heir of Marwar, a woman of the most determined character, was a princess of Mewar; and she threw herself upon the Rana as the natural guardian of his rights, for sanctuary *(Sirna)* during the dangers of his minority. This was readily yielded, and Kailwa assigned as his residence, where under the immediate safeguard of the brave Doorgadass, Ajit resided, [The Rana received the young Rahtore with the most princely hospitality, and among other gifts a diamond worth ten thousand diners is enumerated] while she nursed the spirit of resistance at home. A union of interests was cemented between these the chief states of Rajpootana, for which they never before had such motive, and but for repeated instances of an ill-judged humanity, the throne of the Moguls might have been completely overturned!

On the promulgation of that barberous edict, the *Jezeya*, the Rana remonstrated by letter, in the name of the nation of which he was the head, in a style of such uncompromising dignity, such lofty yet temperate resolve, so much of soul stirring rebuke mingled with a boundless and tolerating benevolence, such elevated ideas of the Divinity with such pure philanthropy, that it may challenge competition with any epistolary production of any age, clime or condition. In this are contained the true principles of Christianity, and to the illustrious Gentile, and such as acted as he did, was pointed that golden sentence of toleration, 'those who have not the law, yet do by nature the things contained in the law, shall be a law unto themselves."]

శివ—మీ రీయూహావముస కనుగు చుంటిరా ?

దుర్గా—నా ప్రభుని రక్షించుట కయ్యే యీ సూలము సలుపఁబడు చుండెను. నే నిచట నిశ్చింతుడనై కూరుచుండరాదు. మీర లీదుర్గమం దప్రమత్తులరై యుండుఁడు. ఇచటినుండి యొక యడు

గైన వెలుపల కిడకుఁడు. ఈ దుర్గమతినిభృతమై, గుప్తమై, నిరాపదమై యున్నది. అయిన నిచటఁ బహాఁగా యొసఁగుటకై రెండు నూఱుల యోధులనుంచు చుంటిని. ఏదేని విపాద మాపాదించు సూచన కన్పట్టినయెడల, వెంటనే నాకుఁ దెలుప వలయును.

ముకుంద—మీవారును ముట్టడింప సామ్రాట్టు బయల్వెడలెనా ?

దుర్గా—బయల్వెడలు టేమి! మొగలుసైనికులు మిడుతల దండు వలె మీవాపు రాష్ట్రమును గప్పివైచిరి. చిత్తూరు (Cheetore) మండల్‌గర్ (Mandelgurh) మండ్‌శూర్ (Mundisor) జీరన్ (Jeerun) మొదలగు దుర్గములు చక్రవర్తి హస్తగతములాయెను. రాణా తన సైనికుల నందఱఁ బర్వతప్రదేశమునకుఁ గొంపోయెను.

[How dry historical facts are depicted with the bright hues of Romance by the genius of the immortal Dwijendralal's pen can well be known by the reader if, while passing along the vistas of these scenes, he is made to stumble for a while on the following historical facts herein succintly called by the perfunctory translator: "Akbar was recalled from his province, Bengal; Azim from the distant Cabul; and even Mawzam (the Mogul's heir) from the war in the Dekhan. With this formidable array, the emperor entered Mewar, and soon reduced the low countries, which experience, had taught them were indefensible, the inhabitants previously retiring with their effects to the hills. Cheetore, Mandelgurh, Mundisor, Jeerun, and many other strongholds were obtained after the usual form of opposition, and garrisoned by the Mogulsr

....................................

Aurungzebe advanced to Dobarri; but instead of entering the valley of which it was the gorge, he halted, and by the advice of Tybarkhan sent on Prince Akbar with fifty thousand men to the capital. &c. &c. &c.

శివ—మన మహారాణి యెచట?

దుర్గా—మార్వారునందు. సైన్యాధ్యక్షుఁడైన గోపీనాథున కామె పదివేల మార్వారు మహాశూరులఁ దోడిచ్చి వానిని మీవా రంపెను. తా నింకను నూతన దళములు సంగ్రహ మొనరించుచు గిరినతలమునకుఁ గదలి వచ్చుచుండెను!—మంచిదిఁక మీరు పోయి భోజనాదులఁ గావించిరండు.

[ముకుందసింగు శివసింగులు నిష్క్రమింతురు]

దుర్గా—ముష్టిమేయ రాజపుత్రసైనికుల దోఁకొని భీషణ మొగల్సైన్య మహార్ణవమున నవతరణ మొనరించితిని! దీని పరిణామ మేమగునో యీశ్వరుఁ డెఱుఁగును. మిళితులైన మార్వారు మీవారు యోధులు నేఁడు నిజానులఁ దుచ్ఛ మొనరించి యాహవరంగమునఁ గాలిడుచుండిరి—యిది యెన్నఁ డే మరపురానిదినము!—దిగంత విశ్రాంతఘనీభూతవారిదసంఘాభ్యంతరమున నిదియే యాలోక క్షీణరేఖ!—ఇత్తటి మహారాష్ట్రులుకూడ నాయపడిన బాగుండుఁ గదా! విచ్ఛిన్నహిందూశక్తి యేకము తేకత్రిత మొనరింపఁ గలిఁగిన నెంత యుత్తమముగ నుండును!—హా! భారతమాతా! నీ యదృష్ట మెట్లున్నదో కదా!—ఏమి యద్భుతజాతి! ముప్పది వత్సరములలో నొకఁ డొకఁడి సృష్టియాయెగా!

[ఈ సమయమునఁ గాశిము చటఁ బ్రవేశించును.]

దుర్గా—కాశిమూ! రాజకుమారుఁ డెచట?

కాశిమ్—ఇంత వఱకు నాతో నాటలాడు చుండెను. నిద్దురకురాగా, నాతని నిపుడే దాది యొడిలోఁ బరుండఁజేసి వచ్చితిని. నేను మాత్రము తానమాడి, మెతుకులు తినవద్దా?

దుర్గా—అవును! స్నానాదులఁ గావించిరమ్ము—వేళైపోయినది!

కాశిమ్—నీవు మాత్రము—[నాలుక కఱచుకొని] మీరు మాత్రమట తానముచేసి, యన్నము తినరా?

దుర్గా—ఈ వేళ నే నేమియుఁ బుచ్చుకొనను. నా శరీరము నేఁడు బాగుగ లేదు.

కాశిమ్—ఇదే మీ దోషము. లేకపోతే మీరు చెడ్డ మణుసులుకారు. ఇదే మీ లోటు!

దుర్గా—అవు నది నా లోటే!

కాశిమ్—మా యింటిదికూడ యిల్లాగే వుండేది!—ఈ వేళదగ్గు, తేపు జ్వరము, యెల్లుండి శూలొప్పి [శూలవేదన]—అల్లాగే దానితో తిప్పలు పడుతూవుండే వాఁడను. నే నెప్పుడు అల్లాలేను. అప్పుడప్పుడు కొంచెము జ్వరము వచ్చేదికాని, అది నన్నంతగా నొప్పించేదికాదు. అందుకుచేత, నేను తింటోతిరుగుతో బాగానే వుండే వాణ్ణి—యేచికూ్కా వుండేది కాదు!

దుర్గా—కాశిమూ! నీ పెండ్లా మెందువలన మృతినొందెను?

కాశిమ్—బాబయ్యా! మా యాడది యెల్లా చచ్చిపోయిందో నాకు తెలిసిందికాదు. ఒకనాడు ప్రొద్దున్నే లేచి చూచేటప్పటికి మంచము మీఁద చచ్చిపడుంది. గుండిల్లో యేదో అయిందనివైద్దిగుఁడు (వైద్యుఁడు) చెప్పేడు.

దుర్గా—నీ కుమారునకు చావెట్లు కలిఁగెను?

కాశిమ్—బాబియ్యా. నాపిల్లాడిమాట తలపెట్టకండి. వెన్నపూసంటి పిల్లోడు!—అందకారంలో దీపం నడుస్తూ వున్నట్లు యింటో తిరుగుతూ వుండేవాఁడు. తప్పటడుగులు పెడుతూ ఆడుకుంటూ వుండేవాఁడు. బిడ్డకంటం (కంఠము) పిల్లంగోరు (పిల్లనగ్రోవి, లేక వంశి) పాటలావుండేది! కిలకిల మని నవ్వితే నదివొడ్డున తప్పటడుగు వేసే చిన్న కెరటాల చ్వరం [స్వరము] లావుండేది! సరిగ్గా మనరాజ కొమారుఁడులా వుండేవాఁడు. కాని వాఁడి వొళ్లు

యింతగా మెచ్చిసేదికాదు. ఆహా! ఒకనాఁడు రోజంతా పనిచేసి చేసి యింటికొచ్చి చూచేటప్పటికి బిడ్డ [క్రందనస్వరమున] పేణాలు [ప్రాణములు] విడిచి పడున్నాడు. నాయిలవాళ్ళంతా సిరాలా నల్లపడి పోయింది! 'నాయనా! యేమైందిరా!' అని అడిగేను జవాబు లేదు—అత్తనుపిలిచేను—పరుగుపరుగునా వచ్చి, అది పిల్లాడిపైపడి గొల్లుమని యేడ్వ మొదలెట్టింది! వైద్దుగుణ్ణి (వైద్యుని) పిలిచాను. తలకాయిఫ్వూపి, పెదిమి విఱిచి, ఆబా వెళ్ళిపోయాడు!

దుర్గా—బుడుతనికే మాయెను?

కాశిమ్—బాబయ్యగారూ! అదే నాకు తెలిసిందికాదు. అప్పుడు దేశంలో అదేదో జబ్బుండేది; అది కాలాజ్వరంట [*Kala* fever to which the unfortunates in Bengal sometimes succumb] అప్పుడు ప్రజంతా దబ్బు దబ్బున చచ్చిపోయేది! నా—దురదృష్టం చేతనే చచ్చిపోయానుగాను! బగమంతుఁడు (భగవంతుఁడు) నాకు నిండా ఆయుస్సు పోశాడు. పాపాత్ముళ్ళకి దేవుడు చావెట్టడు. బిడ్డతల్లిని ముందు, బిడ్డని తర్వాత మింగేసేశాను! మింగేసి, యిపుడా యల్లా వున్నాను!—[ఇట్లని కాశిమ్ నేత్రములనుండి పొరలి వచ్చు యవిరళాశ్రుధారలఁ దుడిచికొనును.]

దుర్గాదాసు—నాయనా! సంసార నియమమింతే—నీవేమి చేతువు! చేసుకొనిన దాని ననుభవింపకతీఱదు. గతమును మఱచిపొమ్ము. ఇఁకబోయి స్నానంచేసి, యన్నము తినిరమ్ము.

కాశిమ్—బావయ్యా! ఇప్పుడేవస్తాను.

[అని యాతఁడు కండ్లుదుడిచికొనుచు నిష్క్రమించును.]

దుర్గా—ఈ కాశిముతో రెండునిముసములకాలము ప్రసంగించిన, జిత్తము పవిత్రమగును; సరళపథమందుఁజనుట సులభమగును!! యీశ్వరభక్తి యధికమగును!!!

తృతీయదృశ్యము.

జయసింహుని ద్వితీయ పత్నియైన కమలయొక్క శయనాగార ప్రాంగణము—రాత్రికాలము

కమల భిత్తికపై యొఱగికూరుచునియుండును.—ఆమె ముఖమండలమున జ్యోత్స్నాలోకము పడుచుండును; ఆదూరమున జయసింహుఁడు వామపార్శ్వముపై నర్థశయనుండై, కరతలన్యస్తగండభాగుండై పత్నీముఖము ననిమేషనయనుండై విలోకించుచుండును.

జయసింహ—కమలా! ఈ రేయి యెంతహాయిఁగొలుపుచుండెను!

కమల—ఎంతో హాయి! ఎంతో హాయి!! ఎంతో హాయి!!! ముమ్మాఱు బల్కితిని.

జయసింహ—ప్రేయసీ!

కమల—నాథా! వల్లభా!! ప్రాణేశ్వరా!!!

జయసింహ—ప్రేయసీ! నేనింకనేమియుఁ బలుకను. నీవట్లేకూరుచుని యుండుము. నేను నీ సౌందర్యమును పానమొనరింతును!

కమల—మంచిదట్లేకానిండు; కానియొక్క గ్రుక్కలో నంతయుఁ ద్రాగివైవకుఁడు. నాకొఱకు కొంచెము మిగల్పవలయునుడీ!

జయసింహ—హృదీశ్వరీ! సౌందర్యమెట్టిసుర? అట్లేకాకున్నఁ జూచుచు చూచుచునుండగనే యీ మత్తువచ్చునెచ్చటినుండి? అంగములు శిధిలములైపోవునేల? నేత్రములు నిమీలితములై పోవుచుండు నెందులకు?

కమల—నన్నుఁజూడగనే మీకట్టిమత్తు కలుఁగుచుండుఁగాఁబోలు. కాని, మిమ్ముఁజూచిన నాకు సరిగ వ్యతిరేకవిధముతోఁచును—నన్నంటియున్న మత్తంతయు మీ దర్శనమాత్రమే యెందేని పర్విడును!

జయసింహ—అట్లైన నీవు నన్నుఁ బ్రేమించుటలేదు.

కమల—[తీక్ష్ణవక్రదృక్కుల భర్తపై నిగుడించుచు]—ప్రేమించుట లేదా ?—మంచి దట్లనే యనుకొనుఁడు.

జయసింహ—ప్రేమింతువే యనుకొందును; కాని, నే నెట్లు శరీరముయొక్క ప్రత్యేక లోమకూపముతోను, హృదయముయొక్క సమస్తశోణితముతోను, ప్రాణముయొక్క సంపూర్ణయావేశముతోను, యిహకాలముతోడను, పరకాలముతోడను నిన్నుఁ బ్రేమించుచుంటినో నీవు కూడ నన్నట్లు ప్రేమించుచుంటివా ?

కమల—నిక్కముగ నట్లే ప్రేమించుచుంటిని; కాని, యన్నిసంస్కృత పదములతోఁ బ్రేమించుటలేదు.

జయసింహ—అర్ధాంగీ ! నీ కట్టివిశాలహృదయములేదేమో యనుకొనుచుందును.

కమల—మీ రెట్లులనుకొనుచున్నను, మీ నాసికమునకు రజ్జువుఁ గట్టి మిమ్ము నా చిత్తమువచ్చిన తెఱంగునఁ ద్రిప్పుచుంటినా లేదా ?

జయ—అవును ! నీ వట్లేగావించుచుంటివి ! నిన్నుఁ బరిణయమాడిన దాది నాకుఁ బ్రపంచమంతయు నొక నూతన విధముగఁ గన్పట్టుచుండెను.

కమల—అట్లా ?

జయ—అవును. నా కంతయు నొకయుద్రశాంతఝంకారమువలె, నొక యనంత విశ్రాంతిభాతి, నొక యసీమమోహముమాడ్కిఁ దోచుచుండెను ! అర్ధసుప్తి యర్ధజాగరణావస్థ యందుంటిని !

కమల—అట్లైన నభినిఁ [అభిని=నల్లమందు] బుచ్చుకొన నట్లుండెనా ? నల్లమందుఁబుచ్చుకొనిన, సరిగన ట్లే యుండునని మాయమ్మొమ్మ నాతోఁ జాలమాఱులు చెప్పియుండెను.

జయసింహ—కాని, యాస్థితియెట్టిదో నాకు బోధపడలేదు. అదొంకు

యాకాంక్షవలె తోఁచును; కాని యేమి యాకాంక్షయో తెల్లము కాదు! హాసనరేఖ యధరముపై వికసిత మగును; కాని, యది కానం బడదు! గానమూర్ఛన నాఁదోఁచు; కాని యది యంబర దిక్కు-గఁబోయి శూన్యమందు మిళితమైపోవును! అది యొక యబాధ (Uninterrupted) సుఖస్వప్నమువలె గానంబడును!— అగాధసౌందర్యముచాడ్పునఁ గన్పట్టును!! అనంత తృప్తివలె తోఁచును!

కమల—అట్లనా? అట్లైన మీ ప్రథమకళత్రమే యట్టి యనంత సౌఖ్యము మీకుఁ బ్రసాదించెను కాఁబోలు! అదిగో! తన పేరు తలఁపగనే వచ్చి హాజరైనది! అమ్మశక్తి! నీకు నూఱేండ్లాయువే!

[ఈ తరుణమున సరస్వతి యాప్రదేశమునఁ బ్రవేశించి]

"ప్రభూ! తా మిందే యుంటిరా? మి మ్మన్వేషించుచుఁ గ్రుమ్మరుచుంటి" ననున.

జయసింహ—న న్నన్వేషించు టెందులకు?

కమల—ఇకమీరు మీప్రథమకళత్రముతోఁగాలక్షేప మొనరింపుఁడు. నేఁ బోయెదను. [ఇట్లని యామెచివాలున నిష్క్రమించును.]

జయసింహ—పోకుము! వెడలిపోకుము!! మాటవినుము!!! [అని యాతఁడు లేచి నిలువంబడును.]

సరస్వతి—నాథా! నేను మీ సుఖమున కంతరాయముఁ గల్పింప రాలేదు. విశేషావసరముండి వచ్చితిని.

జయసింహ—ఆ విశేషావసర మేమో తెల్పుము?

సరస్వతి—వల్లభా! పతి పత్నిని తైఱంగునఁ బ్రశ్నించు టుచితమా? పోనిండు దానికేమి. కమల కరణి నాకుఁగూడ మీతో వాని ననుభవించు స్వాతంత్ర్యమున్నను, నే నిపుడు మీ ప్రమోదక్రీడల కెట్టి యాటంకముఁ గలుగఁజేయరాదు. ఇత్తఱి మీ రీఁదులాఁడు

యాంనదపయోధియందు ఝుంఝోత్పన్న మొనరింప నేనరుదెంచ లేదు.—(ఒకించుకయాగి) పోనిండు జరుగవలయునదేమో జరగి పోయెను. గతమును తలంచి వగచిన నేమి ప్రయోజనము?

జయసింహ—ఆ విశేషావసర మేమో తెలుపుము.

సరస్వతి—చాల తొందరగ నున్నదా?—అట్లైన వినుడు. మొగ లాయీలు మీవారు నాక్రమణ మొనరించి నట్లెఱుంగుదురా?

జయసింహ—ఎఱుంగను!

సరస్వతి—అట్లైన మీ జనకుండు మీ కావిషయ మెఱిగింపనక్కఱ లేదని యోచించెను.

జయసింహ—తెలివిగనే యోచించెను!

సరస్వతి—ఈ యుద్ధమునకు మహారాజు యోధపురము నుండి తమ జ్యేష్ఠపుత్రునిఁ బిలిపించిరి.

జయసింహ—తర్వాత తర్వాత?

సరస్వతి—మీ కింకను లజ్జ కలుఁగుటలేదా? మీరు క్షత్రియకుల సంజాతులు; రసపుత్ర జాత్యుద్భవులు; మీ వారుభావిస్వాములు. మీవా రాక్రమణవార్త రాణా మీకుఁ దెలుపనైన దెలుపలేదు. కాని, జ్యేష్ఠనందను నసుమారు యోధపురమునుండి రావించెను. ప్రభూ! దీనివలన నేమి ప్రమాణమగు చుండెనో యెఱుంగుదురా?

జయసింహ—ఏమి ప్రమాణమగుచుండెను?

సరస్వతి—రాణా మిమ్ముఁ గాపురుషులని దలంచిరనియే ప్రమాణ మగుచుండెను! యోధపురమునుండి దుర్గాదాసును, రూపనగర మునుండి విక్రమ సోలాంకియు,మార్వారునుండి రాథోరు వీరుండగు గోపీనాథుండును మీ వారుకుఁ దోడ్పడ నేగుదెంచిరి. వారలంద ఱిపుడు రాణామంత్రణాయాగారమందుండిరి. ఇఁకమీరో,—మీ వారుభవిష్యాధిపులైన మీరు విలాసకుంజమందు శయనించి

ప్రేమస్వప్నము విలోకించుచుండిరి! విని, బిడియపడుచుంట లేదా? తమ్ముదామే ధిక్కార మొనరించుకొన వాంఛించుట లేదా?—
ఏమి ! నీరవులై యుంటి రేల?

జయసింహ—అంతయు దెల్లమాయెను. కాని, సరస్వతీ! ఎవరో నా సమస్తయుద్యమమును భంగమొనరించి వైచిరి! నన్ను నారికంటె నధముఁ గావించి వైచిరి!

సరస్వతి—అట్లనిగ్రహింపఁ గలిఁగినచో, యిప్పుడుకూడనాశయున్నది! నాశయున్నది! నాథా! కమల కనురాగము సూపుఁడు. అట్లుసూపు టనుచితముకాదు. కాని, విజాతిసైన్య మరుదెంచి, స్వదేశమును గప్పియుండ, శాత్రవాసికంబులు ద్వారదేశమున నిలచియుండ.—కఠోరకర్తవ్యము సమ్ముఖమందుండ, నారీయధరసుధాపాన మొనరించుట క్షత్రియకార్యముకాదు!

జయసింహ—సత్యము సత్యము. సరస్వతీ! నీ వెన్నండును సత్యమునే వాక్రుచ్చుచుందువు. ఉచితంబగు నుడువునే నుడువుచుందువు. సంగతయుక్తినే వచించుచుందువు. కాని, యేకతసనో నేను నీపల్కులఁ బెడచెవిం బెట్టితిని. కర్తవ్యపథము నెటింగియు, నప్పథము ననుసరించి పోఁజాలనైతిని.

సరస్వతి—నాథా! కర్తవ్యపథము నెటింగినచో మీరిఁక లెండు. పురాతన ఛిన్నవస్త్ర ఖండసమం బగు ప్రాణంబునుండి ప్రాణపణోద్యమమున నీ విలాసమును విసరి పాఱవేయుఁడు. కర్తవ్యము సులభమై తోఁచును. 'నాదాన'వని యొకమాఱు కర్తవ్యమును బిలచి చూడుఁడు. ప్రసారితబాహువయ్యె, యది మిమ్ముఁ దన కవుంగిలి లోనికిఁగొని మీకు రక్షణమొసఁగును. కర్తవ్యమెంత కఠోరమైనదంచు దలంచుచుండిరో, యంత కఠినమైనదికాదు! నాథా! ఒకమాఱు సబలమున,—నుద్యమభరమున లేచి నిలు

వంబడుఁడు చూచెదను!

జయసింహ—అర్థాంగీ! నే నొకమాఱు యత్నించి చూచెదను. ఏమి కావింప మందువో తెలుపుము.

సరస్వతి [ప్రఫుల్లముఖియై]—ప్రభూ! క్షత్రియోచితవాక్యము వా క్రుచ్చితిరి! నా వల్లభులకుఁ దగినపల్కుఁ బల్కితిరి! వేళంబ వీర వేషము దాల్చుఁడు. తదనంతరమున భవజ్జనకు మంత్రణాయాగా రమునకు బొండు, పోయి, మీజనయితను సంబోధించి 'పితా! నన్నీపవరమున కెవరును బిలువలేదు. నేనే స్వయముగ వచ్చితి ననుఁడు. సగర్వమున నా రాజసింహుఁడు 'పుత్రా! రమ్మం'చు ప్రేమపూర్వకముగ మిమ్ముఁ దమతొమ్మునకుఁ జేర్చుకొనును. మీవాటు వానులందఱు సాహాంకారమున 'నీతఁడే మాభవిష్య రాణా' యని వచింతురు! సమస్తరాజస్థానము మస్తకమెత్తి ప్రమోదపురస్సరముగ లాదృశ్యమును విలోకించును. అది మిగుల మహిమామయ ముహూర్తమైయుండును. వల్లభా! ధిక్కృతులై చిరజీవనధారిణ మొనరించుటకంటె పూజ్యులై యొక్కదినమే మని యుండుట యుత్తమము. ఆ దినమొక్కటియే కడు సుఖోపేతమై యుండును!

[A strikingly similar idea can be found in the following poem:—

గీ॥ పౌరుషజ్ఞానకీరులఁ బరఁగనేని
వానిజన్మంబదొక్క పూఁటైనఁజాలు
నుదరపోషణమాత్ర మీయుర్విమీఁదఁ
గాకిచిరకాలమున్న నేకార్యమగును ?"

జయసింహ—సరస్వతీ! నే నీ ముహూర్తమందే జనుచుంటిని.

సరస్వతి—సంతసము! స్వయముగ నేనే మీకు వీరవసనములఁ

పోడిగెద్దను! రండు

[జయసింహుఁడాతావునుండి నిష్క్రమించును.]

సరస్వతి— నాథా! కదనాంగణమునకుఁ గదలిపొండు. అభేద్యకవచ ముకరణి నా గాఢానురాగము మీ కాయంబును జుట్టివైచుగాక! శత్రుకృపాణము మీ గాయమును స్పృశింపఁజాలకుండుగాక!!

[ఇట్లని సరస్వతి పతిపశ్చాద్గామిని యగును.]

## చతుర్థ దృశ్యము

ఉదయపురము—రాణా రాజసింహుని మంత్రిణాయాగారము అర్ధరాత్రము. రాణా రాజసింహ, మహారాణి మహామాయ, దుర్గాదాసులును యన్యరాజపుత్ర సామంతులును సమాసీనులై యుందురు.

విక్రమసోలాంకి—మనము సమ్ముఖసంగ్రామమున మొగలువాహినులనాక్రమణ మొనరింతము.

రాజసింహ—అది యుచితముకాదు. ముక్తక్షేత్రమున [బహిరంగ ప్రదేశమున] ససంఖ్యాకులైన మొగిలాయిసైనికుల సమ్ముఖమున నిలువంబడుట యుక్తిసంగతముకాదు.

గోపీనాథుఁడు—మన సైన్యమునంతయు నల్ప సంఖ్యాదళములుగ విభజించి మొగలాయి చదలముల మార్గము దుహూహ మొనరించుట యుక్తమని నేఁ దలఁచెద.

రాజసింహ—గిరివదాసూ! నీకేపర్వత్యప్రదేశప్రత్యేకపథోపత్య కారణ్యములు పరిచితములై యున్నవి—నీయుద్దేశ్యమేమి?

గరివ—మనము మొగలాయీల నీశైలపథమందుఁ జొరనీయవలయును. అట్లు సొచ్చుతతి మనము వారలకెట్టి యభ్యంతరము గలిగింపరాదు. కేవలము కౌశలముకతన వారల నొక దురంత దురూహాపథములోనికి మెల్లగ రప్పింపవలయును. అప్పథాభ్యంత

గమున వారలకు సైన్య సన్నివేశమొనరించుట కఠినమగును. కుథరమార్గమందు విశృంఖలులై పడియున్నతఱి మనమువారల నాక్రమణ మొనరింపవచ్చును. నా యభిప్రాయమిది.

దుర్గా—రాణా! ఇది యత్యుత్తమోపాయము. మొగల్సామ్రాజ్యముతో నేఁడొక్క దినమే కాదు—బహువర్షములవఱకు బోరుసలుపవలయును. సాధ్యమైనంతవఱకు రసపుత్రులు తమశక్తి నపవ్యయ మొనరించువారు కారని మనము యవనులకు చూపవలయును!

గోపీనాథ—నీ వనినది నిక్కువము.

విక్రమ—బహుయుత్తమము! గభీరోపత్యకాభ్యంతరమున వారలు తమ దళముల చేర్చుకొననేరరు.

రాజసింహ—అందఱి యుద్దేశ్యమిదియేనా? మహారాజ్ఞీ! నీయభిప్రాయమేమి?

రాణి—అందఱియభిప్రాయమెట్లో నా యభిప్రాయముకూడ నట్లే. సామ్రాట్టు స్వయముగ సమరమునకు రాలేదా?

రాజసింహ—లేదు. అతఁడును, యజమును దోవారియందుండిరి. సామ్రాట్టుతనయుఁడగు యక్బరు యుదయపురమునకు వచ్చెను—దుర్గాదాసూ! ఇది నిజమైనవార్తయేకదా?

దుర్గాదాసు—అవును మహారాణా! శత్రువాహినులు మూఁడు భాగములుగ విభజింపబడెను.—ఒకభాగమక్బరు యధీనమునయుదయపురపథమందును, మఱొకభాగము దిల్లీర్ఖానుయధీనమున దాసురీమార్గమందును, వేఱొకభాగము సామ్రాట్టుయధీనమున దోవారియందును యుండెను.

రాణి—మనము సైన్యసమేతముగఁబోయి సామ్రాట్టును ప్రతిఘటించుటుత్తమమని నేఁ దలలచుచుంటిని.

రాజసింహ—వలదట్లొనర్చిన నక్బరుయొక్క యగణిత సైన్యము

వెనుకనుండును. అట్లుగావించుట సమంజసముకాదు. దుర్గాదాస్! యేమందువు?

దుర్గాదాసు—అవును. మీరనినది నిక్కువమే.

రాజసింహ—అట్లైన గరివదాసు తెలిపినయుపాయము ననుసరించి యాచరించుటం దఱికి సమ్మతమేనా?

అందఱు—సమ్మతమే! సమ్మతమే!! సమ్మతమే!!!

రాజసింహ—మంచిది. ఇఁకమన మిళితసైన్యమున కధినాయకుఁగ నెవని నియమింపవలయునో తెల్పుఁడు.

గరివ—ఎవని నేమి? మనదుర్గాదాసునే!

రాజ—అందఱియభిమతమదియేనా?

రాజ్ఞీదుర్గాదాసులుతక్క దక్కుంగలవారంద తేకగ్రీవముగ 'నిశ్చయముగ నదియే' యందురు.

రాజసింహ—అట్లైన దుర్గాదాసూ! ని న్నిప్పుడే యీ మిళిత రాజపుత్రసైన్యమునకు సేనాధిపతిగ నియోగించితిని.

[సంతసమున సభికులు కరతాళధ్వనులు కావింతురు.]

దుర్గా—రాణా! కృతజ్ఞతా పూర్వకముగ నే నీసమ్మానమును గ్రహణ మొనరించుచుంటిని. అడిగో కుమార్ భీమసింహుఁ డిట్లే వచ్చుచుండెను.

భీమసింహుఁ డరుదెంచి రాణాచరణముల కెరగి, తక్కుంగల వారలందఱ కభివాదన మొనరించును.

రాజసింహ—వత్సా! రమ్ము. (తనయుని కవుంగిలించుకొనును) నాయనా! నిన్ను 'రమ్ము' అని పిలుచుటకైన నా కధికారము లేదు.

భీమ—ఏల పితా?

రాజ—క్రూరుడనై నేను నిన్ను వెడలఁ గొట్టివై చితిని.

భీమ—జనకా! మిమ్ములను నెవలుఁగొట్టలేదు. నేనే స్వయముగ నిర్వాసితుండ నైతిని.

రాజ—తనయా! నా యెడల నీకుఁ గినుక లేదా?

భీమ—పితా! దేవరయము లైన మీ యెడల గినుకయా! కినుక లేకుండుటయుండ, నేను భవదిచ్ఛాపూర్త్యర్థము నా ప్రాణములనైన సర్పింప గలను. భగవాన్ రామచంద్రుఁడు పితృవాక్య పరిపాలనార్థము, వల్కలా జినములు ధరించి, ఘోరాకారహర్యక్ష శార్దూలవ్యాళాది భయంకర వన్యమృగపూర్ణ సాంద్రగహనస్థిత పటపకుటీరము లందు కాలము బుచ్చెను. నేను నరాధముండనే యయ్యు, అస్మత్పూర్వ వంశమం దుద్భవించిన క్షత్రియుండనగుటను క్షత్రియోచితకార్యము సలుప గడంగితిని.

రాణి—నీ జన్మభూమి రక్షణార్థమయ్యె, నేఁడు నిన్ను నీ జనకుఁ డాహ్వానించెను.

భీమ—మహారాణీ! అయ్యాహ్వానము నాకుఁ బరమ గౌరవదాయకము

విక్రమ—భీమసింహా! నీ జన్మభూమిని నీవు మఱువలేదా?

భీమ—జన్మభూమిని మఱతునా?—విక్రమసింహా! కతిపయవత్సరముల నుండి మహోర వినోదాగిరి నిద్రావస్థలం దీకరినకుధర సంకుల ఘోరమధూసర మిరాదారుభూమి, యహర్నిశములు నామనః చక్షుస్సమ్ముఖమున భాసమానమగుచుండెను. నేఁడు నిజసీమకు మగుడి యరుదెంచుతఱి, పథమందుఁ దపరచిత యరణ్యోపత్యక శైలమాలలఁ గాంచ, నా నేత్రము లశ్రువారిపూరితము లయ్యెను. ఆ వేగముచే నా కంఠము రుద్ధమై పోయెను.

రాణి—[స్వగతమున]—రాణా రాజసింహుని యవికలప్రతి ప్రతిమ!

[A true reflex of Rana Rajasimha! This sort of life also reminds us the hard career of the great Rajput recluse, the immortal Rana Pratap Sinha].

[సశస్త్రుడై జయసింహుఁడు ప్రవేశించును]

రాజసింహ—ఎవరు ? జయసింహుఁడా!

జయసింహ—అవును. పితా నేను తామునన్ని యుద్ధమునకుఁ బిలచితిరి కారు—నేనే స్వయముగ విచ్చేసితిని.

రాణా రాజసింహుఁడతి విస్మితభావమున క్షణకాలము జయసింహుని విలోకించి, పిదప—"ఏమి! జయసింహా! నీవిట్లు స్థిరచిత్తుఁడవై వచించుచుంటివా ?" యని యుచ్చైస్స్వరముత్తో ప్రశ్నించును.

జయసింహ—జనకా! అట్లే వచించుచుంటిని. మీవారిపుడు విపన్నులై యున్నారు. నేను మీవారు భవిష్యరాణాను—యిత్తఱి నిశ్చింతుఁడనై కాలయాపనగావించు టనుచితముకాదని తలఁచితిని!

భీమ—అనుజా! దీర్ఘజీవివికమ్ము! నిరుచితమైన వచనమువచించితివి!

రాజసింహ—జయసింహా! నీయన్నకుఁ బ్రణామమాచరింపుము.

జయసింహుఁడు భీమసింహునకుఁ బ్రణామ మాచరించును. తమ్ముని జరణములనుండి లేవదీసి భీమసింహుఁడాతని నాలింగన మాచరించుకొనును.

రాజసింహ—దుర్గాదాసూ ! నాతనయులనిర్వర నీయధీనమందుంచుచుంటిని.

దుర్గాదాసు—మహారాణా! అట్లుంచుట నాకు మహత్సమ్మానముఁ జూపుట!

రాజసింహ—అట్లైన నేఁటికి సభముగింతము. మిత్రులారా! మీరిక వెడలిపొండు.—రాజ్ఞీ! నీవిఁక యంతఃపురమున కరుగుము.

రాజసింహ, భీమసింహ, జయసింహులుతక్క దక్కుంగలవారలందఱు నిష్క్రమింతురు. దృక్పథమునుండి వారలు నిష్క్రమింపగానే మృదుస్వరమున రాజసింహుఁడు —"భీమా" యని యగ్రనందనుని సంబోధించును.

భీమ.—ఏమి జనకా! [రాజసింహుఁడు నిరుత్తరుఁడై యుండును.]

భీమసింహ—గ్రహించితిని. నే నా ప్రతిజ్ఞను మఱువలేదు. నే నీ ముహూర్తమందే మీవారును పరిత్యజించుచుంటిని. జనకా! యిఁక నేఁ బోదును. [అని తండ్రిపదములకు మ్రొక్కిలేచి] తమ్ముఁడా! నే నిఁక వెడలిపోవుచుంటిని. నీవు చిరంజీవివై సుకంబుండుము. [అని సాలింగనపూర్వకముగఁ దమ్మునాశీర్వదించి, తాఁ బ్రస్థాన మొనరించును.]

రాజసింహుఁడు—[క్షణకాలము నిరుత్తరుఁడై యుండి, పిదప జయసింహు నుద్దేశించి] జయసింహా! కలుఁగుచో నీ యీ సోదరునకుఁ దమ్ముఁడ వనిపించుకొనుము.—[క్షణమూరకుండి] వత్సా! యిఁక పోయి శయనింపుము.

(జయసింహుఁడు నిష్క్రమింపగనే)

రాజసింహుఁడు—భీమా! భీమా! నను గన్న తండ్రీ! ఇఁక నన్ను నీవు పేర్మింపకుము. జన్మభూమిని స్మరించుచు, ప్రసంగించుతటి నీ కంఠము రుద్ధమైపోయెను. ఇఁక నాకుఁ గ్రాహ్యమగు సదాకళుష్క ప్రణామము మాత్రమే! నిజదోషంబునకతన నెట్టి పుత్రుఁగోల్పోతిని! [అని నిజనేత్రములనుండి బొటబొట రాలు బాష్పబిందువులఁ దుడిచి కొనుచు రాజసింహుఁ డా ప్రదేశమునుండి నిష్క్రాంతుఁడగును.]

[The noble youth Bheem Sing adverts with characteristic docility to the great example of self sacrifice shown by Sree Ram whom he feels proud to own as his ancestor. True it is that Bheem Sing left his throne of Mewar to his frivdous brother Jai Sing as Rama did his of Ayodhya to his loving brother Bharata. True it is that Bheem Sing expatriated himself from his 'Sweet home' to drag his life on rugged hills' in dark cells and awe-inspiring jungles as the immortal Rama did so centuries ago. Examples *such* as these (I lay stress on

'*such*') which bespeak of the reverential deference evinced to the Wishes of the parent and which shed lustre in the annals of the land of sages are, I regret to aver, not to be found anywhere in the Mythologies, Epics and cart-loads of histories of other climes.

The reader may be pre-informed that the noble Bheem Sinha sacrifices his life while fighting against tremendous odds in the great battle of Marwar! [Vide Act III Scene 5]

## పంచమదృశ్యము

చిత్తూరు సన్నిహితకాననము — మొగలుశిబిరము.

అపరాహ్ణకాలము — సామ్రాట్ యౌరంగజీబు ఉత్తేజితభావమున [In an excited state] నిలువంబడియుండును. సమ్ముఖమున దిలీర్ఖాను యజీములును, పార్శ్వమున శ్యామసింహుఁడును నిలువంబడి యుందురు.

ఔరం — ఏమి దిలీర్ఖానా! నీవు కూడ యుద్ధమం దోడివచ్చితివా?

దిలీర్ — స్వామీ అవును. ఓటక మోడియే గాదు. సర్వస్వముఁ గూడఁ గోల్పోయి వచ్చితిని!

ఔరం — కుమార్ యక్బరో!

దిలీర్ — ఆతని విషయమై యేమి వింటినో, యది విశేషశుభమైనది కాదు. ఆతఁడా రావళిగిరిసంకటమున రాణా రాజసింహుని పుత్రుఁడైన జయసింహుని కరములందుఁ గైదీయై యుండెనని వింటిని!

ఔరం — కైదియా? — భారతభావిసామ్రాట్టైన యక్బరు రాజపుత్రుల కరములందుఁ గైదీయై యుండెనా? — యీ మాట మొగలాయీల యవమానమాత్ర పూర్ణమాయెను!

అజీమ్ — [స్వగతమున] ఏమి! భారతభావిసామ్రాట్ యక్బర్ ఖైదా?!

దిలీర్—ఇపుడు దేవర నిజవార్తయేమి ?—దోవారిభూమివీడి యిపుడు దేవరు చిత్తూరుదుర్గమూలయం దాశ్రయస్వీకార మొనరించిరేల ?

ఔరం—దిలీర్ఖానా! రాఠోరు సేనాధిపతియైన దుర్గాదాసుచే నేఁ బూర్తిగఁ బరాంతుఁడ నైతిని. లొట్టియులను, ఏనుగులను, ఖాద్యభాండారమును, ప్రాణాధికమైన బేగమునుకూడ నే నీయుద్ధమునఁ గోల్పోయితిని.

దిలీర్—అట్లైన స్వామివారిబరువు చాలవఱకు తగ్గిపోయినట్లున్నది. ఇపుడు ఢిల్లీ తిరిగిపోవుట జాలసులభముగనుండును!

ఔరం—ఈయవమానము నాదలఁదాల్చి, ఢిల్లీ మరలిపోదునా? మహారాజ్ఞీ! ఏమందువు?

శ్యామసింహ—పోఁజాలవు! పోఁజాలవు!! అసంభవ మసంభవము!!!

దిలీర్—స్వామీ! క్రమేలకసామజవృషభ మహిష బేగములభారము నుండి విముక్తులైనయనంతరమే, యవమానభారమును వహింపఁ దాల్చిరి. ఇఁక మగుడి నిజపురంబునఁ కరుగుట కష్టమేమి ?

ఔరం—దిలీర్ఖానా! ఈ దుఃఖసమయమున నీవు పరిహాసములోనికి దిగుట మంచిపని కాదు!

శ్యామ—అవును సేనాధిపతీ, పరిహాసమునకు సమయాసమయము లున్నవి!

దిలీర్—సామ్రాట్టూ! దుఃఖసమయమందే పరిహాసము నాకుఁ జాలబాగుగనుండును. దుఃఖావస్థలోనే యది నామఖమునుండి బాగుగ వెల్వడును! ప్రభూ! కరుణహాస్యమునుమన దొకటుండు టెఱుంగుదురా?

ఔరం—మొగలాయీలకెన్నఁడిట్టి యవమానము కలిఁగియుండ లేదు.

దిలీర్—ఇట్టి యవమానమన, మీవలన వారలకుఁ బ్రాపించినట్టి

దనియా? స్వామీ! నేనును యట్లేతలంచుచుంటిని.

ఔరం.—నావలనం బ్రాపించినదా లేక నీవలనం బ్రాపించినదా? దుర్భాగ్యవశమున నేఁడు దిలీర్ఖాను మొగలాయి సేనాధిపతి యాయెను! నేఁడు యశవంతసింహుఁడే జీవించియుండిన—

శ్యామ.—ఆహా! ప్రభూ! నేఁడు యశవంతసింహుఁడే జీవించి యుండిన, నింత యమంగళము జరుగక నేపోయెడిది!

దిలీర్.—చక్రవర్తి యిచ్ఛగించిన, నాతఁడు నేఁడు జీవించియే యుండఁ గలిఁగెడువాఁడు!

ఔరం.—ఏమి!— నీవేమియోచించి యట్లంటివి?

దిలీర్.—యోచించుట కేమున్నది!—స్వామీ! జరిగినసంగతి యేమో నే నెఱుంగకపోలేదు! దేవర యశవంతుని గాంధార భూమికంపి, యచ్చో నాతనిం బొలియింపఁజేసిన జ్లెఱుంగక పోలేదు. ఏనాఁడు మానినీతిలకంబగు యోధపురరాణి మొగ లాయివాహినీవ్యూహసమ్ముఖమున నిర్భీకయై యీశ్వరునిపై సంపూర్ణభారమిడి, విద్యుజ్జ్వాలామయియై నిలువంబడి నిజపుత్రి సహితంబుగ నాత్మోత్సర్గమొసరింప గమకించుట విలోకంచితినో, యశవంతునకు సూపఁబడిన ఘోరనౌరాత్మ్య మానాఁడు హృదయమును వేధించిన ట్లెన్నఁడు వేధించలేదు! ‹యశస్తిల కుండగు యశవంతుని’ హత్యమొగల్సామ్రాజ్యమును సంపూర్ణ ముగ వినాశమొసరించునని యానాఁడే గ్రహింపఁగలిగితిని! దేవర యిచ్ఛగించిన, సాహసోపేతుండైన యోధపురపతి శత్రువు కాక దేవరకు మిత్రుఁడైయుండెడివాఁడు. అంతియకాక, యీరస పుత్రులు (ఔరంగజేబువంకకుఁ దిరిగి)—మహరాజ్ శ్యామసిం హునివలె నాత్మాభిమానవర్జితులై, స్వదేశద్రోహులై, కాపురుషు లైన రసపుత్రులమాట సెప్పటలేదు. (శ్యామసింహునివంకకుఁ

దిరిగి) దుర్గాదాసువలె న్యాయప్రకృతులై, యుదారులై, సరళులై వీరవరులైన రాజపుత్రులు—మొగలాయి రాజ్యమునకు ఝంఝాసహాయులు కాక, స్తంభసహాయులై యుండెడివారు!

ఔరం—ఎట్లెట్లు?

దిలీర్—ఎట్లందురా? భారతభూమి యాతీతేతిహాసపత్రములఁ ద్రిప్పి చూడుఁడు. ఎట్లో యెఱుంగఁగలుఁగుదురు. మానసింహ, భగవాన్‌దాస్, టోడర్‌మాల్, వీరబాలురే లేకుండిన, నేఁడు మొగలుసామ్రాజ్యముయొక్క యస్తిత్వముండకనేపోవును! యీ యౌరంగజేబు ఢిల్లీసింహాసనమున నాసీనుఁడుగా లేకనేయుండును!! ఏభిత్తిని యక్బరుమహాత్ముఁడు దృఢమొనరించి యరిగెనో, తాము నేఁడు దానిని తమ స్వాత్మఘాతుక నీతిమూలంబున జీర్ణీభూతముఁ గావించివైచితిరి!

ఔరం—నేనా!

దిలీర్—అవును మీరే! ఏ మానసుంకమును స్థాపిత మొనరింపకున్న, నీదిక్కున సింహబలులగు రాజపుత్రులు లేక శత్రులు కాకనే యుందురు! ఆదిక్కున భీమబలులగు మహారాష్ట్రులు హుంకార మొనరించుచు లేవకనేయుందురు! పురుషసింహుఁడు రాణా రాజసింహుఁడు మీహితంబు నభిలషించియే, యుదారుండు గావున నిత్తెఱంగున లిఖించెను. మీరాతనిఁ దుచ్ఛమొనరించి, నిజవినాశనకూపమును ఖనన మొనరించుకొనుచుండిరి! రాజాధిరాజా! భయము నూపి, యీ ప్రకాండజాతి నెన్నండెవ్వరుఁ బాలన మొనరింపఁ జాలరని యెఱుంగుఁడు. దేవరయధీనమం దుండదలఁతురేని వారలట్లనేయుందురు;—అట్లుగాక వారలందఱు విరక్తులగుదురేని, వారల శుద్ధమిళితయుష్ణ నిశ్వాసమున మొగల్సామ్రాజ్యమంతయు ఝంఝావాతులోద్ధూతమగు దూదిపింజచాడ్పున చదల

తలమున కెగసిపోవును!

[The statesman-like expatiation of Dilir reminds us the magnificent perorations of the great Burke. Aurangzeb alienated the sympathies of the valiant Rajputs and rendered them his inveterate enemies by pursuing a policy of relentless cruelty and by saddling them with the execrable *Jajiya* tax in the same way as the English two centuries ago rendered the brave Americans their implacable foes by arrogantly hurting in their face the uncharitable theory of 'taxation without representation.' Edmund Burke the greatest statesman of his times progrosticated, in his own inimitable way, the ignomivious fiasco of the English policy, as Dilirkhan in the above passage angurs the complete dismemberment of the Moghul Empire. Like the great Burke, the noble Dilir avers that coercion subverts and conciliation promotes the tranquility of a great Empire.

[A similar idea is expressed by the noble Shajahan in the sixth scene, fifth Act 'Mewarpatan' while conversing with Hedayath Alikhan].

The words of Dilir holy reprehension recall to our memory the pithy and pregnant expressions of the immortal Burke, *scilicet* Moral forces are more powerful than political regulations; magnanimity in politics is not seldom the truest wisdom and a great Empire and little minds go ill together; friendly ties though light as air, are as strong as links of iron &c. &c.[

ఔరం—దిలీర్‌ఖాన్! నేనివిషయమును చింతించెదను! నాశిరము ఘూర్ణిల్లిపోవుచుండెను. నేనిపుడేమియు భావింపఁజాలకుంటిని.

(ఇట్లని సామ్రాట్టు నిష్క్రమించును.)

దిలీర్—ఔరంగజీబూ! భగవానుఁడు నీమనసుఁ ద్రిప్పుఁగాక!

అజీమ్—(స్వగతమున)—భారతభవిష్యసామ్రాట్ యక్బరా!— అసంభవము! అతఁడట్లు కాఁజాలఁడు!

దిలీర్—(స్వగతమున)—కుమార్ యజీముముఖ మేలకో వెలవెల బాఱియున్నది! (ప్రకాశముగ)—షాహజాదా! ఏమి యోచించు చుంటిరి?

అజీమ్—ఏమి యోచించిన నీకేమి? నీ వార్చువాఁడవా తీర్చు వాఁడవా?

(అని తక్షణమే యూతఁ డాస్థానమునుండి వెడలిపోవును.)

దిలీర్—ఏదో విశేషము జరిగియుండును! ఒక్క దోవారియుద్ధ పరాజయమేమైయుండదు!— రాజకుమారుని చిత్తము నస్యచింతా సంకట ముగ్రయించెను!

శ్యామసింహ—దిలీర్ఖాన్! నీవు యోడివచ్చితివా?

దిలీర్—(ఆకస్మికముగ శ్యామసింహునివైపునకు దిరిగి)—అవును-- అవునోయి చిట్టితండ్రీ! బుల్లినాయనా! ఓడే వచ్చానోయి!— రాజపుత్రులు తమశక్తివలన నిఁక లేతురని నీగుండెలలో తాయి పడినది కాఁబోలు! ఇఁక దేవరవారికండ్లు చిటచిటలాడిపోవునా యేమి? రాజపుత్రులు లేచుట ముఖస్తుతిబలముచేగాదు—శరీర బలంబుచే!—యిది నాయన గారికిసహ్యముగాయుండదు కాఁబోలు!— పాపము చిట్టితండ్రిగారి యీర్ష్యావేశన మెట్లుతగ్గునోకదా!

శ్యామసింహ—నాకట్టి యీసులేదు. నీవు పెడర్థములోనికి దిగితివి! నేఁ జెప్పఁదలఁచిన దేమన—దిలీర్—పాపమేదో చెప్పఁదలఁచి తీవా? పూర్తిగాఁ జెప్పలేకపోతివా? ఎంతకష్ట మెంతకష్టము! కాని, బాబయ్యా! నీ "చెప్పఁదలఁచుట" నాకెందులకు? దానితో నా కేమిపని?—భగవాన్! నీసృష్టి యెంతయద్భుతమైనది! ఏజాతియందు దుర్గాదాసు జన్మించెనో, యాజాతియందే శ్యామ సింహుఁడు జన్మించెనేల? ఆశ్చర్యమాశ్చర్యము!—మంచిది! సింహంగారూ! నీ పేరు శ్యామసింహుఁడుకాక శ్యామసుజ

జోహారో లేక యబ్దుల్ శ్యామయలీఖానో యైయుండిన సరిగా గుదిరిపోయెదిదినుమీ! ఏమంటావే మహారాజ్జీ!

(నేపథ్యమున గోలాహలము శ్రుతమగును)

శ్యామసింహ—ఓ! ఓ!! అదేమిశబ్దము!!!—జయోల్లాసధ్వని!!!! దుర్గాదాసిటకువచ్చి, మనలు జేతులు గాళ్ళుగట్టివేయునుకదా!

దిలీర్—మహారాజ్జీ! పరిగెత్తు! పరిగెత్తు!!—బ్రతికివుంటే బలుసాకుతినవచ్చును! పాటిపో! పాటిపో!! ప్రాణం చల్లగావుంటే చాలును! ఉఱుకు!—ముందున కుఱుకు!!

శ్యామసింహ—కాదుకాదు! వారు "అల్లా! అల్లా హో!!" అని కేకలిడుచుండిరి—వారలు మనసైనికులే!

దిలీర్—అవును! వారలు మనసైనికులే! కాకున్న "హరహర శంభో మహాదేవ శంభో ఓం ఓం!" అని కేకలు వేసెడివారలు!—ఏమందువు? అవునాకాదా?—సరే, మహారాజ్జీ! నీకు ముఖస్తుతి విద్య నెవరునేర్పిరి?

శ్యామసింహ—నీకా తబిసీళ్ళన్నియు నెందులకు? సేనాధిపతివని నీవు చాల మిట్టిపడుచున్నావు! నీవేమైన నాకేమి? నాతో నీవధిక ప్రసంగము చేయకుము!

దిలీర్ఖాన్—అయ్యో! అయ్యో!! అంతకోప మెందుకయ్యా మహారాజ్జీ! మాటవరుసకుమాత్ర మడిగినాను! ఆనేర్పిన మహాశయుడెవరో గొప్పవిద్వాంసుడై యుండును! మహారాజ్జీ! ఏమివిద్య నేర్చితివి! ఏమికర్తవ్య మభ్యసించితివి!!—వాః!

(షాహజాదా యక్బరు ప్రవేశించును)

శ్యామసింహ—ఓహో! షాహజాదా యక్బరుగారు! షాహజాదా యక్బరుగారు!! (The son of the Emperor is called Shahjada)

దిలీర్—అవునవును!— షాహజాదాగారే!— వందేగి (సలామ్)

కుమార్!—యువరాజుగారు శత్రుహస్తముముందు గైదీలైయుంటి రనివింటిని—అట్లైన నావార్తమిథ్య!

శ్యామసింహ—అవును నాకుఁ దెలియును! అది మిథ్యయే!

దిలీర్—అవును మిథ్యయని తేలిపోయినది!—నిశ్చయముగ మిథ్య యే! మహారాజ్జీ యెప్పుడు మిథ్యయని సెలవిచ్చిరో, అప్పుడది తప్పక మిథ్యయని నమ్మ తీరవలసినదే!—వారిమాటకు వేరే చెక్కా చెదరా యుండుట యసంభవము!—అవును కాదా మహారాజ్జీ! నేనన్నది నిజముకాదా?

శ్యామసింహ—షాహజాదా నిక్కముగ శత్రువులఁ దునుమాడివచ్చి యుందురు!

దిలీర్—అవును. నేనుకూడ నట్లే తలఁచుచుంటిని—షాహజాదా! తాము రసపుత్రులని బంధించి తీసుకొని వచ్చి యుందురు! అట్లే కానిచో నింతజయోల్లాస ధ్వనియేల బయల్వెడలును?

అక్బరు—కాదు దిలేర్. బంధితుఁడగుట రాణాకాదు; నేనే! రాణా కరములందు నేనే బందీనైతిని!

శ్యామసిం—అట్లైన కౌశలముచే ముక్తులై వచ్చియుందురు.

అక్బర్—కాదు మహారాజ్! —రాణావదాన్యత కతనము క్తుఁడనైతిని దిలీర్ఖానూ! రసపుత్రులు రణమొనరింపఁ గలరుజుమీ!

దిలీర్—ఏమి యేమి! అట్లా!

అక్బరు—ఒక్క రణమే యొనరింపఁ గలిగినవారు కారు!—వారు క్షమఁగూడఁ గావింపఁగలరు!

దిలీర్—ఓః! ఇదియొక క్రొత్తవిశేషమే!—అత్యద్భుతయావిష్కా రమే!

శ్యామసింహ—ఇపుడు ముక్తులైతిరి?

అక్బరు—దిలీర్ఖానూ—

దిలీర్—మహారాజ్జీకి ముందుఁ దెలుపుఁడు—పాపము వారికిఁ జాల తొందరగా నున్నది!

అక్బర్—అట్లైన మహారాజ్జ వినుఁడు! సైన్యసహితముగ నే నారావళీ గిరిసంకటమునఁ బంజరాబద్ధుఁనై, యశనరహితు నగుడు మృతప్రాయుండనై యున్నతఱి, నన్ను వధింపవలదనియు, నన్ను బంధితుఁ గావించుటకుమాఱు నాకు భోజనసౌకర్యములఁ గూర్పవలయుననియు, నాకెట్టి యపాయముఁ గలుఁగ నీకుండ నన్ను సమ్మానపురస్సరముగ విడిచి వైచవలయు ననియు తెలిపి రాణా తనపుత్రుఁడైన జయసింహుని నాకడకంపెను.—యింతకంటె నేమి కావలెను?

దిలీర్—అంతటితో విరమింపక రాణా మఱొక కార్యముఁ గూడఁ గావించిన బహుయోగ్యముగ నుండెడిది!—ఆతని పుత్రికలలోఁ బసినిమ్మపండుంబోలు యొకర్తుకను మొగలు యువరాజున కిచ్చి పెండ్లిగావించి, సారెసహితముగ నామెను భర్తతోఁ బంపిన జాల యుత్తమముగ నుండెడిది! పాపమట్లు జరిగినదిగాదు! ఇఁక నేమనుకున్న నేమిప్రయోజనము!—యువరాజా! ఇఁక లోనికిఁ జనుఁడు! చాల యలసివచ్చితిరి! ఇంతి బిడ్డయింటిక దక్కెను! అదేపదివేలు! మహారాజ్జీ! నీవిఁక నావెంట దయచేయుము. సందేహించు చుంటివేమి? ఓహో మహారాజ్జీ కీవేళ నిక్కడ గొప్ప విందుకాఁబోలు!—పప్పు ధప్పళములతోఁ గాలక్షేపము చేయుదు వనుకుందును! వాః—నీ రొట్టె నేతిలో పడినదోయి! పిండివంటలతో యుద్ధము చేయుటలో మహాయోధుఁడె వనిపించుకొనెదవు కాఁబోలును! పులావు యభ్యాస మీపాటికే యై యుండును! వాః—ఏమి నీ యదృష్టము! మహారాజ్జీ!—అయ్యో! నోరు జారినది! మహారాజ్జీ! ఇఁకఁ గాలహరణముఁ గావింపక విస్తరికడకుఁ బయ

నము కమ్ము!

[విభిన్న దిక్కులుగ వారలు నిష్క్రాంతులగుదురు.]

షష్ఠదృశ్యము

రాజపుత్ర శిబిరము—అపరాహ్ణకాలము

రాణా రాజసింహుఁడును, యశవంతుని పత్నియగు మహా మాయరాజ్ఞియు నుపవిష్టులై యుందురు. సమ్ముఖమున మొగలు పతాకమును హస్తమునందిడుకొని దుర్గాదాసు రాజపుత్ర సామంతులతో నిలువంబడి యుండును.

రాజసింహ—ధన్య, దుర్గాదాస్! నీవు మొగలాయీలచే మీవారు నుండి ప్రతాడిత మొనరించి వైచితివి.

రాణి—ధన్య, దుర్గాదాస్! నీవు బేగమును బందీగావించితివి! ఇఁక నేఁ బగఁదీర్చుకొందును.

రాజసింహ—ఏమి! దుర్గాదాసూ! నీవు బేగమును బందీఁగావించితివా!—ఏ బేగమును?

దుర్గా—కాశ్మీర బేగమును.

రాజసింహ—ఏమట్లొనరించితివి! వెంటనే యామెను విడచివేయలేదా?

దుర్గా—రాణా! నేను సేనాపతిని మాత్రమే. యుద్ధమందు శత్రుపక్షమువారలఁ గైదీలఁగావించు యధికారము నాయది! వారల విడచివైచు యధికారము లేనిది!!

రాజసింహ—దుర్గాదాసూ! ఇప్పుడేపోయి, బేగమ్‌సాహేబును తత్క్షణమే విడచివైచి సమ్మానపూర్వకముగ నామెను సామ్రాట్టుకడ కంపివేయుము.

రాణి—రాణా! ఆమె నేలఁబంపి వేయవలయును?

రాజసింహ—కాంతలతో నాకెట్టి వివాదములేదు!

రాణి—లేకుండుట నిక్కమే! అట్లైన మహారాణా! నేనువచ్చి మీ యాశ్రయగ్రహణ మొనరించితినేల? నన్ను గ్రహింపఁగావించి కొంపోవలెననియేకదా మొగలాయీ నీ ఘోరసంగ్రామము సలిపిరి! నేనే యీ యూలమున సామ్రాజ్ఞీకరములఁ గైదీనైన, నామె నన్నేమి జేసెడిది!

రాజసింహ—మొగలుల నీతి ననుకరణ మొనరించుట మనకుచితము కాదు.

రాణి—మహారాణా! మీరే క్షమించినను సరే! నేనీ బేగమును విడువను. పగఁదీర్చుకొందును!

రాజసింహ—పగఁదీర్చుకొందువా? రాజ్ఞీతిలకమా? పగ యెందులకు?

రాణి—ఎందులకందురా! ఎందులకుకాదని ప్రశ్నింపుఁడు! ఈ కాశ్మీర బేగమే నాపతిపుత్రుల దన కడుపుఁ బెట్టుకొనెను! ఈ కాశ్మీర బేగమే నన్ను వన్యపశువు పగిది స్థానమునుండి స్థానాంతరమునకు దఱిమితఱిమి యర్ధగతప్రాణఁగావించినది!—రాణా! పగదీర్చుకొనక నే నీమెను విడువను. ముష్టిమధ్యంబునఁబడసి యీమెను నేను యథేచ్ఛగఁబోనీయను!—పగసాధించెదను!

రాజసింహ—పగనెట్లు సాధింతువు?

రాణి—ఎట్లు సాధింతునో యింకను జెప్పఁజాలను! బాగుగ యోచించి తెలిపెదను! అంగుళ మంగుళ మీమెను దగ్ధ మొనరించినను యది యీమె దురాత్మ్యానికి, దగుశిక్ష కానేరదు! ఆమె సర్వాంగములందు సూచీభేద మొనరించినను, యది తగుశిక్ష కానేరదు!

[Even the piercing of the needles all over her person will not be an adequate punishment to her] ఎట్లు వేధించినఁదగు దండమగునో

యోచించెదను! నూతన యంత్రణాయంత్రమును నావిష్కార మొనరింతును! నారికుచిత శాస్తి యేదియో నారియే యెఱుంగును!

రాజసింహ—మానినీతిలకమా! పాపులకు శాస్తి నొసంగుటకు నీవును నేనును యెవ్వరము? ఎవ్వాఁడొసంగవలయునో, యాతఁడే దాని నొసంగును.

రాణి—(లేచి)—ఆతఁడే యొసంగునా?—ఎవఁడతఁడు? ఆతఁడెచట? ఆతఁడు చేతులు ముడుచుకొని కూరుచునియుండెను! మహారాజ్జీ! గగనమునుండి బహు భయంకరనిర్ఘాత మెప్పుడు పాపులశిరముల పైనేబడదు!—పుణ్యాత్ముల మస్తకములపై గూడఁ బడును. భూకంపమున నొక్క పాపుల గృహములే భగ్నములు కావు. నిరీహదరిద్రుల కుటీరములే ముందు చూర్ణములగును. ఉన్నతమహీరుహములు తలలనెత్తి నిలువంబడియుండ, భూమినంటియున్న గరిక పోచలే ప్రబలజలోచ్ఛ్వాసమందు మునింగిపోవును! ఈశ్వర నియమము ధర్మాధర్మవిచార మొనరింపదు—యెచ్చో జీర్ణకాయులను, స్థవిరదేహులను, దుర్బలాంగుల నది గాంచునో, బిఱానబోయి యది వారి సద్యోగళంబులచే నొడిసిపట్టి, నులిమి చంపివైచును!

రాజసింహ—రాణీ! ఉద్ధతవై, యీశ్వరునిపై విచారణ సలుపఁ గూరుచుండకుము. భగవన్నియమానుసారముగ నధర్మ మంతిమమందుఁ బతనమొందకమానదని యెఱుంగుము!

రాణి—అదెప్పుడు! నేను దానిని నేఁటిపర్యంతము వీక్షింపలేదు! సారల్యమాజీవనము శాఠ్యచరణతలమునఁబడి భిక్షువేఁడుటయు, శాఠ్య మొకమాత్రైన దానిపై దృక్పాత మొనరింపకుండుటయు మాత్రము నేఁజూచుచు వచ్చుచుంటిని! సత్యము చిరకాలము మిథ్యకు దాస్యమొనరించుచు, లజ్జచే నుత్తమాంగ మెత్తఁజాల

కుండెను! న్యాయక్షేత్రమం దన్యాయముయొక్క విజయనిశాన ముడ్డీనమైయుండుటఁ జిరకాలమునుండి విలోకించుచుంటిని! ధర్మముయొక్క భగ్నమందిరమున నధర్మముయొక్క జయభేరీ మ్రోయింపఁబడుటఁ జాలకాలమునుండి వినుచుంటిని. పుణ్యముయొక్క శ్యామల రాజ్యోపరిభాగమునుండి కలుషముయొక్క భైరవరక్తవన్యాతరంగములు ప్లావితములగుచుండెను; శ్యామలతాచిహ్నమాత్రమైన గన్పట్టుచుండుట లేదు! ఉత్కోచముతోడను (With bribery), యత్యాచారముతోడను, (With torture), మిథ్యావాదితముతోడను (With untruth), పృథివి యంతయుఁ బూర్ణంబైయుండెను!—అట్లయ్యు, యంతిమమందు నిక్కముగ ధర్మజయ మగునని సెప్పుచుంటిరి!—అదెప్పుడు?—యెప్పుడు?—యెప్పుడు?—

రాజసింహ—మహారాణీ! శాంతింపుము! నీవు మిగుల నుత్యక్తవైతివి! [You are greatly agitated] ధైర్యమూనుము!!! సహనముఁ దెచ్చుకొనుము!!!

రాణి—రాణా! ధైర్యమా! సహనమా!! మీరు నారియైనచో, మీ దూరప్రోషితభర్త విశ్వాసఘాతుక విషముచేఁ బొలియింపఁ బడినచో, మీసరళోదార పుత్రుఁడు నిష్ఠురభావమున హత్యఁ గావింపఁబడినచో, క్షుద్రనిస్సహాయ శిరీహశిశువుం దోడ్కొని నావలె తామకూడ దేశమునుండి దేశాంతరమునకుఁ బ్రతాడితులై పరనిలయద్వారోపాంతములఁ బికారులై గ్రుమ్మరుచో, ధైర్యసహనము లేవేూ బాగుగ దెలుఁగఁ గలుఁగుదురు! రాణా! నేనాపాపీయసిని విడువను!

రాజసింహ—దుర్గాదాసా! నేను సజీవుఁడనై యున్నంతకాల మబల యెడల నూపఁబడు దౌరాత్మ్యమును నేత్రములతోఁ జూచి సహిం

పఁజాలను. నీవు పోయి, ఆ యబలను సమ్మానపూర్వకముగ సామ్రాట్కరములందు సమర్పణ మొనరించిరమ్ము!

రాణి—దుర్గాదాసూ! నీవు రాణాభృత్యుఁడవు కావు. నాచేతిక్రింది యుద్యోగివి!

దుర్గా—మహారాణీ! మన్నింపుఁడు. ఈ యుద్ధమందు మనమందరము రాణాభృత్యులము! బేగమ్ నేఁడు బందియై యుంట మీవారు రాణాకరములందుఁ గాని, మార్వారుమహిషికరములందుఁగాదు! రాజ్ఞీతిలకమా! ఆత్మవిస్మృతులు కాకుఁడు! మీరతూర్థమే రాణా యీ కదనమందుఁ గత్తిబూనిరి! దానంజేసి రాణాతోఁ దాము యూథప్రసంగము సలుపుటుచితము కాదని నా యభిప్రాయము!! మన మాతని యానను ల్లంఘింపరాదు!!

రాజ్ఞి—[కియత్కాలము నీరవయై యుండి పదపడి]—దుర్గాదాసూ! నీవు సత్యము వాక్రుచ్చితివి.—[పిదప రాణాసమ్ముఖమునవతజానువయై]—మహారాణా! మన్నింపుఁడు. వేదనంబుచే నుత్యక్తనై, యొడలెఱుఁగక దుర్వినీతనై యేదియో ప్రేలితిని. క్షమింపుఁడు! కాని,—దేవర యీ తీవ్రవేదనము, నీవిదారుణజ్వాల, నీగాఢయంతర్దాహమున గ్రహింపఁగలిఁగినచో—పోనిండు! పరితాపముచే బొక్కుచునే యుందును!—ప్రభూ! క్షిప్తప్రాయనైతిని! క్షమింపుఁడు!

రాజసింహ—మహారాజ్ఞీ! క్షమించితిని! కాని నీ వేక్షమను నన్ను వేఁడితివో, యాక్షమనే సామ్రాజ్ఞికిఁజూపుము. నీసమ్ముఖమున నామెను విచారార్థమై నిలుపుచుంటిని! ఆమెను క్షమించి, నీవు నీ మహాత్త్వమును చూపుము. రసపుత్రికుల శమంతకమా! ప్రేమ దయాభక్తి క్షమగుణములకతననే కాంత పూజ్యురాలగును. వాని మూలంబుననే యామెకు శక్తిలాభంబు చేకూరును—జననీ!

ఇకశాస్తి నొసంగఁ గోరుదేని,-నీకు దౌరాత్మ్యము సూపినకాంతను నీవు సస్మితముఖివై మన్నించిన, నదితక్కువశాస్తియని దలం తువా ?

రాణి—మంచిది. దుర్గాదాసూ! సామ్రాజ్ఞి నిచ్చటికిఁదీసుకొనిరమ్ము!

[దుర్గాదాసు నిష్క్రమించును.]

రాజసింహ—అట్లయిన మహారాణీ! సామ్రాజ్ఞిని నీకృపపై నిర్భర మొనరించి నేవెడలిపోవుచుంటిని.

[రాణా నిష్క్రమించును]

[The spirit of forgiveness which pervades the holy expostulations of Rajasinha reveals the *Mahatma* that is in him. Here in lies the greatness of the illustrious Rajput but not (great as they are) either in his ineffable prowess or in his admirable administrative acumen.]

రాణి—అట్లయిన నేమి! ఈ విచారాసనమున నాసీననై, నేనామె నేరమును విచారింతును—అదేచాలును. భారతసామ్రాజ్ఞి,—ఔరంగజీబుబేగమ్,—నాపతి పుత్రహంత్రియైన శత్రువు నేఁడు నా సమ్ముఖమున ఖైదీయై నిలువంబడును! నేనుసింహాసనమం దుపవిష్టనై క్రింద నిలువఁబడిన యామె ముఖముపై దీవ్రదృష్టుల బఱపి, యామెకుఁ బ్రాణభిక్షనొసఁగెదను. అట్లు గావించుటే రాణావచించునట్లు, యామెను దండించుట!—అదిగో! ఆమెవచ్చు చున్నది. ఇపుడుకూడ నామె ముఖమం దాదర్పమే తోఁచుచుం డెను—దృష్టియందాదీప్తియేకన్పట్టుచుండెను—పదదాపమందా గర్వమే కానంబడుచుండెను!—జగదీశ్వరా! పాపుల నిట్లుజ్వాల మొనరించి జన్మింపఁజేసితివేల?

(గుల్‌నేయార్ సామ్రాజ్ఞిసహితముగ దుర్గాదాసుప్రవేశించును)

రాణి—బేగమ్‌సాహేబూ! సలామ్!

గుల్‌నేయూర్—ఎవరు! యశవంతసింహుని పత్నియా!!

రాణి—అవును! గుర్తింపఁజాలకుంటివా? నన్ను గుఱుతింపఁజాలని దానవే నన్నుఁబట్టవలె నని నీఘోరసన్నాహము సలిపితివా! యవనయువతీ! నీవు నాపతి పుత్రుల మ్రింగివైచితివి! అట్లు వారల నీపొట్టంబెట్టుకొన్నను, నీ రాక్షసయుదరము పూర్తముకాలేదు! అందుచే నన్నును, నా పసిపాపను కూడ మ్రింగఁగోరితివి! ఇంత లోనే యంతయు మఱచితివా? బేగమ్‌సాహేబూ! ఇంత మఱు పుండిన నెట్లు జరగును?

గుల్—(దుర్గాదాసు నుద్దేశించి)—దుర్గాదాసువునీవేనా?

దుర్గాదాసు—అవును సామ్రాజ్ఞీ!

గుల్—నన్నిచ్చటికేల గొనివచ్చితివి?

రాణి—ఇచట మీ విచారణ జరగును.

గుల్—నావిచారణమా? ఎవరికడ?

రాణి—నాకడ!—మాటశూలములై వక్షమును గ్రుచ్చుకొనెనా! పాప మిపుడేమిచేతువు!—బేగమ్‌సాహేబూ! ఇపుడు చక్రమెదురు తిరిగినది! ఏమి!—దుర్గాదాసునట్లనిమేషనయనవై వీక్షించుచుం టివేల? నన్నుఁగైదీఁగావించుటకే యెంతసాహస మెంతపాటిదని యోచించుచుంటివా?—పాపమిట్లు యోచింపకుండనైన నెట్లు లుండఁగలవు! మంచిదిపుడేమిశాస్తికావలెనో తెలుపుము!

గుల్—నేను నీకైదీని! నీయిష్టమువచ్చిన తెఱంగున నాచరింపుము!!

రాణి—నాయిష్టమువచ్చిన తెఱంగున నాచరింపమందువా? బేగమ్ సాహేబూ! అట్లేయగుఁబో, నద్వ్యాచరణ మతికఠోరముగ నుండు జుమీ! నేనిచ్చగించినశాస్తి కొనఁగిన, నీవు సహింపఁజాలవు! అది యత్యంత నిదారుణశాస్తియైయుండునని యెఱుంగుము. నరక జ్వాల దాని సమ్ముఖమున వసంతవాతూలమువడువున శీతలమై

యుండును! శతవృశ్చిక దంశనాయంత్రణముకూడ దానికడ శైల
నిర్ఘరవారిచాతుర్వన స్నిగ్ధమేయుండును!—నా యిచ్ఛానుసార
యాచరణమిందువా!—సరే—భారతసామ్రాజ్ఞీ! నీవు నన్నే నైదీ
గాబడసిన నన్నేమిచేసియుందువు?

గుల్—ఏమిచేసియుందునా?—నీచే నాపాదోదకముఁ ద్రావించియుం
దును! అంతటితో సూరుకొనక నీగ్రుడ్లుపీకించి, పదపడి నీ కంఠ
మునఁ గొట్టు గ్రువ్వించి నీప్రాణములఁ దీయించెడిదానను!

రాణి—ఇంకను నీ పొగరడంగలేదా?—విషదంతములు విఱిగిపోయి
నను యాస్ఫాలన ముడుగలేదా? యవనయువతీ! నీవాంఛలన్నియు
వమ్ములయ్యెను. నీ యాశలన్నియు నడుగింటెను! నేఁడు నేను
నీ బందిని కాక నీవే నా బందీవైతివి! తానొకటితలఁచిన దైవం
బొకటి తలచునను!—బేగమ్‌నా హేబూ! గుల్‌నేయాహూ!
భారతసామ్రాజ్ఞీ! నీవు నేఁడు నా ముష్టిగతవైతివని యెఱుం
గుము! ఇచ్ఛగించిన నేనే నీచే నాపాదోదకముఁ ద్రావింపఁ గలుఁ
గుదును! నేనే నీ గ్రుడ్లను బీకింపఁగలుఁగుదును!!—నేనే నీ కంఠ
మునఁ గొట్టుఁగ్రువ్వించి నీ ప్రాణములఁ దీయఁగలుఁగుదును!!!
కాని, నే నట్టు లాచరింపను! కరుణాపురస్సరముగ నిన్ను విడచి
వైచుచుంటిని!—సేనాధిపతీ! నీ వీమెను యీమె వల్లభున
కొప్పగించి రమ్ము—[గుల్‌నేహూర్ నుద్దేశించి] పొమ్ము—
నిలువంబడి యుంటివేల!—అబ్బుర పడుచుంటివా? ఇదే రస
పుత్రులు సూఫుపగ!—యిదే రాజపుత్త్రుల ప్రతిశోధము!!

శ్రీ

# దుర్గాదాస్

## తృతీయాంకము

### ప్రథమదృశ్యము

ఢిల్లీ ప్రాసాదబహిర్మందిర పాశ్చాత్యమంటపపు వసారా

ప్రభాతకాలము—తాహబ్బర్ఖాను యక్బరులు నిలువంబడి ప్రసంగించుచుందురు.

తాహబర్—అలాగా! అట్లైన మిమ్ము రాజపుత్రులు సరిగ నెలుకల బోనులోఁ బడవైచిరా?

అక్బరు—అవునట్లే గావించిరి! మేము సరిగ ముందునకు కదలిచూచు తఱి, వెలుపలకుబోవు పథమేమియుఁ గానంబడలేదు. వెనుకకుఁ దిరిగి చూచునరి కాదిక్కుఁగూడ బంధింపఁబడియే యుండెను.

తాహబర్—సరిగ బోనులోఁబడిన మూషకమువలె మీ రొకమారీవైపునకు, మఱొకమారావైపునకును గెచ్చదులాడుట నొక తమాషాగా రాజపుత్రులు పర్వతముపైనుండి చూచుచు నిలువంబడిరి గాఁబోలు!

అక్బరు—నూఱుగురు సరుసైనఁ గ్రిక్కిఱిసి నిలువంబడుటకైన వీలు కానట్లాగిరిపథమంతయు నిఱుకై యుండెను. మన సైనికు లెవ రెచటనుండిరో చూచుటకైన సాధ్యముకాలేదు—ఆపథమంతయు సంత సంకీర్ణమై యుండెను!

తాహబర్—అందఱుఁ గొండరాళ్ళతోఁ గలసిపోయినట్లు తోఁచినది

కాంబోలు !

అక్బర్—అవును ! ఎట్లు కలిసిపోయిరి—

తాహబర్—ఏవి కొండరాళ్ళో, యెవరు సైనికులో, దెలిసికొనుట దుష్కరమైనట్లా ?

అక్బరు—కాదు. ఆ వివక్షత బాగుగనే తెలిసినది !

తాహబర్—అట్లనా?—అట్లైన యుద్ధము జరిగినదా ?

అక్బరు—యుద్ధ మెవరితోం జేయుదుము ?—పర్వతములతోడనా?— శత్రువు లెందుండిరో మేము గానంజాలకపోతిమి.

తాహబర్—అట్లైన నే ననుకొనినట్లే యాయెను ! అయినను వారితో యుద్ధముచేయుటమాత్రమేమి ! రాజపుత్రులు యుద్ధము చేయుట యెఱుంగరని నేను మొట్టమొదటినుంచి చెప్పుచునే యున్నాను !—వారి లోకనియమమైన లెఖ్ఖచేయరు ! తిండి తిననీయకుండం గయ్యమునకుం గాలుదువ్వువారలను ... రెన్నం డైన కని విని యెఱుంగుదురా ? అట్టివారు నేంటి కొక్క రాజపుత్రులు మాత్రము కన్పించుచుండిరి !

(అజీము ప్రవేశించును)

తాహబర్—వందేగి షహజాదా ! (సలాము రాజపుత్రా !)

అజీమ్—(తాహబరువంకకు దిరిగిచూడక)—అక్బరూ ! వింటివా?

అక్బర్—ఏమి ?

అజీమ్—మీవారు యుద్ధమందు, నీ వొందినపరాజయము జనకునిం జాల నొవ్వంజేసెనని !

అక్బర్—నేనేమిచేతును !—అజీమూ ! ఈ రణమందు నే నొక్క రుండచేం బరాజితుండను కాలేదు ! దిలీర్ఖానంతటివాండే—

అజీమ్—దిలీర్ఖానుయెడలగూడ జనకుండు సంతుష్టుండు కాలేదు.

అక్బర్—సామ్రాట్టు మాత్రమో ? నీవుమాత్రమో ? మీరలు

జయోపేతులరై వచ్చితిరాయేమి?

అజీమ్—మేముపవర మొనరించి, ప్రశాంతులమైతిమి!

అక్బరు—నేనుమాత్రము?

అజీమ్—విలాసామోదములందు గాలహరణ మొనరించితివట!— అట్లని జనకుడు వచించుచుండెను!

అక్బరు—ఆతడట్లువచించిన నే నేమిచేతును!

తాహబర్—షాహజాదా! మీ సోదరుని యుద్ధముచేయుటెవరితో?

అజీమ్—ఛీ! నోరుముయ్యి !!

తాహబర—ఓరిబాబో—

అక్బరు—అట్లైన నిపుడుచేయవలయునదేమి? —నేను భీరుండను!విలాసపురుషుండను!! నృత్యగీతప్రియుండను!!! అట్లైన నిపుడేమి జరగును?

అజీమ్—ఇక జరుగున దేమి? సోదరా! నీవు పనికిమాలిన వాడవని తలచి, జనకుడు నిన్ను మున్ను వంగదేశమునకంప నుంకించెను. నీకొఱకై వేయువిధముల బ్రార్థించి, నేను జనకుని మనసు ద్రిప్పితిని! ఆతడు నీయెడల మిగుల గినిసియుండెను! కాన జాగరూకుండవై మెలంగుము! జనకునితో నిక విశేషప్రసంగము సలుపకుము! నీశ్రేయము నభిలషించువాడగాన నేనిట్లువచించుచుంటిని! అనుజా! ఇక నే బోయివచ్చెద.

(నిష్క్రమించును)

తాహబర్—రాకుమారా! ఏమిట్లాయెను!!—సంగతంతయు బాడుగా కనుపించుచున్నది! మీరు యుద్ధమందోడి చాల తెలివిమాలిన పనిచేసితిరి!

అక్బర్—ఇచ్ఛాపూర్వకముగ నే నోడితినా?

తాహబర్—అవునది నిక్కువమే! కాని, యనిచ్ఛాపూర్వకముగనైన

నోఁడుటుచితముకాదు! సామ్రాజ్యము లభించునను యాశ యీ
వఱలోఁ గొంచముండి యుండిన నది యిప్పుడని రాశయైపోయెను.

అక్బరు—అట్లైన, సామ్రాజ్యమెవరికి లభించును?

తాహబర్—ఇఁకేరికి లభించును?—అజీముకే! చూడలేదా! బుస్సు
మని యాతఁడెట్లు పడగెత్తి నాప్పై దుముకనుంకించెనో! లోపల
విషమేయుండనియెడల, చేటంతపడగెత్తగలిగియుండునా? బుస్సు
మని మీఁదికు రాగానే నేనెట్లు వెనుకకుఁదగ్గిపోతినో చూడలేదా!

అక్బరు—అజీముతానేమో గొప్ప వీరుఁడని చెప్పుచుండువాఁడు!
అట్టివాఁడిపుడు విద్రోహుఁడై వచ్చెనా?—పూర్తిగనోడి యరు
దెంచెను! ఊరకనోడివచ్చెనా, భోగసామాగ్రిని కూడఁగోల్పోయి
వచ్చెను! రాజపుత్రులుదారులుకావున వారలు బేగమును
సామ్రాట్టునకు సమ్మానపూర్వకముగ నొసఁగివైచిరి.

తాహబర్—అజీమోడి వచ్చుట నిక్కమే; కాని, ఆ యోటమి
సామ్రాట్టుయొక్క యోటమియేకదా! చక్రవర్తి నోరు తెఱచి
యేమియుఁ జెప్పలేకపోయెను! అజీము సార్వభౌముని చేతిక్రింద
నున్న యుద్యోగి. మీరల్ స్వతంత్రులైన సేనాధిపతులు!

అక్బరు—అజీము చక్రవర్తికిఁ బ్రియపాత్రుఁడు. వెలసని, ముఖస్తుతిఁ
గావించుటం దతఁడు నిపుణుఁడు! జనకునకు సంతోషముఁ
గలుఁగఁజేయు మాటఁ డెన్నని యెత్తులువేయుచుండును. తండ్రి
వలెనే యధికారాపేక్షుఁడై ముసల్మానిమాద్రి ప్రవర్తిల్లు
చుండును! సురను ముట్టక, గానము వినక, దినమునకుఁ బది
మారులు నమాజుఁ జేయుచుఁ గపటశక్తి మెలఁగుచుండును!

తాహబర్—మీరుకూడ నట్లేల గావింపరు?

అక్బర్—తాహబర్! నేను సామ్రాజ్యమును త్యజింపనైన త్యజింతు
గాని, సురా, నారీ, గానములఁ ద్యజింపఁజాలను. నే నజీముపగిది

నీచుఁడనుకాను! బ్రదికినన్నాళ్ళు హాయిగఁ గాలముఁబుచ్చవలె ననియే నా యభిప్రాయము! [I wish that I should eat, drink and be merry, as long as I live]— అజీము యభ్యాసములు నా కేమియు నచ్చవు! అతఁడు నీచుఁడు! భీరుఁడు!! ద్వైతవాది!!!

తాహబర్—ఊరకుండుఁ దూరకుండుఁడు—సామ్రాట్టు వచ్చుచుండెను. తలఁ గాచుకొనుఁడు!

[అక్బ రేమియుఁబలుకక, యుక్షితభావమున వెడలిపోవును. ఔరంగజేబు దిలీర్ఖానులు ప్రవేశింతురు]

ఔరం—ఏమి! దుర్గాదాసు ఘూలోకును స్వాధీన పఱచుకొనెనా? పురమండలమున సుబలదాసుకూడ లోహిలాలఁ బరాజితుఁ గావించెనా?

దిలీర్—స్వామీ! అవును—అంతటితో రాజపుత్రులు విరమింపలేదు. దయాల్ సాహా మొగలు సైనికులను మాల్వానుండి తఱిమివైచెను! అంతటితో పోనీక, ఖుపు దచటి న్యాయాధిపతుల బలవంతముగఁబట్టి వారల శ్మశ్రువు ముండన మొనరించుచుఁ, గోరానును కూపమునందు విక్షేపించుచు, మసీదులనన్నిఁటిఁబృథివిం గూల్చుచుఁ గ్రుద్ధశార్దూలమువలె చరించుచుండెను!

ఔరం—ఏమి! తుదకు మతమునకే గార్హ్యము సూపుచుండిరా?

దిలీర్—అట్లోనప్పుట వారలెఱుంగనే యెఱుంగరు. స్వామివారే వారలకుఁ బథము సూపితిరి! దేవరవారు హిందువుల వేదములను స్ఫులింగకుండమున శాంతివైవలేదా? బ్రాహ్మణులఁబట్టి వారలచే బలవంతముగఁ గొరానుఁ జదివింపలేదా? తీర్థక్షేత్రముల నపవిత్రములఁ గావింపలేదా?—ప్రభూ! నాపలుకుల నాలింపుఁడు! హిందూవిద్వేషము మానుఁడు! జిజియాసుంకమును రద్దుపఱుపుడు! భారతమాతాగర్భసంజాతులగు హిందుముసల్మానులఁ

గలిపివేయుఁడు! అట్లొనరింపకున్న, ముందుగ ముసల్మానులకే ముసలము సంభవించును !

[Reader! did you perceive the statesman in the noble Dilirkhan 'who never spoke against a foe'? Had Aurangzeb acted up to the sage counsel of the great Delir "who never sold the truth to serve the hour, nor paltered with Eternal God for power, and whose language was ripe with rugged maxims hewn from life," the great Moghul Empire wouldn't subsequent to the death of the Philip II of Hindustan, have fallen in the vortex of dismemberment; yea, the Indian History would have been quite different from what it is now! It is unfortunate that the sons of India, Hindus and Mussalmans, still run with murder in hand at one another's throat—a sin done to their holy Mother and a sin that, when persistently done, can never never be expiated even by the historical fasts of the Jesus of India !!]

ఔరం.—హిందూముసల్మానులెన్నఁడొక్కటై యుండఁగాదు. నేను సజీవుఁడనై యున్నంతకాలము, ముసల్మాను ముసల్మానుగను, కాఫరు కాఫరుగను యుండవలెను!— దిలీర్ఖానూ! దాక్షిణాత్యమునుండి రమ్మని మాజామునకుఁ బత్రములిఖించితిని. ఈ పర్యాయము మొగలాయివాహినుల నన్నిఁటిఁ దోకొని మార్వారు నాక్రమణ మొనరించెదను! ఏమి జరుగునో చూచెద!—తాహబ్ర్ఖానూ! ఎబ్బదివేల సైనికులఁ దోడ్కొని మార్వారుపై దండువెడలుము. మఱికొంత సైన్యముఁ దోడిచ్చి యక్బరు నంపుచుంటిని; వాహినీసమేతుఁడనై నేను వెనుక బయల్వెడలివచ్చెదను—మార్వారును స్వాధీన మొనరింపఁ గలుగుచో సామ్రాజ్యమం దొకఖండమును నీకుఁ బ్రసాదించెదను. అట్లొనర్ప

జాలకుండిన, లోహశృంఖలములు నీకుం బురస్కారములగును !

(నిష్క్రమించును.)

**తాహబర్** —ఖన్సాహేబూ ! ఏమిబుద్ధి !—ఇంకేమి చేయుదును !! త్రోవేమి ! తెన్నేమి !!

దిలీర్ —ఖన్సాహేబూ ! శత్రుటుపడకుము. ఒకమారు పోయి చూచిరమ్ము. నేం జూచివచ్చితిని ! నీవు మిగిలితివి. తరుణముం బోంగొట్టుకొనక బయల్వెడలుము !!

తృతీయ దృశ్యము

ఢిల్లీప్రాసాదాంతఃపురస్థ ప్రమోదోద్యానవనము: సాయహ్నకాలము గుల్ నేహూర్ సామ్రాజ్ఞి, ఆ యుద్యానమున విచరణ మొనరించుచుండును.

గుల్ —ఏమిదీర్ఘాయతబలిష్ఠశరీరము ! ఏమియుచ్చప్రశస్తలలాటము ! ఏమి తీక్ష్ణదృష్టి ! ఏమి దృఢనిబద్ధబంకిమయోష్ఠయుగళము !—దుర్గాదాసు నిక్కముగ సుస్ఫురద్రూపి ! కాని,—యేమి యాశ్చర్యము !—ఆతం డొక్కమారైన నన్ను గర్వితభావమున నేల విలోకింపలేదు ? విమోహితుండై నా నేసముండెలము పై నే యాతండు తనవాంఛాతృష్ణలం బఱపలేదు ; జగంబున విమోహితమొనరింపంగలుగు నా యతులసుసౌందర్యము విస్మితుండై వీక్షింపలేదేల ? నాదృష్టిజ్యోతిచ్ఛటలచే నాతం డంధుండైపోలేదేల? నాకరస్పర్శ విద్యుత్ప్రవాహముకతన నాతండు మూర్ఛితుండైపోలేదేల ? జగధీశ్వరా ! నీ జగతియం దీదృశమానవులుకూడ నుండిరా !—

[పాడుచు పాడుచు రజియా ప్రవేశించును]

రజియా—

నాదనామక్రియ—ఆదితాళము.

నాచేసచరితానందీత తైయా తైయా నా చేసచరిత ఆనందీత
తైయా తైయా

హిందూస్థాని

"నారదశారంగబీరబజావేతు గాజుగా గావెఖ్యాత్
కిన్నరవిద్యాధరతపలాబేల్ బాజచౌతాల్ జబ
నాసితజేగోపాల్ ఖ్యాసుందరసుఖముఖలాల్
దునియాకంగిరంగ హాహా బోలుం ॥నాచేస॥
హరిగురుసుగురు అఖిలదేవతా బ్రహ్మకోటిసురసజితాల్
మృదంగధతీసరాగరస ఛంఛంఛంఛం దునియా
బూలగయోసత్సంగ దుర్గన్ గత్తూరేమొగ
బోలోజ్యోతి రామభూజజ సపరజ ॥నాచేస॥

జియా—భామ్మయ్యా! చీకటిపడినను, నీవింకను యీ నిర్జనోద్యాన వనమున నేకాకినివై యుంటివేల?

పల్—ఏకాకినినై యున్నప్పుడే నా యుల్లముల్లాసముతో నిండి యుండును.

రజియా—ఈవఱలో నిట్లుండెడిదానవుకాదే!—భామ్మా! ఈమధ్య నీ వింత చింతాకులవై యుంటివేల?—ఇంతకు మున్నెన్నఁ డిట్లులేవే!

గుల్—అమ్మడూ! నీ వెప్పుడైన బ్రేమించియుంటివా?

రజియా—అయ్యో! ప్రేమించియే యుండలేదా!—వేసవికాలము రాగానే మామిడిపండ్లయెడల జాలనుక్కువ గలుగుచుండును. వర్షాకాలములో దొరకువాని యన్నిఁటియెడలకూడ నా కనురాగమే! శీతకాలమురాగానే నామన సెప్పుడును యూచబియ్యము మీఁదనే యుండును. ఇంతేకాక బుఱ్ఱగుంజు తేగలకు నామనసుకు

లంకే యని చెప్పవచ్చును!—వీనిమా టిట్లుండ మన పెంపుడు పిల్లియనిన నాకత్యంతప్రేమ! బామ్మా! అది "మ్యావుమ్యావు" మనినపుడు దానిపాట యెంతశ్రావ్యముగ నుండును! ఏ శృతితోను కలియకపోయినను, ఆ 'మ్యావు' శబ్దము చెవులకుఁ జాలయింపుగా నుండును!

గుల్—ఛీ! తెలివిమాలినపిల్లా! నే నడిగినది నీ వెపుడైన నెవరైన మనుష్యుని ప్రేమించితివా యని.

రజియా—మనుష్యునా! ప్రేమింప కేమి?—ప్రేమించితిని!—నీ వనిన నాకుఁ జాల ప్రేమ! మాఅమ్మపై గూడ నాకుఁజాల మోపేకు కలదు. అంతేకాక నే నిదివఱలో నొకరిని జాల ప్రేమించెడుదానను; కాని, పోయినతరువాత యిపుడు తలఁచుకొనిన మాత్రము ప్రయోజన మేమి?

గుల్—నీవు ప్రేమించిన దెవరిని?

రజియా—మన ముసలివంటవానిని! బామ్మా మ్యా? ఏమి వంటే వానిది! వంటలని వానిదే చెప్పవలెను! త్యాగరాయకృతి చెవి కింపుగా నుండునట్లు వానివంట హ్వాకెంతొ రుచిగా నుండేది! "ఇనకులాతీయిలాఅనా! యెపుడు కృపాపా—" పాపము వాఁడింకను ముతికొంత కాలము బ్రదికయున్నఁ జాలబాగుగ నుండెడిది కదా!

గుల్—అమ్మడూ! వినెన నొకపాటపాడుము!

రజియా—[స్వగతముగ] ఈమె యిపుడు క్రొత్తమానిసిగ నున్నది!

[పిదప సోల్లాసముగ] వినెదవా?—వీణపట్టుకొని వచ్చెదను.

[పరువున నిష్క్రమించును]

గుల్—ఎట్లైన నే నా రక్కసిని శిరోజములతో నీడ్చించి సమ్ముఖమునకు రప్పింపవలయును. ఎట్లులైన నామె దంభమును చూర్ణ

మొనరించి తీరవలయును!—ఏమి యూతని యాత్మసంవరణము! భువనోన్మోహిని భంగి పరిసరమున నిలుచంబడిన సామ్రాజ్ఞిపై నొక్క మాఱైన దృక్పాత మొనరింపక వెడలిపోయెనే!—లాలసముచే జర్జితుఁడు గాలేదే?—కామముచేఁ బరవశుఁడు కాలేదేల! నత జానువునై నా కృపాకటాక్షభిక్ష వేఁడకుండు టబ్బురము!!

[రజియా ప్రవేశించును]

రజియా—[వీణఁ గేలఁబూని కూర్చుండి] బాఇన్నమ్మా! ఏమి పాడ మనెదవు?

గుల్—నీ కిష్టము వచ్చిన కృతిని పాడుము.

రజియా—అట్లైన త్యాగరాయకృతి నొకటి పాడెదవినుము.

[వీణ కేలఁబూని రజియా పాడును]

గిలహరిరాగము—ఆటతాళము.

“ప॥ దొరకునా యిటువంటి సేవ॥

అ॥ దొరకునా మున్ను తపమొనరించిన భూదేవతలకునైన సురల కైన ॥దొ॥

తుంబురునారదులు సుగుణసంకీర్తనముల నాలాపము జేయగా।

అంబరీషముఖ్యులు నామము జేయుచు జాజులపై జల్లగా।

బింబాధరులగు సురవర విరిబోణులు నాట్యములాడగ!

అంబుజభవసాకారు లిరుగడల నన్వయబిరుదావళినిపొగడ!

అంబరవాసచెలులు కరకంకణంబులు ఘల్లని విసరగ।

మణిహారంబులు గదలగ యూచె ఫణితల్పంబున నెలకొన్న హారినికనుగొన ॥దొ॥

మరకతమణిసన్నిభ దేహంబున మెరుగు కనకచేలముశోభిల్లగ।

చరణయుగ నఖావళికాంతులు చెందురుపిల్లల నేజేరా।

వరనూపురములో వెలుగగ గని రాజవ్రజపు భూషణము మెరయా

యురమున ముక్తాహారములు మెరయ సుచిత్రమైన మకరకుండ
నమ్ములు।
చిరునవ్వులుగుల్క వదనంబును ముంగురులందపు కపోలము
ముద్దుల గురియు।
దివ్యఫాలమ్మున తిలకము మెరసే దివిలావణ్యనిధి కనుగొన ॥దా॥
తామసగుణరహితములకు పొగడతరముగాక నిత్యమరచి।
శ్రీమత్కాంచన కోట్లపైన నెలవొందగొలువుండగ।
కామితఫలదాయకుని మాసీతాకాంతుని కనియుప్పొంగగా।
రామబ్రహ్మతనయుడా త్యాగరాజనుతుని కీర్తి పాడుచూ
నిరాచగా।
రాముని జగదోద్ధారుని సురరిపుభీముని చిన్మయరూపుని।
పూర్ణకాముని శ్రీగుణాశ్రితుని సద్గుణధాముని కనులారమది
గొన ॥దా॥

గుల్—అమ్మడూ! నీ కంఠనాదము నాకు విశేషము బాలకించునే! నిన్న రాత్రి మేడయంతస్థుపై కూరుచుని పాడినపాటను పాడుము.

రజియా—అది పాటకాదు పద్యము. వీణమీదగాని దానిని పాడుట నాకు సాధ్యము కాదు.

గుల్—అట్లైన వీణను ప్రక్కనుంచి పాడుము.

[రజియా వీణను ప్రక్కనుంచి లేచి పాడును.]

గీతమాల

తటినియందున ఝంఝ యుత్పన్నమాయె;
పొంగిపొరలగసాగెను గంగవారి;
అందుపోచ్చెడ నావమాన మంతవీడి,
హృదయ ఝంఝకోర్వగలేక సుదనుదలంచి;
ప్రాణపణమును కావించి, ప్రణయినైన

కాంతనై యుండ, నిఁక నేమి సుంతయైన
శంక జెందఁగ నేల? భృశంబు చింత
సలిపి, లోతుఁజూడక నట్టె నిలచియుండి.

రజియా—ఇది శంకరాభరణరాగము. గాయకులీ రాగాలాపనమును గంటలకొలఁది గావింతురు. ఇట్టి యాలాపనమున యమాశాస్త్రీజీ దేశస్థులే గొప్ప నిపుణులు. [ఒకించుక రాగము విసరి] ఈ రాగ మతి మధురముగ నుండును కాదా?

గుల్—నిజంబుగఁ బూర్వ స్రవంతియందు ఝుంఝురోత్పన్నమాయెను! నేఁడువుచే నాయుత్తరఝుంఝుర్యోద్భూతవాహిని సరికట్టఁగలనా? అవసరమేమి? అరిగట్టఁ బ్రయత్నించుటమాత్ర మెందులకు? ప్రేమ ప్రబలోచ్ఛ్వాసము హెచ్చించి నన్ను గ్రాసమొనరించి, తన గభీర గర్భమున నన్ను నిమజ్జితమొనరించి వైచుఁగాక!—ఉచ్ఛృంఖలమే నా యానందము; విరాటమే నా యుల్లాసము;—నిక్కముగ నా కీదుర్గాదాసు లభింపవలయును! యశవంతునిపత్ని నా యుపలక్ష్యము మాత్రమే! నా లక్ష్యము దుర్గాదాసు! ఔరంగజీబూ! మా ప్రాణము ముట్టడింపుము. వేగమే దుర్గాదాసును నా కడకంపుము! మనోభవా! ఒకించుక తాళుము. [నింగిఁజూచి] శశాంకా! నీ తారను నీవు చేరుము! నీ వేడి కిరణముల నాపై బ్రసరింపకుము! హా! మోహాంధకారా! హా! స్వర్గసమువర్ణా!! హా! మనోజమాపా!!! హా! దుర్గాదాసా!!! రమ్ము! రమ్ము!! రమ్ము!!

[వేగముగ నిష్క్రమించును]

[ఇంతదనుక, కూని రాగము దీయుచు, బాహ్యధ్యానయై యున్న రజియా గుల్ నేయారు నిష్క్రమించుటఁ గాంచి స్వగతమున]

రజియా—"ఇట్టి మధురరాగమే యామె వీనులకు రుచింపలేదు కాఁబోలు! వృషభంబునకుఁ బండివంటరుచి యేమి తెలియును!

గొణుగుకొనుచు వెడలిపోయెను! ఈ ముదుసలిది గొణుకుకొనిన మాత్రమున నాకుఁ గలుఁగు నష్టమేమియులేదు! దాని కతన నా గానమాధుర్య మంతరించి పోదు" [ఇట్టులని యామె యిట్లు పాడుచు నిష్క్రమించును]

[ఏనయా పాటను]

గీతమాల

రజనియందు నే కోర్కెమాఱైన తెప్ప
నాల్పునేనైతిని నాదు ప్రాణవిభుడ!
విరహవేదనచేఁ జాల వేగివేగి;
చింతనంతయుఁ దొలఁగింప శీఘ్రముగను,
చెంతసేరియు మిక్కిలి సంతసమున,
నెనరుఁ జూపుచు, జాయకు నీరజాక్షి!
సౌఖ్య మొసఁగుచుఁ దేలింప, సగనీవు
నమ్ము మిదె బనాఘ నీ దాసికడకు.

ద్వితీయ దృశ్యము

మార్వాడు పర్వతశ్రేణి—ప్రభాతకాలము

దుర్గాదాసు భీమసింహ లొకరికొకరెదురై నిలువంబడి యుందురు. అతిదూరమున గ్రామవాసులు కోలాహల మొనరించుచుందురు.

దుర్గాదాసు—భీమసింహా! మొగలాయివాహినులన్నిఁటిఁ దోడ్కొని సామ్రాట్టు మార్వారుకు ముట్టడించును! ఈ పర్యాయము జీవనమరణసమస్యయే! ఈమారు రాజపుత్రజాతి యుచ్ఛేదమైన గావలయును, లేక స్వస్థానమైన గావలయును—వీరా! ఈ మహాయాహవార్థమై సంసిద్ధుఁడవుకమ్ము.

భీమ—అందులకయ్యే జనకుఁడు నన్నీతావునకంపెను. నే నీసమరమందుఁ బ్రాణములు సమర్పింప వచ్చితిని!

దుర్గాదాసు—శిశోదీయకుమారా! (you, leader of the Sisodayas!) నీ శౌర్యస్వార్థత్యాగములు నే నెఱుంగక పోలేదు. నీవు మహాత్ముండవే; యిప్పుడు మహాత్ముండవు కావలయును. నీవు వీరుండవే; కాని, యిప్పుడు తీవ్ర వీర్యశిఖరము నధిష్ఠింపవలయును!

భీమ—సేనాధిపతీ! నిశ్చింతులై యుండుఁడు. కర్తవ్య మెఱిఁగి, యీ కదనమందుఁ బ్రాణవిసర్జన మొనరింప వచ్చితిని. జనకుని కొఱకును రాజపుత్ర విజయముకొఱకును, అస్మదిచ్ఛాపూర్తికొఱకును నేఁ గఠోరకర్తవ్యపథము ననుసరించి వచ్చితిని. ఆ కర్తవ్యమార్గము నుండి భీమసింహుఁడు స్ఖలితుఁడు కాఁజాలఁడు. మీరిప్పలుకు విశ్వసింపుఁడు.

దుర్గాదాసు—పూర్తిగ విశ్వసించితిని.

భీమ—మహారాణి యెచట?

దుర్గా—ఆమె సమస్తమార్వాడునందును యుండెను! నగరగ్రామ పర్వతారణ్యములందు భ్రమణ మొనరించుచుండెను. మార్వారు ప్రజలనామె యుత్తేజిత మొనరించెను. స్వయముగ సైన్యసంగ్రహణ మొనరించుచుండెను. యశవంతసింహుని మృత్యువుకతన మార్వారంతయు విచ్ఛిన్నమైపోయెను! దానిం జేసి మహారాణి స్వయముగ మార్వారు ప్రజల నేకత్రితులఁ గావింప బయల్వెడలెను!

భీమ—నే నా యమ నొకమాఱు దర్శింపఁ గోరుచుంటిని.

దుర్గా—రాకుమారా! నేఁడే యామె దర్శనము నీకు లభించును. నేఁటి ప్రభాతమందే యామె యీగ్రామమున కరుదెంచును. నే నామెకొఱకే వేచియుంటిని.

[సమరదాసు ప్రవేశించును.]

దుర్గా—అన్నా! వార్త లేమైన దెలియవచ్చెనా?

సమర—తెలియవచ్చెను. మొగలాయి సేనాధిపతి యైన తాహ బ్ఖాను డెబ్బదివేల సైనికుల దోడ్కొని మార్వారాభిముఖుండై యరుదెంచు చుండెను! సుమూర్ యక్బరు మఱికొన్ని వేల యనీకంబుల దోడ్కొని వెనుక వచ్చుచుండెను.

దుర్గా—మఱి సామ్రాట్టు?

సమర—అతడు సైన్యసహితుండై యజ్మీరు నందుండెను. అతని సైనికులు లక్షకు మించియుందురు.

(దుర్గాదాసు భీమసింహునివంక జూచును.)

భీమ—సేనాధిపతీ! రాథోడుసైనికు లెందఱుందురు?

దుర్గాదాసు—పదివేలు మాత్రమే! మనకుంగూడ లక్షసంఖ్యకు మించినసైనికు లుండెడివారు, కాని యశవంతసింహుని మరణానంతరమున వారలందఱు చెల్లాచెదరై పోయిరి!—అనేకులు యుద్ధవ్యవసాయము మాని వాణిజ్య వ్యవసాయవృత్తులం గావించుచు జీవనోపాధి సంపాదించుకొనుచుండిరి! వారల సంతానాలంబునకుం బురికొల్పుటకే యిం[illegible] బయల్వెడలెను. ఆ కాన్పించు గ్రామవాసులం జూచుచుంటివికదా! వారలు జీవసరహితుల చాడ్పునసుండిరి! కాని యుత్తేజితులవారలు వారలేసుమీ! మహారాణివముఖ వినిర్గతవక్తృతయందు మత్తేజన విద్యుచ్ఛక్తి యున్నది!—ఆమె నేడు స్వర్గీయప్రేరణోద్దీపిత యైనట్లు కానంబడుచుండెను!! ఆమెవచనములచే నేడు హిమశలకముకూడ యుష్ణంబగును—మేఘడింభముకూడ భయంకరమగును!!!

భీమ—చూడుడు! మన రాణి వచ్చుచుండెను!!

దుర్గా—అవునామె వచ్చుచుండెను—భీమా! ప్రక్కకొత్తిగిలి నిలు

వంబడుదురు.

భీమ—(దుర్గాదాసు నుద్దేశించి)—వీరవతంసమా! మీరు వ్రాయి చ్చినదంతయు నిక్కము! ఏమి ఆ యపూర్వదృశ్యము! అట్టి యద్భుతదృశ్యమును నే నెన్నఁడు వీక్షించియుండలేదు! ఏమి మూర్తి! దానవదలనివలె గన్పట్టుచుండెను! మహిషాసురమర్దని మాడ్కి గానంబడుచుండెను! ఘనకృష్ణకేశరాశి యామెపృష్ట మున లుంఠితములై యున్నవి! ఆమె యద్భుతసిత కపోలము చికుర జాలపిహితమై యుండెను! ఆమె చక్షులందు దివ్యజ్యోతి యెట్టులు కన్పట్టుచుండెనో! ఆహా! ఆ మహిళలలాటమందు గర్వ మెట్లు తోఁచుచుండెను!—ఆ బింబోష్ఠియోష్ఠముల నెట్టివరాభయప్రద హాసము తోఁచుచుండెను!—సేనాధిపతీ! ఇఁక భయములేదు. స్వయముగ జననియను జన్మభూమి మానవీరూపముఁదాల్చి యరుదెంచెను! ఇఁక భయములేదు!!

[जननी जन्म भूमिश्च स्वर्गादा पि गरीयसी]

(దుర్గాదాసు భీమసింహులు వెనుక నిలువంబడుదురు. రాణియు, నామెవెనుక గ్రామవాసులును ప్రవేశింతురు.]

గ్రామవాసులు—జయ్ రాణీమాతాకూ జయ్!

మొదటి గ్రామవాసి—ఉండండి! తప్పుకోండి! రాణీగోరికి జాగా యియ్యండి!—ఒరే! ఆమూల నిన్నురా! జాగాయిడూ! నీకేరే సెప్పాలేంటి?

రెండవగ్రామవాసి—మాకు రాణీగోరు కాపట్టోనేదు!

రాణి యొక సన్నిహితయుచ్చప్రస్తరోపరిభాగమున నిలువం బడి—"గ్రామవాసులారా! పుత్రులారా!" యని యుచ్చైస్స్వర మున బలుకును.

మూఁడవ గ్రామవాసి—మాకేయీ ఋనమడ్ట్టోనేను! మాకేయీ

యినేమడ్ట్లో నేదు!! ఎంకన్న బావా! నీకేమైనా యినమడు తోందీ?

రెండవ గ్రామవాసి—ఏం యినమడ్టమోయి గోదారినమడ్టం! ఎక్కడికొచ్చినా గోలతప్పకుండావుంది!

రాణి—గ్రామవాసులారా! కొంచెముసేపూరకొనుడు. నేఁ జెప్పున దంతయు మీకర్ణములకు స్పష్టముగ వినంబడును!

నాల్గవ గ్రామవాసి—ఓసింతంద్రా! సెపుతో వుంటా మీకాకాదూ? —ఎక్కళ్ళేని కబుర్లు యీళ్ళకెక్కడివత్తాయి!—ముసలమ్మ కతలన్నీ యీళ్ళకెక్కడ!

రాణి—పుత్రులారా! వినుఁడు! నే నీదినము నిచటి కేల వచ్చితినో మీకు ముందు దెలిపెదను—వినుఁడు!—

ఐదవ గ్రామవాసి—ఒరే! దవళాపురాలోకాల్లారా! ఇనండ్రా! సెపుతోంది మీకాకాదంట్రా! ఎక్కడో చంతగొడవ తెచ్చిపెట్టేరు! —కూంచేపాగి, అమ్మగోరు సెప్పేదాన్ని యిన్నియండి!

రాణి—ముందుగ నే నెవ్వతెనో తెలిపెద వినుఁడు.

ఆరవ గ్రామవాసి—ఒరేయి! ఓరి గాడిదిల్లారా! ఊరుకోండ్రా! లొడ లొడమంటో యేంట్రా ఆగొడవ! ఇది చచ్చుకున్నారా లేకపోతే చంతెనుకున్నార్రా!

రాణి—ప్రజలారా!

ఏడవ గ్రామవాసి—ఒరేయి! ఓ సుండెగ్రా—చరే! మీ పనిల్లా కాదు! నప్పేమాత్తరగా నపితేకాని తెల్దుగామోసు! నోరు మెదపండి యీబిరి!—ఒక్కొక్కణ్ణే కంగిమువేసి మక్కలిర్గ మొదుత్తా!

రాణి—మహారాష్ట్రవాసులారా! నేను యశవంతసింహుని పత్నిని! ఔరంగజేబుయొక్క క్రౌర్యముకతన హిందూకుష్‌గిరిశ్రేణి కావల

వైపున గాంధారభూమియందొక తుషారసంకులస్థానమున నావల్ల భులును, మీ పాలకులైన యుద్ధ యశవంతసింహులు దేహత్యాగ మొనరించిరి! నా జ్యేష్ఠపుత్రుండును, మీ యువరాజును నైన పృథ్వీసింహు నౌరంగజేబు కౌశలవిషప్రయోగముచేఁ బొలియించి వైచెను! నా కనిష్ఠపుత్రుండును, మీ వర్తమాన నేలికయు నైన యజీతసింహుఁ డౌరంగజేబు గ్రాసమునుండి తప్పింపఁబడి దూరమం దొకమూలను గుప్తస్థలమున రక్షితుఁడై యున్నాఁడు. ఇఁక నేను—మీ రాణినగు నేను నేఁడనాథభిక్షారిణినై యున్నాను!

గ్రామవాసులు కోలాహల మొనరింపసాగుదురు.

ఎనిమిదవ గ్రామవాసి—అయితే మమ్మల్నేమి సేయమంటావు?

తొమ్మిదవ గ్రామవాసి—నాకేమీ తెలియనేదు.

పదవ గ్రామవాసి—తనవాళ్ళు చేసినపనికి మనం బాగా కసి తీర్చుకోవాలి! ఆడు డిల్లీరాజైనా సరే, ఢోల్లీరాజైనా సరే!

పదునొకండవ గ్రామవాసి—ఈ అమ్మగారిచ్చంగా మన రాణిగారు! 'అమ్మగారమ్మగో' అంటూ ఉత్తకన్నీళ్ళు కార్చితే లాభవేంటి? కష్టంవచ్చినప్పుడే కాపాడాలి! ఆవిడిని మనం కాపాడకపోతే యింకెవళ్ళు సాయపడతారు?

రాణి—గ్రామవాసులారా! వినుఁడు—నేను నేఁడు నా నిజదుఃఖమును మీ కడ వెడలఁబోసుకొనుటకై రాలేదు.—నేను మీ సమ్ముఖమున నిలచుట మన సుందరమార్వారురక్షణార్థమై మీ సహాయభిక్ష వేఁడుటకై మాత్రమే! చక్రవర్తి లక్షకుమించిన సైనికుల వెంట నిడుకొని మార్వారును ముట్టడింప వచ్చుచుండెను. మీరలు మార్వారు మాతపుత్రులు; మీరలు రాజపుత్రులు; మీరలు వీరులు; మీ జన్మభూమి పరపదదళితమగుచుండ మీ మాతృసీమ నిష్పేషితమగుచుండ, మీ యుద్భవస్థానము విధ్వస్తమగుచుండ

మీరలు నిశ్చింతులై చూచుచు నిలువంబడుదురా?

పంద్రెండవగ్రామవాసి—ఓరబ్బో! లచ్చకు మించిన సైన్యమే!

పదుమూడవగ్రామవాసి—ఆ! ఆ!! సూసువారూ! అమ్మో! నీ కెంత కట్టంవొచ్చింది తల్లీ.

పదునాలుగవగ్రామవాసి—దుర్గయ్య బాబెల్లి అదేంటో ఆతళం మీద—యేతళంమింటే! మరీమరీ! నోట్లో ఆమాటోనే వుంది! ఆ సెపకం వచ్చింది—అంటే సుగాలోరు మీద పడ్డాడు! ఇప్పుడు కొంప మునిగింది! మనోళ్ళు మాత్రం వూరుకున్నారేంటి?

పదునైదవగ్రామవాసి—అవు నిరయ్యామావా! తొంగున్న పెద్దపులి సెవిమట్టుకు లాగితే యేమౌతుందేంటి? ఇప్పుడు లబోలబో మని మొత్తుకుంటే యేంలాబం? కాల్జారిస్తరువాత కంటే మడవల్సిందే!

పదునారవగ్రామవాసి—లచ్చకు పైగా వత్తావున్న గడ్డపోళ్ళతో మనము దెబ్బలాట్టం యేంటి?—నెగ్గటం యేంటి? బాగా యుద్దం చేసే ఆళ్ళంతా చచ్చిపోయారు! గంజి నేకుండా తిప్పలు మడుతూ, కండా మీదా మడి కాలచ్చేపం చేత్తావుండే పద్దమ్మోర్లం మనం యుద్దం యేం చెయ్య కలం? ఏమంటావు బాపనయ్య తాతా?

పదునేడవగ్రామవాసి—దాని కేంగాని, యిందాకన్నించి చూత్తున్నాను! పిల్చేటప్పుడు చివరి రాజన్న ముక్క మరిచిపోతున్నారేన్రా? ఎగసాయం చేసుకుంటో వుంటేమాత్రం మన కులం పోయిందేంటి? అయితే కాని సెప్పొద్దూ! నాకు బాగా యుద్దం చెయ్యాలనే వుంది! కానీ మా ముసల్దొప్పుకోదు. దానికింకా నేనంటే మా ఆపేచ్చ! గట్టిగా సెపుతే యేడుత్తుంది! దాని కేడ్పొత్తే నాకూ వత్తుంది! [రాణి నుద్దేశించి]—అమ్మగోరూ! మమ్మ

ల్నాట్టే గాదించకుండి! మేము యుద్ధం సెయ్యలేము! అది మాకు చంబవం కాదు!

రాణి—సంభవము కాదా? సంభవము కాదా? అట్లైన మిమ్ము దూరముగఁ దోలివైచి కఱకులగు మొగలుతురకలు మీ స్వర్ణభూమినిఁ బదదళిత మొనరించి, దానిపైఁ దమ నిరంకుశాధికారస్థాపన మొనరింతురు! ఆ విషాదజనక దృశ్యమును మీరలు నిర్వికారభావమున నిలువంబడి వీక్షించెదరా! హా! ధిక్!! తరళమై, కోమలమైన సలిలమే తన్నెవ్వరైన స్థానచ్యుత మొనరింపఁ బ్రయత్నించిన, నది సాధ్యము కాదు!—నుతి మీరలు నీరవులై, నిశ్చేష్టులై, నిజజననిఁ బరహస్తమందు న్యస్తమొనరించివైతురా? మీరలు హిందువులు! ఇప్పుడు కృషీకులైనను, యిప్పుడు వేషభాషలందు హాలికుల మాదిరిగ నున్నను, మీరలు రసపుత్రకులజులు! మీరలు క్షత్రియులు! మీ కీకార్యము సంభవముకాదా? మీ స్వాములగు యశవంతసింహులు లిప్పట్టున బ్రదికియుండిన, వారి సమ్ముఖమున నిట్లు వచింప సాహసింతురా? వారి కొఱకై మీరలందఱు మీ ప్రాణముల నర్పింప సంసిద్ధులగుచుండువారు! యశవంతసింహుల మాటొక్క మాత్రంబుననే మీ రక్తముష్ణమాయెడిది! యశవంతసింహుల ముఖమునుండి వచ్చు నొక్క వచనము మీ చెవుల బడినంతనే, దశసహస్ర తరవారులు తమపిధానములనుండి వెలువడుచు లంఘించెడివి! యశవంతసింహులు ఘోటకారూఢులగుటఁ గాంచినంతనే మీ జితజయధ్వానము నభసీమను ధ్వనిత మొనరించెడిది! నేను నారిని! నేను యశవంతసింహుల విధవాపత్నిని! నేను నేఁడు పథభికారిణిని! ఇట్టి నిర్భాగ్యురాలి పలుకుల మీరలేల పాలించెదరు? ఇఁక నేను మీ రాజ్ఞిఁ గాను!

గ్రామవాసులు—అమ్మా! మీరుమా, మా రాణిగోరు! (మీరు

మా మహారాణీగారు! మీరేమి చెయ్యమంటే మేమది చేస్తాము. మీరెల్లావడమంటే మేమల్లావమౌతాము! మీమాట కెదురు చెప్పం!

రాణి—అట్లయినచో మీరిక మీ గ్రామములను, మీ కుటీరములను, మీ హర్మ్యములను విడిచిరండు! తరవారులం గరముల గైకొని మరల క్షత్రియులు కండు! లెండు! మహాదాసీత్వమును పరిత్యాగ మొనరింపుడు! ఒకసారి యుద్ధఘోషణ మొనరించి లెండు! తురీశబ్దము హర్షధ్వనులేచి మ్రోగింపుడు లెండు! లెండు—డమరుధ్వానము విని, ఘనాఘను విస్తారమొనరించి లేచుభయం కరధ్వని హ్వానము భంగిలెండు! లెండు—వజ్రధ్వనివిని శైలాభ్యంతరకందరాంత రాళములకంపింపలేచు ప్రతిధ్వని తెఱంగున లెండు! లెండు—ఝంఝూనిష్పేషణమునకు జలధితరంగ కల్లోలములేచు విధంబున లెండు! లెండు!! మీ శౌర్యము సుప్తమై మాత్ర మున్నదనియు, మీ శౌర్యము లుప్తము కాలేదనియు రాజస్థాన మెఱుంగుంగాక! మీ శౌర్యము సుప్తమైమాత్ర మున్నదనియు, మీ శౌర్యము లుప్తము కాలేదనియు జగం బెఱుంగుగాక!! మీశౌర్యము సుప్తమై మాత్రమున్నదనియు, మీశౌర్యము లుప్తముకాలేదనియు నెల్లంగ బెఱుంగుగాక!!!

గ్రామవాసులు—మహారాణీ! మేము మా పొలాలను, మానాగళ్లను యిడిచివేస్తాం! తుపాకులుతో మీ యిష్టం వచ్చేటట్టు పోట్లాడతాం; కాని, యీ యుద్ధలో బ్రతుకుతామనే ఆశే సున్న! ప్రాణాలిని యిడిచేందుకే యుద్ధంచేత్తాము! మృత్యువే మాకు రాసింది!

రాణి—మృత్యువా! గ్రామవాసులారా!—మృత్యు వొకప్పుడు రాదా? పర్యంకములపై పవ్వళించియుండ, మీగళంబుల నులిమి

వైచు మృత్యువు సుఖదాయికాదు! కాని స్వేచ్ఛగ, స్వచ్ఛందముగ, స్వాతంత్ర్యముగ, దేశార్థము,—పరార్థము,—కర్తవ్యార్థము ఆహ్వానింపఁబడు—మృత్యువే సుఖమృత్యువు!

గ్రామవాసులు—మహారాణీ! మేము యుద్ధంచేస్తాము! మీరెక్కడికి తీసు కెడతారో, మీ వెంటబడి మేము వస్తాం!

రాణి—ఇది మీకుఁ దగిన యుత్తరము!—పుత్రులారా! నేనెవరిని గాని వారి యిచ్ఛావిరుద్ధముగ బలవంతపెట్టుటలేదు! ఎవరికి మాతృభూమి యెడల ప్రగాఢప్రణయ మున్నట్టులున్నవో, యెవరి చెవులకు మాతృ(?)యార్తనాదము వినంబడునో, యెవరికి స్వధర్మము యెడల సమ్యగ్జ్ఞానమున్నదో, స్వాధీనతార్థ మెవరు నిజప్రాణములు నుత్సర్గ మొనరింప సంసిద్ధులగుదురో, వారలే నన్ననుసరించిరండు! అట్టి వారియం దొక్కరుండు నూర్గురు మహాయోధులతో సమునుఁడు! క్షీణసంకల్ప, ద్విధాసందిగ్ధములచేఁ బీడితులగు వ్యక్తులు నాకక్కఱలేదు! ఏకాగ్రచిత్తులై, దృఢమనస్కులై, సర్వత్యాగ (?) ప్రతిజ్ఞులైన వ్యక్తులే—నాకుఁ గావలయును!

[It is curious that the very same words flashed forth from the lips of the seer of Sabarmati at the time of his broaching up his Suddhi movement at the special congress held at Calcutta in 1920] రెండే పథములున్నవి! ఆ రెంటియందొక్కదాని ననుసరించి పోవలయును. ఒకమార్గము విలాసామోదాహ్లాదదోపభోగసముపేతమై యుండును; రెండవది శ్రమ, యనాహార, దారిద్ర్యదుఃఖభూయిష్ఠమై యుండును! ఒక తెరువు సంసారగృహశాంతులతో నిండి యుండును; రెండవది సమరక్షేత్రక్షతపరంపర—మృత్యుప్రపూర్ణమై యుండును! ఒక మార్గము నిజసుఖసమన్వితమై యుండును; రెండవయది దేశార్థ కర్తవ్యసంయుతంబై యుండును. ఈ రెండు పథంబులం దేపథము

ననుసరించి పోదలంచుచుంటిరో తెలుపుడు.

అందఱు—అమ్మా! మేము రెండోత్రోవగూడా నే వెడతాము. మాకు కష్టమేకాని సుఖ మక్కఱ్లేదు!

రాణీ—మంచి దిట్లైన నేఁడు రాత్రి యందఱు మిళితులుకండు! తుచ్ఛవివాహముల నీమహావ్రత యగ్నికుండమున నిక్షేపించుఁడు! ఒకమాఱందఱేకగ్రీవముగ జయధ్వాన మొనరించి మార్వారు మాతకాహ్లాదముఁ గొలుపుఁడు.—"జయ్! మార్వార్ మాతకు జయ్!"

అందఱు—"జయ్! మార్వార్ మాతకు జయ్!"

చతుర్థ దృశ్యము

యుద్ధక్షేత్రమందలి రాణాశిబిరము

రాత్రికాలము—వృష్టి, ఝటిక— విద్యుత్,—నిర్ఘాతములు వెల్వడును.

రమా పాడుచుండును.

గీతమాల

అంబరము నేల కప్పెనో యంబుదములు;
ప్లావితంబాయె వాతూల వారిఝరిగ;
దీర్ఘనిర్ఘాతగర్జ నల్దిశల మ్రోగె;
ఝంఝ ఝంఝాయమానమ్మదిసి యంత జగముమీఁద
లుంఠితంబై పడెను ఘోరకంఠరవము
సల్పుచు, నరులు భయమును జాలఁజెంది;
పింగళంబైన దామిని చెంగుగాను,
మెఱపు రుచులను వెల్గి చూపరుల కెంతొ

యబ్బురముఁ గలుఁగఁగఁజేసె; సవనియందుఁ
బంచభూత పవరము నాఁ దోఁచనపుడు.

రజియా——ఆహా! ఏమి యీ కోలాహలము! సైనికులెట్లు చీత్కార మొనరించుచుండిరి! మేఘములెట్లు గర్జనలుసలుపుచుండెను! రణ వాద్యధ్వని యెంతభీషణముగ నుండెను!——ఆకస్మికముగ నిన్ని శబ్దములు బయల్వెడలె నేమి! చెవులు గింగురుమనుచుండెను! ఈ యల్లకల్లోలమంతయుఁజూడ మనుజు లెన్నండును సంగీతశాస్త్ర చర్చ గావించి యుండినట్లు తోఁచదు!——ఊః! [చేతులతోఁ గర్ణముల మూసికొనును.]

[అక్బరు ప్రవేశించును]

రజియా——ఎవరు? బాబయ్యా!

అక్బరు——అవును తల్లీ!

రజియా——ఇదేమి! జనకా, ఆపాదమస్తకము తడిసియుంటి రేల? శాహిరముస నీ యల్లకల్లోలమంతయు నేమి;——బాబయ్యా ఇంత కోలాహల మాచుండెనేల?

అక్బరు——అమ్మా! వెలుపల యుద్ధముగుచుండెను. రాజపుత్రులు మొగలాయి శిబిరము నాక్రమణ మొనరించిరి!

రజియా——అయితే నేమి! స్వరవిరుద్ధముగ నఱచుటెందులకు?

అక్బరు——స్వరవిరుద్ధమనుచుంటి వేల? ఘటనముగురుతరమైయున్నది! ఆహా! రాశిరాశులుమృతకళేబరములతో రణోర్వియంతయు నిండి పోవుచున్నది!

రజియా——అట్లని యెఱుంగుదును. కాని, యింతగా నఱచు టెందులకు?

అక్బరు——పుత్రీ! ఏమనుచుంటివి! మృత్యువే సాక్షాత్కరించు చుండెను! మృత్యువు నింతసమీపమున నెన్నఁడుఁ గాంచియుండ

లేదు !—ఓః !—వెలుపల యందఱు మరణించు చుండిరో యెఱుంగుదువా ?

రఘు—మరణించు చుండిరా !—అందుచే బరువెత్తుకొనివచ్చితివా తండ్రీ! భయము కలుగుచున్నదా ?—జనకా! భయమేల ?—

అక్బరు—ప్రాయశః నేను నీవుకూడ నేఁ డంత మొందవలెను !

రఘు—అంత మొందవలయునో నేఁ గాడుచు పాడుచు నంత మొందెదను ! తీవ్ర హాలాహలహారిణితోఁ బాడుచు పాపము మృత్యుజలధిలోనికిఁ గ్రమక్రమముగఁ బ్రవేశ మొనరించెదను !

అక్బర్—అ దేమి !—రాజపుత్ర జయధ్వని మరలమరల వినంబడు చుండెనే !—ఓ! వారలు మఱింత నికటమునఁ గరుదెంచి నట్లుండిరి !

[నేపథ్యమున —జయ్ ! మహారాణీకి జయ్ !]

[తాహబర్ఖాను ప్రవేశించును.]

తాహబర్—యువరాజా !—పర్వాహందు !! పర్వాహందు !!!

అక్బరు—ఏల ! ఏం !!

తాహబర్—మనము పరాజితులమైతిమి !

అక్బరు—మన సైనికు లేమిచేయుచుండిరి ?—అందఱు కూడ మృతిఁ జెందిరా ?

తాహబర్—లేదు ! అందఱు మృతినొందలేదు ! ఇత్తఱి వారలు బుద్ధిమంతుల వలెనే మెలఁగుచుండిరి ! 'వచ్చిపడిరి ! వచ్చిపడి !!' రని కేక లిడుచు, దమ కాళ్లకొలఁదిఁ గాలులకు బుద్ధిసెప్పుచుండిరి !

రఘు—అనఁగా—వారలు పలాయన మొనరించు చుండిరా ! అదేమి ! పలాయన మొనరించు టెందులకు ! సేనాధిపతీ ! రాజపుత్రులకడ నోటమి కలిగెనని యొప్పుకొని, పలాయన మొనరించుటకు వారలు లజపడు చుండుట లేదా ?

తాహబర్—పలాయన మొనరించువారికి లజ్జయేమి ? పోనీ, కొంచెము సేపు లజ్జపడుచుండుమని యనుకొన్నను, సమయమునుమాత్ర మెక్కడిది ? క్రిందుమీఁదులఁ బడుట, లజ్జపడుట కేమియు వ్యవధిలేదు. కాని బిడియపడుటకు మొగిలాయీ లాడువారముగాము !—పర్వేఝుఁడు ! షాహజాదా ! పర్వేఝుఁడు ! ఇంకను వేళమించిపోలేదు !

రజియా—నేఁబలాయన మొనరింపను ! పలాయన మొనరించు టెందులకు ? మరణింతును ! జనకా ! నీవు మొగిలాయువై యుండియు యేముఖము వెట్టుకొని పలాయన మొనరింతువు ?

తాహబర్—ఏముఖమునను యుద్ధము జరుగుచుండెనో, ఆముఖమునకు సరిగ-సరిగ వ్యతిరేకముఖమునఁ బలాయన మొనరింతును ! పలాయన మొనరించుట కొకముఖమేమి ?

రజియా—నేను పలాయన మొనరింపను.

తాహబర్—నీవు పలాయన మొనరింపకున్న, మేము పలాయన మొనరించెదము ! నీ వాడుదానవు, అందుచే కొంచెము సిగ్గు కలుగుచుండవచ్చును ! మాకేమియు లజ్జలేదు !—ఏమందురు షాహజాదా ?

అక్బరు—ఆహా ! ఏమి యీభీషణసంక్షోభము ! ఏమి యీభయంకర హాహాకారము ! ఏమి యీబీభత్సహత్య !

వెలుపల—"పర్వేఝుఁడు! పర్వేఝుఁడు ! !—"జయ్ రాణాకు జయ్" "జయ్ రాణీకి జయ్" "హరహర:" యిత్యాదిధ్వనులు.

రజియా—ఊః ! ఏమికోలాహలము !

తాహబర్—యువరాజా ! ఇపుడు దీర్ఘాలోచనలోనికి దిగితిరేమి ! కొంప లంటుకొన్నవి ! కదలిరండు ! ఆడుదానికంటె నధములవలె గన్పించుచున్నారేమి ?

అక్బరు—ఊః !—ఏమిహత్య ! ఇట్టిహత్యను-నేనెన్నఁడుఁ గాంచి

యుండలేదు !

తాహబర్—(అక్బరు నుద్దేశించి)—ఆలా తాడివలె నిలువంబడిన మాత్రము ప్రయోజనమేమి—ఇదిగో! ఇదిగో!!—ఈ శిబిర ద్వారమునందే!—ఈవైపు ద్వారముగుండానే! ఇదిగో! వచ్చిపడిరి శత్రువులు!—

(తాహబరు పలాయన మొనరించును)

అక్బరు—అమ్మా! రమ్ము!—మనము కూడ బలాయన మొనరింతము.

రజియా—తండ్రీ!—

అక్బరు—మాటలాడకుము, ఈ వైపునుండి—యీ వైపునుండి రమ్ము!—

(అక్బరు తనయనులాగుకొని వెలుపలకుబోవును.)

[తత్క్షణమునందే యిరువురు రాజపుత్రసేనానులు ప్రవేశింతురు]

ప్రథమసేనాని—ఎవరును లేరు—పలాయన మొనరించిరి!—ఏ వైపు నుండి పలాయన మొనరించియుందురు ?

ద్వితీయసేనాని—ఈవైపునుండి—

[వారలు నిష్క్రమింతురు. సమరదాసును మఱికొందఱు రాజపుత్రసైనికులును ప్రవేశింతురు.]

సమర—అనుడు:—జయ్!—భగవాన్‌శంభుజీకు జయ్!! జయ్! భగవాన్ శంభుజకు జయ్!!

అందఱు—భగవాన్ శంభుజీకు జయ్!! జయ్! భగవాన్ శంభుజీకుజయ్ !!

సమర—భీమసింహుఁడెచట ?

ఒకసైనికుఁడు—అతఁడు కన్పించుటలేదు.

సమర—(సైనికుల నుద్దేశించి)—పోయి, వాని నన్వేషింపుడు.

(సమరదాసు తక్కతక్కింగలవారందఱు నిష్క్రమింతురు.)
సమర.—ఊః! ఏమిరాత్రి!! ఏమియుద్ధము!! ఏమిస్తూపీభూతహత్య!!!!

[Reader! Can you guess the upshot of the soldiers' search? Can they find the hero of the great Marwar battle? Methinks they can. But will the great Bheemasinha shining with the flush of victory on the battle-field next day in the auroral splendours, open his eyes to receive the jubilant greetings of his friends? But somebody whispers 'Alas!']

పంచమదృశ్యము

మార్వారు పర్వతప్రదేశమందలి యొక దుర్గము—ప్రాదతీరమందు రెండు ప్రస్తరనిర్మితవేదికలుండును.
జ్యోత్స్నానిశీథము—కమల వేదికపై గూరుచుండి యేకతంబ పాడుచుండును.

గీతమాల

పుష్పగంధంబు దిశలందు బుగులుకొనగ,
అల్లసల్లన వీవగఁ జల్లగాలి,
"కూహు కూహూ" యని పికము కూతలిడగ,
మిన్నుపై తారలువెలుఁగఁ జెన్నుగాను,
ప్రతిభగర్వితగాఁగను రజనికాంత;
స్తబ్దమై గ్రాలమేదిని తమముఁద్రోలి,
నీరవంబుఁదాల్ప నికుంజభారమంత,
ప్రేమసుధమదిఁజల్లగ వేడ్కతోడ,
ప్రాణనాధుఁడ! రమ్ము నీపత్ని సేర,
కలసియాఁడగ మోదంపు కడలిలోను.
జయసింహుఁడుద్యానమధ్యమునుండివచ్చి, యాతావుఁజేరి

పత్నియొక్క గానము వినుచుండును.

కమల—ఎవరు !—ఓ !—మీరా !

జయసింహ—అవును నేనే.

కమల—ఎంతసేపై వచ్చితిరి ?

జయసింహ—చాలసేపై వచ్చితిని.

కమల—ఇంతసేపటివఱకు కేమిచేయుచుంటిరి ?

జయసింహ—ఏమియుఁ జేయుటలేదు. వినుచుంటిని.

కమల—ఏమి ?

జయసింహ—గానమును.

కమల—ఏమి గానమును ?

జయసింహ—ఏమి గానమునో చెప్పఁజాలఁగాని నేనువినినట్టి గానము నీవఱలో నెన్నఁడును వినియుండలేదు.

కమల—తెలిసినది. మీరు నాగానమునే వినుచుండిరి.

జయసింహ—అట్లున్నదై యుండవచ్చును ! నేనింతదనుక నీరాజ్యమందు లేను. స్వప్నరాజ్యమం దుంటిని. వినినదేమి—వింటినా లేక వీక్షించితినా ?—కతిపయ సుందరకిశోరస్వరములు తమ శుభ్రపక్షములు విస్తారమొనరించి, యాకాశమందు విచరణ మొనరించి, పరపర మఱింత గాఢములై మఱింత గద్గదములై, మఱింత యుజ్జ్వలములై యొక్కొక్కటిగ నక్షత్రములందు విలీనమైనట్లు గన్పట్టెను !

కమల—మీరేమి వీక్షించిరో లేక యేమి వింటిరో యెఱుంగను, కాని నేనిప్పుడొక సంస్కృతపదవర్ణనము వింటిని. మీరేమంటిరో నాకు బోధపడలేదు. అచ్చతెలుఁగున మాటలాడిన, నాకంతయుఁ దెల్లమగును.

జయసింహ—కమలా ! నీవు పాడిన పద్యమును ప్రాణోపాంతము

నుండి పాడితివా లేక నోటికి వచ్చిన దానిని, నోటికి వచ్చినట్లు పాడితివా?

మల—మీ రేమనుకొనెదరు?

నృసింహ—నే నేమియు ననుకొనలేదు. నాకేమియుఁ దెల్లము కాలేదు. కాని అప్పుడప్పుడు నీవొక మంత్రకత్తియవనియు, నన్ను మంత్రమోహితుఁ గావించితనియు ననుకొనుచుందును!

మల—మిమ్ము మంత్రమోహితులఁ గావింప నక్కఱలేదు. మీ యంతకు మీరే మాంత్రికులై యున్నారు!

నృసింహ—[క్షణకాల మన్యమనస్కుఁడై యుండి పిదప]—నేనకర్మణ్యుడనైతిని! నిస్తేజుడనైపోతిని!! నిర్వీర్యుడనైతిని!!! !—ఇది ప్రేమయా లేక మోహమా?

మల—ఏమైననూ, ఫలమొకండేయై యుండెను! మీరు నాయీ చిటికినవ్రేలికి నల్వంకల దిరుగుచుంటిరి!

నృసింహ—ఇది ప్రేమమైనను, చాలభయానకమైనది!

మల—భయానకమా!

నృసింహ—భయానకము కాదా? ఏప్రేమ సర్వోత్సాహ తేజముల లుప్తమొనరించునో, యేప్రేమ మనుజు నజ్ఞానప్రాయుఁ గావించి, వాని చక్షుసమ్ముఖము నుండి నిఖిలవిశ్వమును నిర్వాసిత మొన రించి వైచునో, యేప్రేమ మానవుని మనుష్యత్వరహితుఁ గావించునో, యది కడు భయానకమైనది కాదా?

మల—అవును! దానం జేసి, యిపుడు వ్యాధి ప్రబలమై యున్నది! చికిత్సఁ గావించు టవసరము! పెద్దరాణిని పిలతునా? ఆమె యొకతెయే మిమ్ము వ్యాధినుండి విముక్తుఁ గావింపఁగలదు! ఏవో రెండు కల్లబొల్లికబురుల జెప్పి యా నాఁడామె మిమ్మును కదనమున కంపెను కదా! ఇపు డొకమారు పిలతునా?

జయసింహ—కమలా? ఈ రుగ్ణత చికిత్సాతీతమై యుండెను! దీనిని నిర్మూలించుట కెవరికిని శక్యముకాదు—ప్రేయసీ! మార్వారునకును, ఔరంగజేబునకును యుద్ధము పొసగెను! సమరసమయమున జనకుఁడు నన్ను తన కడకుఁ బిలిపించెను. నేను జనయితను సమీపింపగనే నన్నుద్దేశించి యాతఁడు 'పుత్రా! దుర్గాదాసునకు సాయము సలుపబొ'మ్మనెను. నత మస్తకుఁడనై నిలువంబడియే యుంటిని! 'జయసింహా! వూరకుంటి వేల?' యని జనకుఁడు ప్రశ్నించెను. అపుడు కూడ నే నేమియు మాఱుపలుకక నతముఖుండనై నిలువంబడి యుంటిని! తదనంతరమున నాతఁడు 'గ్రహించితిని. మంచిది నీ వంతఃపురమున నడుగుము. నేను భీమసింహు నంపుచుంటి' ననెను. నతవదనుఁడనై యుండియే నేను మరలివచ్చితిని. పిదప సరస్వతి యరుదెంచి నన్నాక్రోశించెను. నే నేమియు నుత్తరమొసఁగలేదు. నన్ను నే నిందించుకొంటిని!—కమలా! నన్నేమి గావించివైచితివి? నన్నెట్లు మోహాచ్ఛన్నుఁ జేసివైచితివి! ఎట్టి యద్భుతనిషచే నన్ను విభోగుఁ గావించి నీ ప్రేమాల నుంచుకొంటివి!?

కమల—కాని, మిమ్ము నేను నంజుకొని తిని వేయుచుండుట లేదు! ధర్మమే సాక్షి! ఇష్టము లేకున్న, నిష్టము లేనట్లే యుండవలెను! నిర్హేతుకముగ నిర్దోషిని దూషించుటెందులకు?

జయసింహ—ప్రియా! నిన్ను నే దూషించుట లేదు! అట్లు దూషించుటకు నాకునోరు రాదు!—'సౌందర్య మెట్టిదను?' యని నిన్నొకపుడు ప్రశ్నించియుంటిని. ఇపుడు సౌందర్యము—

కమల—అహిఫేనము [అభిని] వలె దోఁచుచుండెనా? అట్లని నే నానాఁడే చెప్పియుంటిని! మీరు విశ్వసించలేదు.

జయసింహ—సతీ! నీ యందు గాఢానురాగబద్ధునై యుంటిని!

కమల—అట్లని చాలమాఱులు వచించితిరి.

జయసింహ—వచించినను తృప్తి కలుగుచుండుట లేదు. పలుమాఱు యట్లనె వాక్రుచ్చుచుందును! అట్లనిన నా యుల్లముల్లాసముతో నిండిపోవును!

కమల—ఉల్లాసము హెచ్చుచున్నది, అట్లనుచునే యుండుఁడు! నాకుఁ బ్రాపించుట మీ యనుటలే! కాని, యవ్యాజానురాగము ప్రాపించుట పెద్దరాణికే!

జయ—ఏమి!—కమలా! ఏమనుచుంటివి?

కమల—అవ్యాజప్రేమముఁ జూఱపాటు సరస్వతికని యనుచుంటిని!

జయ—అట్లు పొరపడుచుంటి నేనా?

కమల—మీరొక్కరు కాకున్న నేనా?—నేను పైపై ప్రేమను మాత్రమే బడయుచుంటిని. దీనికి హేతుకము పెద్దరాణి మిమ్ముఁ దాన వలపు వలలోఁ బడవైచుకొనుటయే!

జయ—ఏమి!

కమల—ఏమో! నాకుఁ దెలియదు. తెలిసినను గాని చేతను తెలిపించుకొనను.

[సాభిమానముగ నిష్క్రమించును.]

జయ—ప్రేయసీ! ప్రేయసీ! వినుము!—వెడలిపోయెను! అప్పుడప్పుడు దీనికిట్టి తిక్క కలుగుచుండును! కాని, యీ యభిమానము క్షణభంగురము మాత్రమే! పరమేశా! యీ మహాప్రపంచమున వృష్టియందును, రౌద్రమందును యెట్టి యపూర్వజాతిని సృష్టించితివి!

[సరస్వతి ప్రవేశించును.]

సరస్వతి—నాథా!

జయసింహ—ఏమి సతీ!

సరస్వతి—మార్వారుసందు మొగిలాయీలకును రాజపుత్రులకును జరిగిన యుద్ధముయొక్క పరిణామ మేమాయెనో వింటిరా?

జయసింహ—లేదు.

సరస్వతి—వినలేదురా! వినుట కవకాశమున్నదా?

జయ—ఏమాయెనో తెలుపుము!

సరస్వతి—సమరమందు మార్వారే జయోపేతమైనది! కాని,—

జయసింహ—'కాని' యేమి?—

సరస్వతి—మీ సోదరు లిక లేరు!

జయసిహ—ఎవరు? భీమసింహుఁడా?

సరస్వతి—"అవును! వారీరణమందు మార్వారు రక్షణార్థము ప్రాణవిసర్జన మొనరించిరి!"—

[చెప్పుచుఁజెప్పుచుండ సరస్వతి కంఠము రుద్ధమైపోవును!]

జయసింహ—[గద్గదస్వరమున] హా! యనుజా! ఉదారుఁడా! వీరోత్తముఁడా! మహాత్ముఁడా! ప్రియసోదరా!—[కంఠము రుద్ధమైపోవును—కొంచెము సేపాగి] అన్నా! నీ వక్షయస్వర్గమునుఁబడసితివి!

సరస్వతి—మీరో?

జయ—గభీరనిలయకూపము!

సరస్వతి—హా! నాథా!

[నిష్క్రమించును.]

జయసింహ—సరస్వతీ! నన్నెవగింపకుము. నే నశక్తుఁడను!—నే నశక్తుఁడను!!—[ముందునకుజూచి]—జనకుఁ డిట్లే వచ్చుచున్నాఁడు! ఆతని ననుసరించి మార్వారుమహిషి సమరదాసు లరుదెంచుచుండిరి! నేను కూపస్థమండూకంబును. కూపంబులోనికే పోదును! జనకుని యవజ్ఞాకరుణాదృష్టిని సహింపఁజాలను.

[నిష్క్రమించును.]

[రాజసింహ మహామయమహరాణి సమరదాసులు ప్రవేశింతురు]

రాజసింహ—రాజ్ఞీ! గృహాభ్యంతరమున నుత్తాప మసహ్యముగ నుండును. ఇందే యీ జ్యోత్స్నాలోకమునఁ గూరుచుందము— ఈ ప్రదేశము భీమసింహునకత్యంత ప్రియంబై యుండెడిది! ఆతఁడనుదినమిటకువచ్చి యీ నీలసరోవరముపై నసుస్థిరదృష్టుల బఱపి ప్రభాతమంతయు గడిపివైచువాఁడు!

[ముద్వురు వేదిపై గూరుచుందురు.]

రాణి—ప్రభూ! భీమసింహుని శౌర్యకాహిని, యితిహాసపృష్ఠములందు స్వర్ణ వర్ణములతో లిఖింపఁబడఁ దగినది!

రాజసింహ—నా కన్న తండ్రిని కోల్పోయితిని—పూర్తిగఁ గోల్పోతిని!!

రాణి—ప్రభూ! యుద్ధమందుఁ బ్రాణముల పీడుటకంటె క్షత్రియునకిఁక నధికగౌరవదాయకమృత్యువేమున్నది? భీమసింహుఁడు నా పుత్రుఁడేయైన, నాతని కన్యవిధమృత్యువుఁ గోరియుండ దానను కాను!

రాజసింహ—మహారాణీ! నీవు సత్యము వచించితివి!—సమరదాసూ! భీమసింహుఁడు భండన మెట్లాచరించెనో తెలుపుము

సమర—స్వామీ! అట్టి యుద్ధమును నేఁటిపర్యంత మెవరునుకావించియుండలేదు—ఆనిశీథమున నల్వంకలు ఘోరాంధకార బంధుములై యుండెను. ఆకసము మేఘాచ్ఛన్నమై పోయెను! కుంభవృష్టిగ వర్షము కురియుచుండెను! అట్టిభీభత్సకరఘనతిమిరవ తత్పూర్వ మెన్నఁడు వసుమతీసతి నావరించియుండదు! ముహుర్ముహు నిర్ఘాతధ్వనులు భీషణవిభావరిని మఱింతభీషణ మొనరించివైచెను—ఊః! ఏమి నిశీథిని యేమినిశీథిని!!

రాణి—తదుపరి?

రాజసింహ—(ఉద్భ్రాంతభావమున)—అట్టినిశీథినియా!—అట్టి నిట్టి నిశీథినియా!!—

సమర—అట్టి భయంకరనిశీథమందు దేవపుత్రుఁడు మాపునఃనిషేధములు లెక్కసేయక, దశసహస్ర మీవారుసైనికులఁ దోడ్కొని మొగలు శిబిరము నాక్రమణ మొనరించెను—మొగలాయి సైనికులు లక్షకుమించియుండును!

రాజసింహ [ఉద్భ్రాంతభావమున]—నేనట్టి తనూభవుని నిర్వాసితుఁ గావించివైచితిని!—అట్టి తనూజుని వెడలగొట్టివైచితిని!!

రాణి—ధన్య శిశోదియకుమార్! (Bravo! Sesodia Prince!)—తరువాత?

సమర—తదనంతరమున నభమునుండి యొక ప్రకాండకల్లోలము వినవచ్చెను—ఆవజ్రఘోషని నడంచివైచి, మాపిరంగిగర్జనలు పరిసరకుధరాన్తరములు మారుమ్రోయించుచు మిన్నుముట్టెను!—సైన్యవృష్టిధారానినాదము నడంచి, శత్రుసైన్యమార్తనాదము మిన్నుఁ జేరెను!

రాజసింహ—(ఉద్భ్రాంతభావమున]—నిజదోషంబుకతన నట్టినందనుఁ గోల్పోతిని—

రాణి—తరువాత?

సమర—అపుడు నేను దశసహస్రరాథోరు సైనికులదోడ్కొని, భీమసింహునిసహాయార్థము రణోర్వికేఁబర్విడితిని—సమరక్షోణిఁ బ్రవేశించినంతనే విద్యుద్దాలోకమున,—నాహా! యెట్టి దృశ్యముఁ గాంచితిని—ఆదృశ్యమును నేనెన్నఁడు మఱువఁ జాలను.

రాజసింహ—[ఉద్భ్రాంతభావమున] ఆ దినమున దనయుఁడు (జన—కా—యుద్ధ'—నా ప్రియనం—దనుఁడు (జనకా—యుద్ధమందు—దేశార్థము—ప్రా—ప్రాణములఁ ద్యజ— ద్యజింపఁ—

బోవు—బోవుచుంటి' ననెను!

రాణి—సమరా! చెప్పుము—

సమర—మహారాణీ! శేషించిన తుపాకి కఠారులం గామములం దిడు కొని మరల నిలువంబడిన శాత్రవవీరులు తటిచ్ఛాలాలోకమున నాదృక్పథమందుం బడిరి! విశ్వ గ్రాసనోద్యత ప్రళయోచ్చ్వాస సము చాడ్పున భీమసింహుని చదలము వారల పైఁబడెను! అప్పట్టు ననే విపక్షపక్షమునుండి తుపాకపేరంగు లాకస్మికముగ నగ్ని యుద్గిరణ మొనరించెను! అత్తఱి యుభయవాహినులవారికి దారుణమైన ప్రవిదారణము జరగెను! అ దెట్టిరణము! జ్వాలాముఖీయుద్గారిత గైరికజ్వాలలంబోలె ఘుర్ఘుర్ఘూరణము!

రాణి—ధన్య భీమసింహా!—తదుపరి?

రాజసింహ—[ఉద్భ్రాంతభావమున] అభిమానినై వెడలిపోయెను. దుర్నయముం జూపిన జనకునివీడి, యభిమానముచే వెడలి పోయెను!

సమర—భీమసింహుం డపుడు సౌదామినీ యాలోకమున నున్మత్తుని వడువున, మూర్తిమానమైన ప్రలయము పగిది గానంబడెను! ఏతావున శత్రుసంఖ్య యధికముగ నుండెనో, యచట భీమసింహుం డుండెను! భండనభీముభంగి భండన మొనరించు భీమసింహుని గాంచి, యాతని పదివేల సైనికులు వీరావేశులైపోరి పదిలక్షల మహాయోధులచాడ్పున గన్పట్టిరి!—భీమసింహుం డొక్కఁడుండే, యొక్కమాఱు పదుగురు సైన్యాధ్యక్షులు పది తావులందుఁగావించు కార్యము సలుప సాగెను!

రాణి—భీమసింహా! భీమసింహా!! నీవు నా పుత్రుఁడ వేయైన, నే నెట్టి భాగ్యవతి నయ్యెడిదానను!

రాజసింహ—[దీర్ఘనిశ్వాసమువదలి] అభిమానినై వెడలిపోయెను.

రాణి—తదుపరి;

సమర—ఆసమయమున రాఠోరుసైన్యము మీవారుసైన్యమునకు సాయమొనగింప పరుదెంచెను. నూతనసైన్యము వచ్చినంతనే, శత్రుసైనికులు చల్లాచదరులై, యొగరోచుచు, బఱ్వలిడిరి. మేము వారలఁ జాలదూరము తఱిమివైచితిమి!

రాణి—తదుపరి?

సమర—తదుపరి శిబిరమునకు మరలివచ్చితిమి; భీమసింహునిఁ గాంచలేకపోతిమి! మఱునాఁడు ప్రాతఃకాలమున వాని మృత దేహము రణాంగణమున ఖద్యోతుకిరణములం దుద్భాసితమై యుండఁగాంచితిమి!

రాణి—రాణా! మీతనయుఁడు నేఁడు స్వదేశమును రక్షించెను!— నిజసీమను కాఁపాడెను!!

రాజ—(గద్గదికంఠముతో)—భీమసింహా! భీమసింహా!!— పుత్రా!— పుత్రా!!—తండ్రీ!! హా! కులవర్ధన!! హా! కరుణాకర!! హా! గుణనిధీ!! హా! ధన్యలోచన!! హా! శ్రీకర!!! హా! భీమ! హా! భీమ!! హా! భీమ!!! హా!!!!

(మూర్ఛిల్లిపోవును.)

పటపరివర్తనము [Change of Scene]

[So dropped down Raj-sinha, 'the lion of Kings' never to rise again. Few men can we find who are greater than Raj-sinha. As a gallant warrior and fearless advocate of his country's freedom he was second to none. That he was ineffably chivalrous or that he was a person endued with the dash of any Epic hero, was evidenced by the fact that, regardless of all consequences, he vouchsafed sanctuary to the spirited Mahamaya and crushed the Xerxes of Hindustan, thus saving the honour of the Marwar queen noless than that of Rajastan.

Scholars compare him to William of Orange — William who fought for saving the liberties of his people. The comparisin is indeed apt. The versimilitude we find between the hero that was in Raj-Sinha and the fearless patriot that was in William. But the analogous attributes of the Rajput and the Dutch heroes must cease here. For, in Raj-Sinha we find not only a warrior but also a seer, not only a prince but also a mendicant. I am not so much prone to give the tribute of praise to the voctories, however magnificent, or however worthy of approbation they might be, he achieved in the battle-field as to the triumph he obtained in the struggle which he, like all *Mahatmas*, persistly waged with his self to knock out from himself the draw-backs of a human being and to elevate himself to the acme of perfection! So, I will not demur to observe that, if he was great as a warrior, he was greater as a political anchorite. With a heart brimming with the milk of human kindness and with a mind not impervious to the appeals of distress and poverty, he felt and felt deeply for the miseries of the suffering souls burning in the conflagration of starvation in mountainous recesses and recalled his son, shining in the battle-field with the nimbus of victory, back. He received the discomfited Akbar with the honour and love due to a prince and sent him safely to his people. The splendid clemency he evinced to Begam Gulneyar and the paternal manner in which he expostulated the Marwar queen upon her fiery intentions of reprisal, extort the admiration of all saints of all climes and of all ages! The dignified letter of remonstrance he addressed to Aurangzeb on the promulgation of the execrable *Jaziya* edict 'places him high in the scale of moral as well as intellectual excellence: and an additional evidence of both, and of his taste for the arts, was furnished by the formation of the inland lake, the Rajsumund'! Such was the man that last himself in the swoon occasioned by the heart-rending advices of the noble end of his noble son, the self-abnegating Bhem-Sinha of Mewar!]

## షష్ఠదృశ్యము

మొగలు శిబిరము—పగలు రెండు గడియల సమయము

సామ్రాట్పుత్రుఁడైన యక్బరును, మొగలాయి సేనాధిపతియైన తాహబర్ఖానును, యుద్ధముఁ బ్రసంగించుచుందురు.

అక్బరు—తాహబర్ఖాన్! ఈయుద్ధము దినదినము సంపూర్ణపరాజితులము కాలేదా!

తాహబరు—సంపూర్ణపరాజితుల మేమైతిమి! మీతాతగారి దాడిలోఁ బొరపాటేమియు లేదు! రాజపుత్రులమాటలోఁ గూడ, నెట్టి పొరపాటు జరుగలేదు!

అక్బరు—ఈరాజపుత్రుల వీరత్వ మెంతో యాశ్చర్యమైనది! ఫిరంగిగుండులను వారలు ప్రియమిత్రులపగిది నాహ్వానింతురు! తరవారులను ప్రేయసులచాడ్పున నాలింగనము నాచరించుకొందురు!

తాహబర్—ప్రభూ! వారు శత్రువాహినులు పరగి ప్రేయసుల చాడ్పునవచ్చి మమ్ము నాలింగనము నాచరించుకొనునని చెప్పఁజాలను. కాని, చూచుచుఁ జూడకుండ నున్నప్పుడు, చాలవఱకు వారాంగన వదువున నేమి యింతయు మైబడువారి యుద్ధభూతాలింగనమం దేదో విశేషోద్దేశ్యముండునని నాకనిపించుచుండును!

అక్బరు—ఏమి జాతి!—వజ్రము పగిది సాహసము!—ఆకాశము పగిది స్వచ్ఛము. సముద్రము పగిది యుదారము!—ఏమి జాతి!

తాహబర్—జాతైనే యుంటిదే! కాని, ప్రభూ! ఒకదోషము మాత్రము కనిపించుచున్నది—కొంచెమైన యవకాశ మీయక వారు దబదబవచ్చి మీఁదఁబడుదురు! చూచుఁడు!—నిన్న రేయి నిశ్చింతుడనై శిబిరమధ్యమునఁ బరుండియుంటిని. బాహిర

మున భయంకరముగ గాలివాన మహాప్రళయము మొనరించుచుండెను! పెద్దమనిషియైన నాఁ డెవఁడైన ఆసమయములో నిల్లు విడిచి వెలుపలకు రాఁడు. కాని, యీ రాజపుత్రుల కాపెద్దమనిషి తరహా యేమియు లేదు! అంధకారమునకుఁ భీతుఁజెందక, భీషణ వాతూలమును సరకు గొనక, భయంకర వృష్టిని లెక్కసేయక మన శిబిరములోనికి వారలు దూకుచు వచ్చిపడిరి—కత్తికటారులను దీసుకు రాకుండిన యెడల వారు లేదో తమాషా చేయవచ్చితిరని తలఁచి యుందును!

అక్బరు—వహవ్వా! ఎంత యద్భుతముగ వారలు మనలను ముట్టడించిరి!

తాహబర్—వహవ్వా! ఎంత యద్భుతముగ మనసైనికులు పర్విడిరి! పిరుదులను వెనుకకు ద్రిప్పి, అదేపనిగ చీఁకటిలో దుముకులాడిరని, మన యోధు లొక్కరైన గ్రిందఁ గూలఁ బడలేదు!—ఓః! ఆశ్చర్యమాశ్చర్యము!

అక్బరు—ఈపరాజయవార్త వినిన, జనకుఁ డేమనును?

తాహబర్—ఏమనునో సరిగఁ జెప్పలేను; కాని మనలను గాంచిన తోడనే పరుగుపరుగునఁబోయి, చీనామిత్రాయి యుండలను బట్టుకొని వచ్చి మనకు విందుఁజేయఁ డన్నమాట నిశ్చయము! కాని యుద్ధములో నోడివచ్చిన యెడల, నాచే నొకజత యినుపమురుగులను తొడిగించెదనని, నే నిచటికిఁ గదలి రాక పూర్వమే విశుద్ధపరిష్కారం, ప్రాంజల యునుదుళో నాతఁ డతిస్పష్టముగా నాకెఱింగించెను! చీరఁగూడఁ గట్టఁబెట్టునో లేదో కాని, ఆవిషయమును నాకుఁ దెల్లముగాఁ దెలుపలేదు! కాని, నే నిప్పుడు పోయి, యాతని సమ్ముఖమున నాట మూడ నక్కఱలేదని మాత్ర మనుకొనుచుంటిని!

అక్బరు—ఇక ఉపాయమేమి? రాజపుత్రులతో రణమొనరించిన యెడల జయాశ యెన్నటికి నుండదు!

తాహబర్—అట్టిదేమియు నుండదు. మీరు సెలవిచ్చిన దానిలో బొత్తిగా పాటేమియు లేదు. కాని, స్వామీ! అసలు వారితో పోరాడుటయే నాకెంతమాత్రము యిష్టము లేదు!

అక్బరు—ఏల? వారలు యుద్ధము మొగమే యెఱుంగరు! ఆనాడు మీవారలలో జూచితిని కదా? కింద నిప్పులు గానీయకుండనే, చంపివేసే యెత్తువేసిరి! అట్లు చేయవచ్చుననియే శాస్త్రంలో వ్రాసియున్నది? తరువాత, ఇచట యుద్ధము కాక పూర్వమే వచ్చి, మావారలను ముట్టడించి వేసిరి!—ఈలా యెన్నడైన, పదునాలుగు లోకములలోనైన, జరుగుట వింటిరా? అరే యుద్ధంచేయుట మాకొత్తేం యేలాచేతురు! దగ్గరవచ్చి మీద పడుతోవుంటే, ప్రక్కనున్న కత్తి కనిపించదు!—ఏలాగో క్రిందా మీదాపడి దానితో లేక దాని మొనతో దీసుకొని, గంటకు అడుగులు ముందెవేయుచుండగా, కన్నంతలోనే ఆపడే రెండడుగులు వెనుకకే పడుతవి! ఆసమయములో నెవ్వరైన వచ్చి రెండు బల్లెములను, రెండు బాకులను, అందించియుంటే రాజపుత్రులను, గీపుత్రులను ఒకనాటికి విడిచి పెట్టవచ్చును! కాని మన చమురమ్మలలో, యెవరికీ ఆపాటి తలిపితేటలున్నట్లు యింతవఱకు నాకు కనుపించలేదు! ఏమైతే అయినది, ఒక్కొక్కనికి ముక్కుమీద రెండు గుద్దులిచ్చెదమన్నను, తలెత్తేసరికి, బోడి బుఱ్ఱమీద జల్లగాయలు దబదబపడిపోతవి! 'ఓగుండంద్రా! వదలండ్రా!' అని యెయ్యో మొయ్యోయని మొరపెట్టుకున్నా వారు వినేటట్లు కనుపించలేదు! పోయి చూచి డొక్కలో ఒక్క పోటు పొడుద్దామంటే, దానికేమీ అవకాశ మియ్యరు! ఒక

దరినుండి కలుపు కోసికోసినట్లు కోసి మొక్కలు పెట్టెదను! తేలిగా వచ్చిన కురుడీసరుకనుకొని, తురక సంఘము నొక్కొక్కదానిని యథాంగాగి వేయుచుందును!

అక్బర్—సేనాధిపతీ! ఈ రాజపుత్రస్త్రీజాతిని చూచిన కొలఁది నేను ముగ్ధుఁడనై పోవుచుంటిని!—వీరి సాయము లభించిన, నేను సమస్త పృథివిని జయింపఁగలుగుదును!

తాహబర్—వీరి సాయమునకు కొరకై, యట్లు చేయఁగలుఁగుట కేమియు సందియము లేదు! దొరకకపోయిన యెడల, ఆ యాలోచన పెట్టుకొనే కూడదు!—అయితే ప్రభూ! ఒక్కపని చేయఁగలరా?

అక్బరు—ఏమిపని!

తాహబర్—ఏః—ఇది చాల సులభమైన పని? ఇంతవరకు, యీ యూహ మనసుకు తట్టలేదు!—ఎంత సులభమంటే, అంత సులభము! ఆః—యిట్టి పని యొకటి చేతిలోనుంచుటే గొప్ప!

అక్బరు—ఏమి? ఏమి?

తాహబర్—ఓః!—యోచించిన కొలఁది యిది చాల సులభంగా కనుపించుచున్నది!—సరే, మీరు సామ్రాట్టులు కాఁగోరుదురా?

అక్బరు—అట్లగుట యేలాగు?

తాహబర్—ఏలాగునా?—ఇంతలోనే, అంతవరకు పోయిన, వ్యాపారము కుదురదు—కాని మీకు సింహాసనము కావలెనో, అక్కఱలేదో ముందు జెప్పండు!

అక్బరు—అక్కఱ లేక పోవుటేమి? కావలెను!

తాహబర్—కావాలి! చిట్టి బాబయ్యా! కావాలి? కాని, సింహాసనము మీకొఱకు తేలిగా పడివుంచినారా? బుల్లితండ్రీ! ఎంత దురాశ!

అక్బరు—దానిమాట ముందుగ నెత్తినది నీవేకదా!

తాహాబర్—ఆ మాట నేనే యెత్తినమాట నిజమే!—మంచిదట్లైన వినండి!—దీనికొక యతిసులభమైన యుపాయమున్నది!

అక్బరు—ఏమి! ఏమి!!

తాహాబర్—ఈరాజపుత్రజాతి—హా. హా! హా! [నవ్వును]—ఓ!—యిది చాలా సులభము!

అక్బరు—ఎట్లు?—ఎట్లు!—ఏమి!... చాలాసులభమా?

తాహాబరు—సులభమంటే సులభము!—రాజపుత్రులందఱు కొంపతీసే రకమని చెప్పి యుండలేదా? నాకు తలదీసి తలబెట్టగలరు! ఔరంగజేబును గభాలున సింహాసనమునుండి క్రిందికి ద్రోసివైచి మిమ్ము వారందు కూర్చుండబెట్టిన, యెంతో మజాగా నుండును! కాని, యిందులకు మీ యభ్యంతర మేమైన యున్నయెడల ముందే జెప్పివైచుడు! మన సైన్యమూ, రాజపుత్రసైన్యమూ, రెండూ కలిసినయెడల త్రిమూర్తులైన మన కడ్డు రాగలుగుదురా?

అక్బరు—వహవ్వా! నేనుకూడ సరిగ నట్లే యోచించితిని!— షోభా నాల్లా! (Hurrah!)

తాహాబరు—చెప్పినదేమో పూర్తిగ జెప్పనిండు. వినకుండనే 'వహవ్వా' యని పెద్ద మొగం చేసుకొని, యఱచివేయుట కిది సానిపాట కాదు! చివఱివఱకు వినుడు—రాజపుత్రులు మనతోఁ గలియుదురో లేదో యను విషయ మాలోచింపవలయును! వారలు కలియుదురనే సిద్ధాంత మేమి?

అక్బరు—అవునది యోచింపవలసిన విషయమే!—'సులభం సులభం' అని యనుకుంటే మరల చిక్కుగా కనుపించుచున్నది!

తాహాబరు—చిక్కంటే చిక్కుగానే యుండును! మనతో వారలు కలియకపోవుట మాత్రమేమి? అని యోచించితే చిక్కు విడే

పోతుంది!

అక్బరు—హాః! ఏదేపో యుంది! ఓ [illegible] దురాత్మబుద్ధి!!

తాహబర్—వారిలు రాణాప్రతాపుని యెదిరించి యుద్ధము చేయలేదా! ఔరంగజేబు పితృని నెదిరించి యుద్ధము చేయలేదా? మనము దారా యౌరంగజేబు రాజ్యము పాలు చేయలేదా?

అక్బరు—నేను కూడ నదే యనుకొనుచుంటిని!

తాహబరు—కాని,—

అక్బరు—మరల 'కాని' యేమి?—అన్ని చిక్కులు తెచ్చిపెట్టుచున్నా వేమి?

తాహబరు—కాని యీ విషయములో నిశ్చితులమై యుండుట యవసరము! ఒక్కమారు రాణాను సేనాధిపతితోఁ గలిసి మాటలాడిన యెడల, సంగతంతా పరిష్కారమై పోవును!

అక్బరు—నేను కూడ దానినే యనుకొనుచుంటిని!—మంచిది!—అట్లైన నీవు రాణాను శిబిరమున కరుగుము!

తాహబరు—అక్కడే చిక్కొస్తుంది! రాణాను శిబిరమునకుఁ బోవుటకు నా కెంతమాత్రము నిష్టంలేదు! వెళ్ళినపిదప దుర్గాదాసు మరల ముక్కుమీదనుండి మునుపటివలెనే కత్తిదూసిన, నుపద్రవము వచ్చును! అనవాలు శిల్పపైన చేయివైచుకొని, 'తలలేదో! తలలేదో!!' యని యేడ్చుటమాత్రము కార్యమేమి?

అక్బరు—ఇఁక నాతఁడట్లు కత్తిదూయఁడు!

తాహబరు—నిర్ధారణ యేమి?—ఒకవేళ దూసితే?

అక్బరు—'హా! హా!!' అని కేక వేయుము!

తాహబర్—అపుడు 'హా! హా!!' 'హీ! హీ!!' యనేందుకు సమయముంటుందా? తలకాయ యూడి కాలిక్రింద పడిపోయినపిదప, 'హా! హా!!' యని మాత్రము దేనితో యందును?

అక్బరు—అట్లైన నింక నుపాయ మేమి?

తాహబరు—రాథోడు సేనాధిపతి నిచటికి రప్పించుటే మంచి యుపాయము! 'పర్వతము మహమ్మదు కడకు బోనిచో, మహమ్మదే పర్వతము కడకు పోవలయును' [This expression is incorporated into English. We therefore find its frequent usage in English literature: 'If the Mountain doesn't go to Mahomed, then Mahomed can come to the Mountain']

అక్బరు—మంచిది—అట్లాచేయవచ్చును! నేను కూడ నట్లే-

తాహబరు—సరే! ఇక నాకు చిక్కులేదు! ఏదో పథమున పని జరగక మానదు! ఇక నే బోయి వచ్చెదను—ఒక్కొకనిమనుకు దీసిన గాని కార్యా వుండేటట్లు కనిపించుటలేదు.

[ఇట్లని తాహబరు అక్బరునకు సలామొనరించి నిష్క్రమించును]

అక్బరు—తొందరగా బోగొట్టుకొంటినే!—ఇట్లుగాక మరొక విధముగా జరిగినగాని మరి యుపాయ మేమియులేదు. ఉపాయముండునట్లు కొంచెమున్నను, యత్నము ప్రబలయుండెగ గాదు!—ఆహా! ఏమి మేఘగర్జనము!

[రజియా ప్రవేశించును.]

రజియా—అయ్యో! మెఱుపులకు నచ్చి గాలిమబ్బు—వడగండ్లు పడుచున్నవో! వడగండ్లు!! వడగండ్లు!!!

అక్బరు—పడనిమ్ము

రజియా—చూతువు కాని రమ్ము! [చేయి పుచ్చుకొని లాగును]

అక్బరు—ఛీ!పో! నీకు సిగ్గులేదూ? ఇంకా బొప్పివే!—పో!!

[విషణ్ణముఖియై రజియా నిష్క్రమించును

అక్బరు—చూచెదగాక! కెరటములను లెక్కబెట్టుచు, యొడ్డ గూరుచున్న నేమి ప్రయోజనము? ముందున కుఱుకవలయు

పిదప నేమి జరుగవలయునో జరుగును! అడిగో! రంజాన్!—రా! రా!!—సానిని రమ్మనుము! ఆ డేరాలోనికే!! సససా!—

[నిష్క్రమించును.]

## స ప్త మ దృ శ్య ము

మొగలుశిబిరము——రాత్రికాలము.

ముకుటశోభితుండై యక్బరు సింహాసనారూఢుండగును. మస్తకోపరిభాగమున రాజచ్ఛత్రము విరాజిల్లుచుండును. పార్శ్వమునఁ జామరధారిణు లిరువురు నిలువంబడి యుందురు. సమ్ముఖమున సభాసదులును, నర్తకీ రమణులును యుందురు.

అక్బరు—నేను రెండవ యక్బరుచక్రవర్తినైతిని—అవునా కాదా?

ప్రథమసభికుఁడు—అవునా కాదా యేమి!—వు!!—అవును! అవును!! కాకపోవుటేమి? అవును!

అక్బరు—నాశిరముపై రాజచ్ఛత్ర మున్నదా లేదా?

ద్వితీయసభికుఁడు—ఉన్నదంటే యున్నది!—ఓ!వున్నదంటేయున్నది!! ఓ!! వున్నదంటే యున్నది!!!—

అక్బరు—నా జయపతాక మెగురుచున్నదా లేదా?

తృతీయసభికుఁడు—ఊరికే యెగురుచుండెనా? 'పత్ పత్' 'తప్ తప్' అని శబ్దముకూడ జేయుచు, యెగురుచున్నది!

అక్బరు—బాగ్! (చాలు!) ఇఁక నేమియు నక్కఱలేదు. వేశ్యలారా పాడుడు!

[వేశ్యలు తాళము చప్పుడు చేయుదురు.]

అక్బరు—ఆగుఁ డాగుఁడు!—మీలో నెవరైన సామ్రాట్ గాడిద యేమిచేయుచున్నాడో చెప్పఁగలరా?

ప్రథమసభికుఁడు—ఆ గాడిద పరుగెత్తెను!

అక్బరు—ఊహూః!—ఆ గాడిద, అలాగుపరువెత్తేవాఁడు కాదు గాడిద యుద్ధము చేయును! ఊఱక వదలి పెట్టే ఘటముకాదు!—గాడిద నట్లే యుద్ధము చేయనిండు!—నా వైపున దుర్గాదా సంతటి వాఁ డుండ, నా కేమి భయము!—ఇదిగో! యిదిగో!! మీకు దెలియునా, దుర్గాదాసు గాడిదబాబునకు—కామకాదు, దుర్గాదాసునకు బాబుగాడిద చాల జడియును సుమా!

ప్రథమసభికుఁడు—అహో! అలాగా!! హాః హాః హాః [పకపక నవ్వును]

అక్బరు—ఊం! ఆవేళ పఠాన్ముల్కొనే గాడిద యొకతె, శివాజీ దుర్గాదాసులపఠములపట్టుకొని బాబుగాడిదయొద్దకువచ్చెను! బాబు శివాజీ పఠమునుచూచి, 'ఈ గాడిదను కూలవేయఁగలను; కాని, 'ఈ దుర్గాదాసు పఠమును చూచి ఈ గాడిద ముప్పతిప్పలు పెట్టక మానఁ' డనెను!

ద్వితీయసభికుఁడు—ఆ పఠము లెట్లుండెను!

అక్బరు—శివాజీ గద్దెపై గూరుచుని యున్నట్లును, వాని శిరముపై ముకుటము విరాజిల్లుచున్నట్లును కపాలమునఁ దిలకము శోభిల్లుచున్నట్లును, పఠము వ్రాయఁబడియున్నది. కాని దుర్గాదాసు 'మిలమిల' మెఱయు కవచముఁ దొడిగి, 'ధగ ధగ' ప్రకాశించు నిశిత కరవాలముఁ గేలఁబూని, భీషణాకారుండై హుంకరించుచు తన తురగమును ముందునకుదాయించుచున్నట్లు చిత్రింపఁబడెను!

The reader may be informed that I ventured to change the description of Durgadas' picture. In the original work as well as in the 'History of Rajastan' it is written that Durgadas was drawn seated on his horse-back in his ordinary position toasting a maizestalk pierced to the point of his lance. I quote the corresponding passage from the *Annals of Marwar*:—"Many anecdotes are extant recording the dread Arungzeb had of this leader of Rahthores (meaning Durgadas), one of which is

amusing. The tyrant had commanded pictures to be drawn of two of the most mortal foes to his repose, Sivaji, and Doorga:—"Siva was drawn seated on a cowch; Doorga in his ordinary position on horseback toasting *bhawties* or barley-cakes, with the point of his lance, on a fire of maize-stalks. (D. L. Ray mentions only the maize-stalk pierced to the point of the lance) Aurangzeb, at the first glance exclaimed. 'I may entrap that fellow (meaning Sivaji), but this dog is born to be my bane."

The reader will pardon me for this slight change.

ద్వితీయసభికుఁడు—(ఉలికిపడి) ఓ గాఁగా! విననిచో నాకే వణకు వచ్చుచున్నది! ఇఁక సామ్రాట్టు—

అక్బరు—సామ్రాట్టెవఁడేమి?

ప్రథమసభికుఁడు—[ద్వితీయసభికు నుద్దేశించి]—అవును!—సామ్రాట్టెవరోయి?

అక్బరు—సామ్రాట్టా? నేనే!

ప్రథమసభికుఁడు—స్వామివారే సామ్రాట్టులు! స్వామివారే! స్వామివారే!!

అక్బరు—బాస్ [చాలును]—ఇఁక పాడుఁడు.

[వేశ్యలు మరల తాళము వేయుదురు.]

అక్బరు—ఆగుఁడాగుఁడు [వేశ్యలు తాళము వేయుచు రాగాలాపన మొదలిడుదురు]—ఆగుమని చెప్పుచుండుట మీకు కాదా? [వేశ్య లూరకుందురు]—దుర్గాదా సెచటకు బోయెను? ఎవ్వరైన చెప్పఁగలరా?

ప్రథమసభికుఁడు—[నలువంకలఁ దిరిగి చూచి]—ఏరి? ఏరి!—అయ్యో! చెప్పువా రెవరును లేరా?

అక్బరు—అవునవును! అవునది నిజమే! అతఁ డుదయపురము బోవుట నిజమే!—కాని, నా యానతిఁ బుచ్చుకొనకుండ పోయెనేల? ఆలా

పోవుటకు వాని గుండె నిబ్బరమెంత?—నేను సామ్రాట్టును!—
అట్లాతఁ డెఱుంగఁడా?—ఎందులకు పోవలెను?

ద్వితీయసభికుఁడు—అవును! స్వామివారన్న ముక్క సరైనముక్క!
ఏలినవారి హుకుము లేనిదే వాఁ డెందుకు పోవలెను?

అక్బరు—ఓ! అవునవును! ఇదీ నిజమే! నిజమునిన నిజమే!! రాజరాజ
సింహుని వ్యాధివార్త విని వాఁడు వెళ్ళిన మాటనిజమే! మంచి
దీమాఱు వానిని క్షమించితిని!

ద్వితీయసభికుఁడు—స్వామివారే తలిదండ్రులు!

అక్బరు—ఛీ! నోర్మూయి! నేను సామ్రాట్టును!

ప్రథమసభికుఁడు—అవునవును! స్వామివారే సామ్రాట్టులు! స్వామి
వారు కాకపోయిన నిం కెవరు?

అక్బరు—(బాస్)(చాలు!)అట్లైనపాడుఁడు!కాదుకాదు!ఆడుఁడు!కాదు
కాదు! పాడుఁడు! ఆడుడు! కాదుకాదు! ఆడుడు! పాడుడు! కాదు
కాదు! ఆడుఁడు, ఆడుఁడు! కాదుకాదు! పాడుడు, పాడుడు! కాదు
కాదు! ఆడి పాడుఁడు! కాదుకాదు! పాడి, ఆడుఁడు!

వేశ్యలు పాడుదురు.

గీ త మా ల

రూపమూర్తిమాయెను యౌవనంబు
రంగతలముఁ దరంగ భంగమునను;
రాగయలల్లనల్లనఁ దూఁగఁజొచ్చె
నృత్యక్రీడావిఘూర్ణిత నిలయమందు;
వసుధ దోఁచెను నందన వనములీల
ముదముఁ గూర్చుచు మనుజుల యెదకుఁ జాల;
కానఁ, జింతలఁ బాసిన కాంతలార!
బడయ నేర్తుము సుఖము నీ పుడమియందె!!

వేశ్యలు పాడుచుండ, సింహాసనము యరుదెంచి, దూరమున నొక ముక్కాలిపీటపై కుడిచేతి మోచేయి మోపి, అరచేతిపై తలమునుంచి జలుకమునుంచి గానము వినుచుండును.

అక్బరు—వహావ్వా! స్వర్గ మిట్లేయున్న, నది బహు సుఖవంతమైన స్థలమే యని చెప్పవచ్చును!

రజియా—అందువలననే గాయకులంతయు భైరవిరాగి మతిమధురమైన దందురు! తదరీరీరీ...............

భైరవిరాగము ననుకరించి క్రొంచెము కూనిరాగము దీయును.

అక్బరు—ఇదిగో! ఇదిక్కడే యున్నది! అమ్మాయీ! నీ విచ్చటికేల వచ్చితివి?

రజియా—[పరధ్యానిమై యుండి]—ఆహా! భైరవిరాగ కళల హాయి యెంత!—[పిదప]—జనకా! జనని పిలుచుచున్నది!

అక్బరు—దాని పిండాకూడు పిల్పులకు వేసిరి!—ఇది పిలిచే సమయమా?—ఏః!—వచ్చి అంతా చెడిపివేసినావు!

సభికుడు—అంతా చెరిపేసింది! స్వామివారూ! అంతా చెరిపేసేసింది!

అక్బరు—పో! ఇక ఇంటిలోనికి పో!—నీకు బిడియము లేదూ?—ఏదో మించిపోయినట్లు వచ్చిపడ్డావు! మొండిరండా పో?

రజియా—జనని పిలుచుచుండెను; ఆమె రోగము ప్రబలినది!

అక్బరు—అట్లా!—అట్లయైన వైద్యుని బిలిపించుకొనుము! నే నేమి చేయను!—నే నిపుడు రానని చెప్పుము.

రజియా—ఆమె ప్రాణములను విడచుటకు సిద్ధముగానున్నది! "అమ్మా ప్రాణములను వీడుటకు ముందు నీ తండ్రి నొకమారు చూడవలెనని యున్న" దని యామె విలపించుచున్నది! ఆమె పంపుటచే నే నిచ్చటికి వచ్చితిని!

అక్బరు—మాడవలెనని యున్నదా? చూచుటెందులకు? చూచిన నేమగును? చూచిన మాత్రాన లాభమేమి?—ఏదో యొక చిక్కు తెచ్చిపెట్టుచుందువు!—నీతల్లికి ప్రాణములను విడచుట కింకొక సమయమేమి దొరకదా? ఇప్పుడింత తొందరేల? ఒక ఘడియ సేపాగిలేదా;—దాని గుణ మిటువంటిదే! పో—ఓహో! మీరెవరైన, యీపిల్లను లోపలనుంచి రండు.—ఏమి!—యెవరురా అక్కడ?

[ద్వారికుడు ప్రవేశించును]

అక్బరు—దీనిని లోపల దిగవిడిచి రమ్ము. ఈడ్చుకొనిపొమ్ము.—ఏం! కొయ్యవలె నిలబడి పోతివేమి!—చెప్పుచుండుట నీకే!—

ద్వారికుడు—[ముందుకు వచ్చి, ర జియాకరముం బట్టుకొని]—'అమ్మగారూ! రండి!'

రజియా—ఖబర్దార్!—జసరా! నేను నీయమ్మాయిని!—ఒక నౌకరువాడు వచ్చి, నాచేయి బట్టుకొని, యీడ్వబోవు చుండెను!

అక్బరు—అది నాహుకుము!

రజియా—నీహుకుమా!—అమ్మా! నీహుకుమా!!

[అవమానముచే గ్రందన మొనరించుచు రజియా నిష్క్రమించును.]

అక్బరు—వచ్చి, అంతయు పాడుచేసి వైచినది!

మొదటి సభికుడు—స్వామివారూ! వచ్చి, అంతయు పాడుచేసి వైచినది!

రెండవ సభికుడు—అవునవును! స్వామివారూ! వచ్చి, అంతయు, పాడుచేసివైచినది!

[తక్కుంగల సభికులందరొకరి తరువాత నొకరు లేచి యట్లనే యందురు]

అక్బరు—అంతయు పాడుచేసి వైచినది! అంతయు పాడుచేసి వైచినది!!—ఏరి వీరు?—ఏమే!—...ండా పూరుకున్నారు! చోద్యం చూచున్నారేమి! కానియండి మీపని, తెయ్ తకతోం తోం తోం!—తదరిరిరి!

[వేశ్యలు తాళము వేయ మొదలిడుదురు.]

అక్బరు—ఆగండి! ఆగండి!! వచ్చి అంతా పాడుచేసినది! వచ్చి అంతా పాడుచేసినది!! ఏమనెదరు? సభికులారా! ప్రియమిత్రులారా! ఆర్యులారా! అన్నలారా! అక్కలారా! [కాదు కాదు]—అయ్యలారా!

ప్రథమ సభికుఁడు—అవును! అవును!! అంతే! అంతే!! అంతే కాకపోతే యింకేంతి?

[తక్కంగల సభికులందఱ అట్లే ప్రథమమున నొకరి తరువాత నొకరును, పిదప నందఱు కలసి యొక్కమాఱుగ నందురు!]

అక్బరు—పాడండే! పాడండి!!

[వేశ్యలు తాళము వేయుదురు.]

[ఈసమయమున, తాహబ్ఖాను శిబిరమందుఁ బ్రవేశించును.]

అక్బరు—ఎవరు! తాహబ్ఖానూ! సీతాపతీ! [అయ్యో! నోరు జారినది!] సేనాపతీ!

తాహబరు—ఏమి యువరాజా!

అక్బరు—అదేమి! అదేమి!! 'యువరాజా!' యేమి! 'సామ్రాట్!' 'స్వామీ!' 'ప్రభూ!' 'దేవరా!' అనవలెను! ఇదిగో! ఈలా చూచుచుండలేదా? [అని రాజచ్ఛత్రముఁ జూపును.]

తాహబరు—చూడకేమి, చూచితిని!—నేనీలాచూచుచూయుండెదను! స్వామివారు దిగివచ్చి, వొకమాఱాలా చూడుఁడు!

అక్బరు—ఏల! ఆలా చూచు టెందులకు?

తాహాబరు—ఆవైపున రాజపుత్రసైనికులు శోకజాడించిరి!

అక్బరు—ఏమి! విడిచిపోయిరా! విడిచిపోయిరా!! తాహాబరూ! నీవేమైన సరుకు వేసుకొని వచ్చితివా యేమి?—వేసినది, సారాయా, భంగ, కల్లా? అట్లయిన శోకజాడించిరనుచుంటివేమి? అట్లన్నడైన జరుగునా?

తాహాబర్—జరుగునో జరిగిదో తెలియదు, కాని యిప్పుడు జరిగిపోయినది! ముందునుండి మూలలకొ కే దాగుదాటి గుఱ్ఱ మేను గను చంపివైచెను!

అక్బరు—అయ్యో! ఏనుగ చచ్చిపోయిందా! ఓ! యేనుగో!! యేనుగో!!!

తాహాబరు—స్వామివారి కర్ణము లబో లబో, యని మొత్తుకొని రోదనము చేయవలసిన గతియేపట్టెను! యువరాజు స్వామా ట్టుతో గలసనని రాజపుత్రులు కేవలో తెలిపిరి!

అక్బరు—యువరాజెవడు! స్వామాట్టెవరు!! అతఁ డొకడు, యితఁ డొకఁడునా?—ఓ! మునెల చిక్కు తెచ్చిపెట్టేవూ?

తాహాబర్—అంతా చిక్కే వచ్చిపడినది! అయ్యగారి కింకా తెలివి రాలేదు కాఁబోలు!—సరుకు బాగుగా పడినది కాఁబోలు!— ఒకమారు వెలుపలకు వచ్చి చూడుఁడు!—వెలుపల రాజపుత్ర శిబిరమొక్కటైన లేదు! చిక్కులో పట్టి ముందుత్రోవఁబట్టిరి! చిక్కుచిక్కనుచు మొదలు పట్టినపని చిక్కుతోనే ముగియును!

అక్బరు—అయితే మనసైనికులేమైరి?—[ఊరక నిలువంబడిన వేశ్యకాంతల విలోకించి]—“ఛీ! ముండిరండల్లారా! వూరు కొండని మీకు కాదూ చెప్పుచుండుట!”

తాహాబర్—స్వామాట్టుతో మిళితులైరి!

అక్బరు—కుట్ర! కుట్ర!! తాహాబరూ! నీకుట్ర!!—

తాహాబరు—అయ్యగారి నెత్తికి బుద్ధి బలమెక్కినట్లుంది!—నా కుట్రయా! మీగోతిని మీరే త్రవ్వుకొనిరి. ఇప్పటినుంచియైన తప్పునడక నడవక యూరకుండుఁడు! మూలగదిలోనుండి సెగలు వచ్చి మీఁదఁ బడఁగలదు!

అక్బరు—నీకుట్ర యని నాకుఁ దెలియక పోలేదు! పట్టండి— [ఎవరురా అక్కడ?]

తాహాబరు—హాః! హాః! హాః! హాః! [పకపక నవ్వును]—ఇపుడెవరెవరిని పట్టెదరు చిట్టితండ్రీ! నాకంఠముఁ దీసిన, మీకంఠము నిలుచునా? ఒక్కమాటఁ జెప్పెదను వినుఁడు! నే నొక యుపాయముఁ బన్నితిని! "ఇప్పుడైన మీరలు సామ్రాట్టువశ్యత నియ్యకొనిన యెడల మీరలు క్షమింపఁబడుదు" రని బికనీరు పతి వ్రాసిన యుత్తరము నిప్పుడే యందుకొంటిని! అందుచే మన వృధా ప్రయత్నములు మాని, యీగండమునుండి దాటు యత్నముచేయుట మంచిది! తమరిఁక భయంకర పటాటోపము కట్టిపెట్టి, శోకము నుంచుకొని, నావెంటఁబడి రండు! సామ్రాట్టు దగ్గఱకుఁబోయి, వారి కాళ్ళమీఁదఁ బడుదము!

అక్బరు—జనకునియొద్దకుఁ బోవుదమందువా!

తాహాబరు—అవును! నా యీశేలమీఁద నాకు విశేషానురాగ మున్నదన్నమాట కల్ల! కాని, క్రిందను మీఁదనుపడి యెట్లో యట్లు దానిని నిలుపఁగలనేమో చూచెదను! ప్రయత్నించి నందున దోషమేమి? మంచిది! చూచెదగాక!

(నిష్క్రమించును.)

అక్బరు—ఏమి! రాజపుత్రు లిట్టివిశ్వాసఘాతుకులా!—వారలు నన్ను వదలివేసిరా!—పెద్దచిక్కే తెచ్చిపెట్టిరే! చివరకు నాపన్నాగము నాకంఠమే పట్టుకొన్నదే!—ఏం! ఏమే! ఎవరే!

వున్నారా! మిడిగ్రుడ్లు పెట్టుకొని చోద్యంచూచెదరేమి! కానీ యండి! మీకేమిభయంలేదు!—ఆడండి!—పాడండి [అభినయించుచు, వేశ్యలు పాడదొడంగుదురు]—హా ప్రియా! నిశుంభాసి, యింక నేనేప్రకారము సైతునా? "పాపిమాఁగుడు, క్రూరుఁడై, పరితాపమొందఁగఁజేసెరా! హా!"

(అభినయింతురు)

అక్బరు—ఛీ! ఇది నాకు నచ్చలేదు! కూర్చొని క్రొత్త కీర్తన దేనినైనపాడుఁడు. మఱొకభాష కీర్తనపాడితే మిక్కిలి సంతోషము.

వేశ్యలు కూర్చొని పాడుదురు:

నాగనామక్రియ—ఆదితాళము

నాచేనచరితానందిత తైయా తైయా నాచేనచరిత
ఆనందిత తైయా తై యా

కన్నడం

నిమనిమ్మల్లిబేడి నిమ్మనిమ్మనివుమాడి నిమ్మల్లిరుసదు
సమ్మలిల్ల సద్గురుమంత్ర-వగూడి నిమ్మనిర్వికల్ప
నవినోడి నీవుసద్గురువసి బిడబ్యాడి ఘుశిఘుశి ॥నా॥
ఒందు యెరుడు మూగాయితహత్తు హత్తునిందయిప్పత్తు
ఇప్పత్తిదిలి నిత్యప్రపంచ స్వసుఖమ్ము నాలకీ-
నీల్ సజ్జనసంగతమాడి నిమ్మల్లనిమ్మనిగనోడి నిక్
సర్వబ్రహ్మమయమాడి బిడుబిడు ॥నా॥

అక్బరు—ఛీ! మొట్టమొదటినుంచి, చివఱికి "నిమ్మనిమ్మ, తైయా, తైయా"యే! ఛీ! పోండిఁక! పాడేగు అసహ్యపుపాట!

[వేశ్యలు నిష్క్రమింతురు. అక్బరు, సభికులతో రెండవదిక్కుగఁ బోవును.]

[పటపరివర్తనము=Change of Scene—]

అష్టమ దృశ్యము

[అజ్మీరునందు ఔరంగజేబు బహిర్గృహము—సుమారు జాము రాత్రి.]

పసుపుపై యౌరంగజేబొరగి పరుండియుండును. సమ్ముఖమున నొకవేదికపై దిలీర్ఖాన్ కూర్చుండియుండును.

ఔరం—దిలీర్ఖానా! రాజపుత్రశిబిరమునుండి యింక నేమివార్త తెలియవచ్చెను?

దిలీర్—వజ్రజనితదసమంబైన వారల సంగీతశబ్దమే నాకుం దెలియంబడినవార్త! అంతకంటె విశేషవార్త యేమియుం దెలియలేదు. ధ్వని క్రమక్రమముగ నికటతరంబును, స్పష్టతరంబును యగుచుండెను!

ఔరం—ఏ యుద్దేశ్యమున?

దిలీర్—ఉద్దేశ్యము కనుయుదారమైనదని తోచుటలేదు!

ఔరం—అక్బరూ! అక్బరూ!! నన్ను త్రోసివైచి, నీవు చక్రవర్తివిం గాంగోరితివా? పితృద్రోహ మొనరింపనిశ్చయించితివా? ఒక్కనాటి రాజ్యవైభవముతో నిన్నివర్షములనుండి నీకొఱకై గావింపంబడిన యత్న, శ్రమ, వ్యయములన్నియు నిష్ఫలములాయెను!—దిలీర్ఖానా! పుత్రుండే, యిట్టి విశ్వాసఘాతకుండౌనని నేంగలనైన దలంపలేదు!

దిలీర్—ఏల తలంపలేదో నాకు బోధపడుటలేదు! ఇప్పటికి కుమార్ యక్బరు షవాబు నిర్బారును కనపఱచెను! కాని, యతఁడు సోదరులగు మహాజాన్, యజీమ్, కాంబక్ష్ లయెడల నాదరపూర్వకముగ నవాబునీతి నవలంబించునో లేదో యింకను తెలియుట లేదు!

ఔరం—దిలీర్ఖానా! ఏ హత్యాకాండద్వారా నేనీ సామ్రాజ్యమును స్వహస్తగతముం గావించుకొంటినో, యా భయానక హత్యా

కాండముయొక్క పునరాభినయము కాకూడదనియే నా యభిప్రాయము.

దిలేర్—దేవరవారి యభిప్రాయము నెల్లోకము చాలగా మాటినట్లు తోచుచున్నది! ఆహా! నా ప్రభువగు షాజహాన్ యీ సమయమున జీవించియుండెనేని, పుత్రుని బుద్ధియుక్తికి యెంత యుప్పొంగిపోయెడువాడో కదా!

ఔరం—దిలేర్ఖాన్! జాగరూకతపై ప్రసంగింపుము.

దిలేర్—ప్రభూ! ఏమనెదరు! నా మాటలు సత్యము వచించుచుంటిని, యేటి కని భీతిల్లియుండలేదు! ఇది నిజము కాదా! దేవరయుం దేహధముం జూపకున్నయెడల నీ నాటికీ యీ దుస్వప్నముం దైన యక్బరు మనసునకుం బట్టియుండెడినని తలంచుచుంటిరా? స్వామీ! మిత్రుని యుపదేశమాలింపుడు! ఇస్లాం వైరనిర్యాతనధర్మములచే కూలద్రోయం బడిన హత్యాకాండమునకుం దగు ప్రాయశ్చిత్త మొనరించుకొనుడు. ఆ యూహనము సిద్ధింపవచ్చును! యోగికులసంజాతులైన హిందువులతో సఖ్యము సలుపుడు. ఇంకను చెప్పుమనిన— సర్వనాశమూలమైన యీ కాశ్మీరుబేగమును [బేగమ్ గుల్ నేహూరాను] దూరీకృతను మొనరించుపదని కోరుచు వచించెదను. లేకున్న నీ దున్నయఫలభోగము నింపెతులిమపు రనుభవింప సిద్ధముగ నుండుము!

[ఇట్లని మాతండు చివాలున నిష్క్రమించును.]

ఔరంగ—నిక్కము వచించెను! వచనములు కఠోరముగ నున్న నేమి! నిక్కము వాక్రుచ్చెను! ఆ దురంతహత్యయొక్క పునరభినయమే కావింపంబడనుండెను! దారా! సహోదరసోదరా! క్షమింపుము. నేను దుర్నయమును—ఘోరతరదుర్నయమును కావించుట నిక్కము;—కాని, యట్లే యిస్లాముమతంబుకొఱకే గావించి

తిని—అల్లాయే సాక్షి!

[శ్యామసింహుఁడు ప్రవేశించును]

ఔరం—మహారాజ్! వార్తలేమి?

శ్యామ—కార్యోద్ధరణవ్యాపారము—ప్రభూ! ఆశాతీతముగ జరిగెను! రాజపుత్రు లక్బరును పరిత్యజించివైచిరి!

ఔరం—ఏమి! ఏమి!!

శ్యామ—నిజాశ్వముల నధిష్ఠించి వారలు, నిజకాంతలఁ జేరి నిజసీమాభిముఖులై పోవుట స్వచక్షులతోఁ గాంచితిని. కుమార్ యక్బరు నృత్యగీతమహాసముద్రమునందు మునింగియుండుటచే వారి పోక లక్షించుట కాతని కవకాశము చిక్కనిగాదు! ఆతఁడింకను నిద్దుర మంచమునుండి లేవలేదు!

ఔరం—ఏ మేమి జరిగెను?

శ్యామ—భృత్యుని సలహా ననుసరించి దేవర యక్బరునకు వ్రాసిన పత్రమును—

ఔరం—'పత్రమును' యేమి?

శ్యామ—"తనయా! నన్ను రాజచ్యుతుఁ గావింపఁ గుట్ర పన్నినట్లు నటించి, రాజపుత్రులను నాపైఁ బురికొల్పి వారలు నన్నాక్రమణ మొనరింప గమకించు నన్ని యెఱిఁగి యేమఱు పాటున నున్న తఱి వెనుకనుండి వారలను ముట్టడించు దేని, యిరు కెలంకులనుండి కదన మొనరించి, అవలీలగ వారల మట్టు వెట్టఁ గల" మని దేవర యక్బరులకు లిఖించిన పత్రమును నేను రాజపుత్రసేనాధిపతి సోదరుండగు సమరదాసు హస్తమందుఁ గాశల మునఁ బడవైచుమని మాయలమారి యగు మన హుస్సేనునకుఁ దెల్పి పంపితిని. ఆ పత్రమును రాజపుత్రులు బడసి, దాని యందలి వృత్తాంతము నంతయుఁ బూర్తిగ విశ్వసించి, తమతో

నక్బరు చెలికారముఁ జక్రవర్తియొక్క మాయోపాయము కతన గావించుచుండెనని తలంచి, అక్బరును, పరిత్యజించివైచి, నిజ సీమకుఁ దరలిపోయిరి!

ఔరం—సత్యమేనా! మహారాజ్ఞ! రాజపుత్రులు ప్రతివిషయములను సులభముగ విశ్వసింతురని నేఁ గలనైన దలంపలేదు. దుర్గాదాసు కూడ వానిని విశ్వసించెనా?

శ్యామ—దుర్గాదాస చటలేదు. ఆతఁడు రాజసింహుని వ్యాధివార్త విని యుదయపురి కరిగెను!

ఔరం—ఇఁక తాహబ్ఖానో!—వానివార్త యేమి?

శ్యామ—ఆతఁ డిపుడు కైదీయై యుండెను. ఆతనికి నేను, "నీ విప్లవైన విద్రోహమును బరిత్యజించి, నీ యధీనస్థసైన్యము వెంటఁగొని చక్రవర్తి క్షమాభిక్ష వేఁడిన, యాతఁడు నిన్ను మన్నించు" నని పత్రము లిఖించితిని. అప్పత్రాంశముల విశ్వసించి, యాతఁడు మొగలు శిబిరమున కరుదెంచెను. కుమారా యజీముతోడనే వానిని బందీ గావించెను!

ఔరం—మహారాజ్ఞ! మీకు నే నెట్లు కృతజ్ఞుడనై యుంటినో వచనములందుఁ దెలుపఁజాలను.

శ్యామ—దేవరవారి యనుగ్రహము!

ఔరం—[చెవియొగ్గి]—అదేమి! వెలుపల యేదో యల్లకల్లోలము జరుగుచుండెను! ఏమది?

శ్యామ—"చూచివచ్చెద!" నని శంకితభావమున వెలుపలికి వెడలిపోవును.

ఔరం—ఇదేమి! కోలాహల మెక్కుడగుచున్నది! అస్త్రశబ్దము వినంబడుచున్నదే! ఏమది! పిస్తోలు శబ్దము కూడ వినంబడుచున్నది!—దౌవారికా!

[రక్తాక్తకళేబరుండై తాహబరు ప్రవేశించును].

ఔరం——తాహబర్ఖాన్‌!

తాహబరు——"ఓహో దేవరవారా!" [చక్రవర్తిపై పిస్తోలును గురి చూచును] ఈ సమయమున దిలీర్ఖాను ప్రవేశించి--"ఖబర్దార్" అని కేకవైచును. తాహబరొకమాటు మాత్రము వెనుకకు జూచి మరల సామ్రాట్టు కెదురుగఁ బిస్తోలును లక్షించును. అయ్యవసరమందే హఠాత్తుగ దిలీర్ఖానుచేఁ బేల్చఁబడిన పిస్తోలు జ్వాలచే నెవ్వున కేకవైచి భూమిపై గూలును

ఔరం——విశ్వాసఘాతకునకుఁదగు శాస్తి యాయెను! పరివాదకుఁడు!! దుర్మతి!!! కుక్కురము!!!!

దిలీర్——ప్రభూ! ప్రాణములను విడచెను! ఒక్క తిట్టునైన వినలేక పోయెను!

ఔరంగ——దిలీర్ఖానూ! నీవు నేఁడు నా ప్రాణముల రక్షించితివి!

దిలీర్——స్వామీ! అం దక్కజ మేమున్నది? ప్రభుప్రాణరక్షార్థమయ్యే నేను దేవరయొసఁగు కూడును కుడుచుచుంటిని!

ఔరం——దిలీర్ఖానూ! నిన్నుఁ దీసివైచి, యీ పఠానును సేనాధిపతిఁ గావించితిని——దానిఫలమిది! మిత్రమా! నన్ను మన్నింపుము.

దిలీర్——ప్రభూ! నేను సామాన్యభృత్యుండను. దేవర యట్లనుట పాడిగాదు!

ఔరం——నీవు భృత్యుండవుకావు! ఈ రాజ్యమం దీవొక్కరుండవే నా మిత్రుండవు! మిత్రమా! ఏమి పురస్కారముఁ గోరెదవో తెలుపుము?

దిలీర్——స్వామి జీవనరక్షణ మొనరింపఁ గలిఁగితిని! అదే ప్రచుర పురస్కారము!! అదే నాకుఁ బదివేలు!!!——అంతకంటె యధికము నా కేమియు నక్కఱలేదు!!!!

ఔరం—దిలీర్ఖానా! నీవు మహాత్ముండవు!!

[దిలీర్ఖాను నభివాదన మొనరించి యౌరంగజీబు నిష్క్రమించును. ముకుళితకరకమలుండై, నిమీలిత నేత్రుండై, క్షణకాలః నిలువంబడియుండి పిదప దిలీరు నిష్క్రాంతుండగును.]

Very briefly I quote the corresponding historical facts: "On their continued successes. the Rana and his allies meditat the project of dethroning the tyrant, and setting up his s Akbar. The pernicious example of his father towards Sha jehan was not lost upon Akbar; but he wanted the circumspe tion which characterized Aurangzeb, whose penetration defeat the scheme when on the eve of execution, The Rajpoot armi united with Akbar. Aurangzeb, attended only by his guards Ajmeer, had recourse to the same artifice which raised him empire, in order to ward off this danger. .........Not a mome was lost. He penned a letter to his son, which by a spy w dropped in the tent of the Rajpoot leader Doorgadas. (Anoth Historian says that this letter was by a wilful mistake hand over to Samar-das, the brother of Doorgadas). In this l applauded a pretended scheme by which Akbar was to fall upc them when they engaged the emperor. It succeeded. Th Rajpoots detached themselves from the prince who ha apparently betrayed them. Tyber-khan (otherwise calle Tahabar-khan) in despair lost his life in an attempt t assassinate the emperor. Aurangzeb was saved by Deli khan......... ....."]

## నవమ దృశ్యము

### రాజపుత్రశిబిరము—సంధ్యాకాలము

దుర్గాదాసు సమరదాసులును రాజపుత్ర సర్దారులును ప్రసంగించుచుందురు.

దుర్గా—విజయసింహా! ఈ మాఱునికిఁ—ముగ మనము ప్రతారితుల మైతిమి!

సమర—దుర్గాదాసూ! నీ వింతవఱకు మొగలాయీలను గుఱుతింపఁ జాలక పోతివి!

విజయ—అక్బరిట్టి కూళుండని నేను భావించి యుండలేదు!

ముకుంద—కాని చూపుల కాతఁడు సరళస్వభావునివలె కన్పట్టును!

గోపీనాథుఁడు—కాని వాఁడు వట్టిపనికిమాలిన మానిసి! ఇరువది నాలుఁగు గంటలునృత్యగీతములతోఁ గాలముఁ బుచ్చుచుండును! అట్టివారు ఖలు లగుట యసంభవము!

సమర—గోపీనాథా! ఎట్టు లగుటకైన మొగలుల కసంభవముకాదు! 'వారలిట్లు కాఁగలరు. ఇట్లు కాఁజాలరు'—అని చెప్పవీలులేదు. వారలెట్టులైన కాఁగలరు!—నేను జలమును విశ్వసింపఁగలను; గహ్వరమును విశ్వసింపఁగలను. వ్యాళమును విశ్వసింపఁగలను; కాని మొగలులను విశ్వసింపఁజాలను! ప్రవంచనము వారల జాతిగతధర్మము! పాపము వారలు మఱేమి చేతురు?

గోపీనాథుఁడు—సేనాధిపతీ! రాణా రాజసింహునకు మృత్యు వెట్లు ప్రాపించెను?

దుర్గా—ఎట్లు ప్రాపించెనో నిశ్చయము తెలియకుండెను. కుమార్ భీమసింహుని మృత్యువార్తవిని యాతఁడు మూర్ఛితుఁడై పోయెను! ఆ మూర్ఛానంతరమున మరల నాతనికిఁ దెలివి రాలేదు.

[దౌవారికుఁడు ప్రవేశించి, యభివాదన మొనరించును.]

దౌవా—ప్రభూ! సామ్రాట్టుపుత్రుండగు యక్బరు కుటుంబసహితముగ ద్వారముపొంత నిలువఁబడి యుండె.

విజయ—ఎవరు? అక్బరా!

దుర్గా—కుటుంబసహితముగనా!

సమర—జాగ్రత! దీనిలో నింకా కొంచె మున్నది! లోనికి రానీయకుము.

దుర్గా—అట్లనరాదు. సోదరా! ఏహేతుకముచేనైన మిత్రుఁడైనవాని కొకటి రెండుమాఱులు దర్శన మొసఁగకున్నను, అది నిందార్హమగు కర్జము కాదు. కాని, దర్శనాభిలాషియైవచ్చిన శత్రువు ననాదరపూర్వకముగఁ దరలిపొమ్మనుట యనుచితము!—[దౌవారికు నుద్దేశించి] దౌవారికా! వారలను సమ్మానపూర్వకముగ లోనికిఁ
di గొనిరమ్ము.

Hi [దౌవారికుఁడు నిష్క్రమించును.]

ove ముకుంద—దీని యర్థమేమి?

ap th సమర—మఱొక కపటోపాయ మేమైన నై యుండును—దుర్గా

R దాసూ! జాగ్రత!

a గోపీనాథ—ఈ యుద్ధమం దిట్టి విపరీతమున కంత్యము లేదా?
7
దుర్గా—అందఱు వారలకు యథోచితసమ్మానము చూపుఁడు.

[కుటుంబసహితముగ నక్బరు ప్రవేశించును.]

అందఱు ససంభ్రమముగ లేచి నిలువంబడుదురు.

దుర్గా—షాహజాదా! నేఁడు తాము మా సమ్మాన మొసఁగుటకు హేతువేమి?

అక్బరు—రాఠోరు సేనాధిపతీ! నేను మోసపోయితిని.

సమర—మీరు మోసపోయితిరా లేక మేము మోసపోతిమా?

అక్బరు—ప్రాయశః యుభయులము మోసపోతిమి. రాజపుత్రసైనికులు నాకుఁ దోడ్పడి, సామ్రాజ్యమునకు నన్నభిషిక్తుఁగావించి, పదంపడి, నేను నిశ్చింతుడనై యున్నతఱి,—జనకుని విద్వేషభాజనుడనై యున్న యవసరమున, ప్రాణముమాలి నన్నుఁ బరిత్యజించి వైచిరి!

సమర—మిథ్య! మిథ్య!! మిథ్య!!!

రజియా—అమ్మా! మా యయ్య కసమ్మానము సూపకుఁడు. [ఇట్లని యామె బాష్పాకులలోచనయై, దుర్గాదాసు వదనంబుపై జాలి గొలుపు చూడ్కులఁ బఱపును].

దుర్గాదాసు—అన్నా! కొంచెము సేపూరకుని యుండుము—షాహజాదా! రాజపుత్రులు నిర్హేతుకముగ మిమ్ముఁ బరిత్యజింపలేదు. రాజపుత్రులు విశ్వాసఘాతకులుకారు. సామ్రాట్టుయొక్క యీ పత్రముఁ జదువుకొని, తమతో మీరు సంధిఁ గావించుట చక్రవర్తి ప్రేరితులై మీ రొనరించిన మాయోపాయమని రాజపుత్రులు గ్రహించిరి!— ఈ యుత్తరమును చదువుఁడు. [ఇట్లని యాతఁడక్బరుచేతి కొకయుత్తర మొసఁగును]

అక్బరు—[పత్రపఠనానంతరమున]—సేనాధిపతీ! ఇదిమిథ్య!

సమర—ఏమి!—మిథ్యయా!—ఇవి చక్రవర్తి హస్తాక్షరములు కావా?

అక్బరు—అవునివి యాతనిహస్తాక్షరములే!—కాని, యిది కపట పత్రము! మనలను విచ్ఛిన్నమొనరింపవలెనను యుద్దేశ్యముతో నిది లిఖింపఁబడెను. ఈ కమ్మ నా పేర లిఖింపఁబడుట నిక్కువమే; కాని రాజపుత్ర సేనాధిపతి కందఁజేయవలె నను యభిప్రాయమున నిది వ్రాయఁబడెను! అట్లే కాకున్న నిది నాకరములం దుఁబడక, రాజపుత్ర సేనాధిపతి కరములందుఁ బడెనేల? రాజ

పుత్రుఁడెవరో, మొగలాయి యెవండో మొగలుదూత గుర్తెఱుంగ డా? ఇది కపటపత్రమే కాకున్న, గోపనాంశములతో నిండియు న్న దీనిని దూత యెవరిచేతం బడిన వారికొసఁగివైచునా?

దుర్గాదాసు—[అందఱిని వీక్షించి]—ఏమందురు?

సమర—మే మేమియు వినఁగోరము. మే మనేక మాఱులు మొగలు ప్రముఖులచే వంచింపఁబడితిమి. వారలతో నెట్టిపొత్తుము కలు గఁజేసుకొనుటకు మాకిష్టము లేదు!

అక్బరు—రాథోరువీరా! నా రెండు తెగువులఁ బాహుగావించి, నన్ను తెలజలంబునఁ బడ వేయకుఁడు. నేను మీ యాశ్రయభిక్ష వేఁడు చున్నాను.

దుర్గా—సామంతులారా! మీ యభిప్రాయమేమి?

విజయ—మొగలాయీలతో నెట్టి సంబంధము కలుఁగఁ జేసుకొన కుండుటే యుత్తమమని నా యభిప్రాయము.

ముకుంద—నాయభిప్రాయముకూడ నదియే! మొగలుల సమ్ముఖమున నిలువంగగు స్థాన మొక్కటియే—సమరక్షేత్రము!

జగత్ సింహ—నేను కూడ నట్లే వచింపఁ బోవుచుంటిని. మొగలు లతో మైత్రిఁ గావించు టనుచితము. మేము యుద్ధము చేయు టెఱుంగుదుము—యుద్ధమే చేయుదుము.

దుర్జనసింహ—సేనాధిపతీ! నా యభిప్రాయముకూడ నదియే! షాహ జాదా! మొగలు శిబిరమునకు మరలిపొమ్ము, మీ జనకుని క్షమా భిక్ష వేఁడుఁడు. ఆతఁడు నిశ్చయముగ నిజనందనుని మన్నించును.

అక్బరు—అట్లైన మీరలు నాజనకుని బాగుగ నెఱుంగరు.

సమర—బాగుగ నెఱుంగ కేమి? బాగుగనే యెఱుంగుదుము! ఇఁక నధికముగ నెఱుఁగ వలసిన ప్రయోజన మేమియు లేదు—యువ రాజా! తామిఁక మాతో నధికప్రసంగము సలుపక వచ్చినదారిఁ

బట్టి వేగమే వెడలి పొండు!

అక్బరు—[దుర్గాదాసు నుద్దేశించి]—రాథోడు సేనాపతీ! నేను మిమ్మాశ్రయభిక్ష వేఁడుచుంటిని.

దుర్గా—సామంతులారా! ఆశ్రయదాన మొసఁగుట క్షత్రియధర్మము కాదా?

సమర—పామునకుఁ బాలుపోసి పెంచుట క్షత్రియ ధర్మము కానేరదు!

అక్బరు—నన్ను విశ్వసింపుఁడు. నేను వంచింపఁ బడితిని.

దుర్జనసింహ—అట్లే కావచ్చును. అయిన మేమీ విషయమందెట్టి జోక్యముఁ గలుఁగఁ జేసుకొనఁ దలఁచుట లేదు.

అక్బరు—అందఱి యభిప్రాయమిదియేనా? రాజపుత్రు లాశ్రయ దాన మొసఁగుటకు సమ్మతింపరా? అందఱు నిస్సబ్ధులై యుందురు.

దుర్గా—అందఱకు నసమ్మతమేనా?

అందఱు—అవు నందఱకు నసమ్మతమే!

అక్బరు—సేనాధిపతీ! నేను నాసామ్రాట్టు పుత్రుండను—ప్రతారితుఁడనై, పరిత్యక్తుండనై, సహజానుపునై, పుత్రకన్య సహితుండనై, భవదాశ్రయభిక్షఁ నర్థించుచుంటిని. [పుత్రపుత్రికల నుద్దేశించి]—నాయనా! వీరి కొనర్ప సాష్టాంగపడుము! అమ్మా! నీవు కూడ సాగిలపడుము!

రజియా—[సాగిలపడి లేచి, సబాష్పనేత్రియై,—[దుర్గాదాసు నుద్దేశించి]—అయ్యా! మాయయ్యను రక్షింపుఁడు!

దుర్గాదాసు—అందఱకు నసమ్మతమేనా?

అందఱు—మాయందఱకుఁ గూడ నీతని కాశ్రయదాన మొసఁగుట యసమ్మతము! అసమ్మతము!! ముమ్మాటికి యసమ్మతము!!!

దుర్గాదాసు—మంచిది! అట్లైన నాకొక్కరునికే సమ్మతము!—సామంతులారా! దుర్గాదాసు క్షత్రియుఁడని యెఱుంగుఁడు? ఆశ్రయభిక్షు వేఁడు వారల కతఁ డాశ్రయదాన మొసఁగుటకుఁ బరాఙ్ముఖుఁడుకాఁడు. మీకిష్టమైనచో, నన్నుఁ బరిత్యజించివైచుడు. నేనాశ్రితులఁ బరిత్యజింపను—యువరాజా! రండు! దుర్గాదాసు గ్రీవమునఁ బ్రాణము లున్నంతకాలము మీకేశ మొక్కండైన స్పృశింప నేరికని సాధ్యము కాదు!!!! Bravo! Durgadas!

శ్రీ

# దుర్గాదాస్

## చతుర్థాంకము

### ప్రథమదృశ్యము

ఢిల్లీ దర్బారు మందిరము—ప్రభాతకాలము. సామ్రాట్టు పుత్రుండైన మౌజామును, సేనాధిపతి దిలీర్ఖానును నిలువంబడియుందురు.

దిలీర్—అట్లైన దుర్గాదా సక్బరును తోడ్కొని దక్షిణసీమ కరిగెనా ?

మౌజామ్—అవును! ఆతఁ డక్బరు కాశ్రయము మొసఁగినందున వాని సామంతు లతనిఁ బరిత్యజించివైచిరి! ఇపుడు శంభుజీ (Or Sambhaji, an unworthy son of a worthy father) యొక్క యాశ్రయ గ్రహణము తక్క, యాతని కన్యోపాయమేమియు లేదు.

దిలీర్—ధన్య! దుర్గాదాస్! (Bravo! Dugadas!)

మౌజామ్—దూరప్రవాసము సలుపు తఱి దుర్గాదాసు నేనూరు సైనికులు మాత్ర మేకాంతమున ననుగమించిరి. మొగలు సైన్యముఁ దోడ్కొని, నేను వారలఁ బ్రతిఘటించితిని! దుర్గాదాసొకనాఁటి నిశీథమునఁ దనవైదునూరుల సైనికుల దోడ్కొని, మొగలు కటమును భేదించి, వెడలిపోయెను!—దుర్గాదాసు దాక్షిణాత్యమునకరిగెనని నేను తరువాత వింటిని!

దిలీర్—ధన్య; ధన్య; దుర్గాదాస్!

మాజామ్—కుమార్ యక్బరును, తిరిగి యొసఁగుటకై లంచముగ నలువది వేల స్వర్ణముద్రలను, చక్రవర్తి యాజ్ఞానుసారముగ దుర్గాదాసునకుఁ బంపితిని. దుర్గాదాసా విత్తమునంతయు నక్బరున కొసఁగివైచెను! తానొక గవ్వనైన దీసుకొనలేదు.

దిలీర్—మరల నందును—ధన్య, దుర్గాదాస్!

మాజామ్—ఇపుడు మార్వారు సేనాపతి యెవరు?

దిలీర్—దుర్గాదాసు సోదరుండగు సమరదాసు!

మాజామ్—అక్బరు కుమారుఁ డెచట?

దిలీర్—ఆతని (సమరదాసు యొక్క) యాశ్రయమునందే! అక్బరు యొక్క పత్ని పరలోకగతురాలాయెను! ఆతని తనయ సమరదాసు నాశ్రయమునందే యుండెను!

(అజీము ప్రవేశించును.)

అజీము—సేనాపతీ! సామ్రాట్టిపుడు రాజపుత్రులతో సంధిఁ గావింపఁ గోరుచుండెను. ఈవిషయము మీకెఱింగింప నన్నాతఁ డిటకుఁ బుత్తెంచెను.

దిలీర్—ఏమి! సంధియా! సత్యమే! సామ్రాట్టు సంధిఁ గోరుచుండుట సత్యమే?

అజీము—అవునది సత్యమే!

దిలీర్—ఈశ్వరుఁ డాతనికి మంగళముఁ గూర్చుఁగాక!—ఇపుడు సంధి ప్రస్తావ మొనరించు వారెవరు? నేనా, లేక స్వయముగఁ జక్రవర్తియేనా?

అజీమ్—ఆ ప్రస్తావన స్వయముగ రాజపుత్రులే కావింతురు!

దిలీర్—రాజపుత్రులా! జయోపేతులై వారలు సంధి ప్రస్తావ మొనరింప నరుదెంతురా?

అజీమ్—జనకుఁడు, తాను సంధి ప్రస్తావముఁ గావింపఁజాలననెను.

అట్లొనరించిన యెడల, యాతని గౌరవమునకు హాని కలుగునట!

దిలేర్—దానం జేసి, యాతని గౌరవముఁ గాఁపాడుటకై విజయులైన రాజపుత్రులు సంధిభిక్షఁ గావింప నరుదెంతురా!—ఈబుద్ధిని సామ్రాట్టున కెవ రొసఁగిరి?

అజీమ్—బికనీరుపతియైన శ్యామసింహుఁడు! సార్వభౌముని మానమున కెట్టి భంగము కలుఁగకుండ దాను సంధి స్థాపన మొనరింపఁ గలండని శ్యామసింహుఁడు వ్రాసెను!

దిలేర్—ఓ!—తెలిసినది! అట్లైన, పూర్వమువలెనే యిది చక్రవర్తి కపటసంధియై యుండును!

అజీమ్—సేనాపతీ! జాగరూకుండవై మాటలాడుము. నోటికివచ్చిన తెఱంగున వాగకుము

దిలేర్—ఓ! అకులనా! సర్పముకంటె సర్పముయొక్క ఫణమే పెద్దదివలె తోఁచుచున్నదే!—ఏమి రాజా! ఇఁక దయ చేయుడు. దయచేసి, తామిట్టి విజయులగు రాజపుత్రులతో సంధి గావింపఁ గోరుచున్న, సమ్రాట్పుంగవునకు సంధియను విధము నేఁ జూపుదుననియు, నిది కపటసంధియైనచో, దానితో నేనెట్టి జోక్యముఁ గలుఁగఁజేసుకొననియు చక్రవర్తి కెఱింగింపుము!

[దిలేర్ నిష్క్రమించును.]

[మహాజాము యతఁడు ఫర్మానాముఖము గనుచు]

మహాజామ్—సోదరా! ప్రత్యేకముగ సంధిఁ గావింపఁ గోరుచుండెనేల?

అజీము—ఆతఁడిప్పుడు దాక్షిణాత్యములకుఁ బోఁగోరుచుండెను! ఆప్రమాణమునకై యేబదివేల దేరాలను తనతోఁగ నుంచుడని సేనానుల కాతఁడు హుకుము నొసఁగెను!

మహాజామ్—అక్బరును పట్టఁదలఁచియే యాతఁడు దక్షిణసీమ కరుగు

చుండెను కాంబోలు!

అజీమ్—అవును! నేను కూడ నట్టులే యోచించితిని! నీవక్బరును బంధించి, తీసుకొని రాలేకపోతివి.—దానంజేసి యాతఁడు నీయెడల మిగుల కుపితుఁడై యుండెను. వేయేల, నీవిచ్ఛాపూర్వకముగ నక్బరును పలాయన మొనరింప నిచ్చితివని యాతఁడు శంకించుచుండెను.

మహాజాన్—అనుజా! అది సంపూర్ణ మిథ్యగాదు! జనకుని క్రోధానలకుండమున సజ్జాన, సగాళ, మహమ్మదఖాతిను శరీరమ్ములైన బట్టి బడవైవఁజాలను! అంతకంటె సోదరుఁడు దుర్గాదాసు నాశ్రయమందే నిరాపదుఁడై యుండెను!

అజీమ్—అట్లైన జనకునకు విరుద్ధముగ నిచ్ఛాపూర్వకముగానే కార్యాచరణ మాచరించితివా?

మహాజాన్—అవును! జనకుఁడు జనకుఁడే! కాని సోదరుఁడు కూడ సోదరుఁడే గదా!! [నిష్క్రమించును.]

## ద్వితీయ గర్భాంకము

యోధపుర ప్రాసాదాగారము—ప్రభాతకాలము. పట్టవసన పరిహితయై మహారాణి మహామాయ యేకాకినియై యుండును.

రాణి—నాకార్యము ముగిసెను. నామృతవల్లభుని రాజ్యము పునరుద్ధరితమాయెను. మారాష్ట్రమునుండి మొగలాయీలు దూరీభూతులైరి! నాకర్తవ్యము నేఁడు శేషించెను. నేఁడు సతీధర్మమును ప్రతిపాలన మొనరించెదను. నేఁడు ప్రియు సన్నిగమన మొనరించెదను! నేఁడు జ్వాలంతచితియందు దేహవిసర్జన మొనరింతును! నేఁడు దగ్ధంబై మరణించెదను! [సతేజాననయై]—ప్రభూ!

స్వామీ! వల్లభా!—ఒకనాఁడు పుష్పవాసుండుఁ బరాజితుఁడవై వచ్చిన కతన, అభిమానినై నేను దుర్గద్వారమును రుద్ధ మొనరించివైచితిని; పరాస్తుఁడవైన మిమ్ముఁ జేయుటకు మాఱు మృథక్షేత్రమందు మృత్యుకన్య నాలింగన మొనరించుకొనుటే నీకర్తవ్యమని వ్రాసిచ్చితి! [Readers of *Shajahan* are quite cognizant of this episode] నాథా! దేశార్థమె ప్రాణంబుల వీడుట క్షత్రవీరుల కర్తవ్యమైనట్లు వల్లభార్థమె మేనువీడుట క్షత్రరమణుల కర్తవ్యమని చెప్పుదును! దేశభక్తులరై మోదంబున మీరు లుటు మువున్న దమ పథంబున, భర్తృభక్తులమై యాహ్లాదమున మేము మునుపుగఁ గాయుదుము!

[పాటవిని రాజు ప్రవేశించును]

జంఝూటీరాగము—ఆదితాళము.

"శ్రీలాముని జన పాలాభవభయ, వేలానతసుర - పాలానుశీలా॥
రామాకలుష విరామా జగదభి। రామా ఘనసుఖధామా
సుధామా ॥ శ్రీలా ॥
ఫలం మహిమహిభీరామహిత ప। చారాసదవనసారావతారా
గోపాలకికులదీపాయితఖల। పాపాసురహరచాపాధిరోపా॥
శృంగారరసరుచిరాంగారిసభు। జంగాధిపసదపాంగానుషంగా॥ శ్రీల

రాజు—[పాట వాలించి, వెనుకకు దిరిగి రాణిం గాంచి]—
రాజ్ఞీ! ఇదేమి! నేఁ డిట్టి వేషము వైచితివేమి?—మీ యాననంబున నింత యుల్లాసమేల?

రాణి—స్వామీ! నేఁ బోవుచుంటిని.

రాజు—అదేమి!—ఎచ్చటకు?

రాణి—[ఊర్ధ్వమున కంగుళినిర్దేశ మొనరించి]—అచ్చటకు!
ఎచ్చట నాప్రియుఁ డిన్ని దినములనుండి నాకొఱకై వేచి

తేశుఁడు పిలచుచుండెను.

[సమరదాసు ప్రవేశించును]

రంయా—అట్లనుచుంటి రేల? అది సంభవమా? ఇదిగో! సేనాధిపతి మహాశయులు!—మహాశయా! ఏమనెదరు? అది సంభవమా? సంభవమా!

రాణి—సంభవమేలకాదు?

రంయా—ఏల సంభవము కాదో నే నెఱుంగను. కాని, మది సంభవము కాదని గాఢముగ నెఱుంగుదును. [సమరదాసునుద్దేశించి] సేనాధిపతీ! మీరు చెప్పుడు! మనము ఎంపిఱను వీడి రాఁ బోవచ్చునా? ఊర్ధ్వమునుండి యశోవంతుఁ డామెను పిలుచుట సంభవమా?

రాణి—అమ్మా! నా కిఁక నెట్టి యభ్యంతరముఁ గలుగఁ జేయకుము. నాకు సెలవొసఁగుము. పోయెదను. సమరా! నాయన యెక్కడ?

సమర—లోపల ఏడ్చుచున్నాఁడు!—అమ్మా! వానికిఁ దెలియఁ జెప్పఁజాలక పోతిని. ఇఁక కేమి చెప్పి మాత్రము వానికి బోధింతును?

రాణి—బిడ్డ యేమనుచున్నాఁడు?

సమర—"అమ్మను నేను వెళ్ళనీయ" ననుచున్నాఁడు.

రాణి—సమరా! వాని నిచటికి గొనిరమ్ము.

[సమరదాసు నిష్క్రమించును]

రాణి—భగవాన్! సతీధర్మరక్షణ మొనరింప నాకు హృదయబల మొసఁగుము. ఈ బిడ్డను వీడిపోవుటన్నిటికంటెఁ గష్టతరమైన కార్యము!—[వక్షమునఁ గరములుంచి] భగవాన్!—

[అనంతుని వెంటఁగొని సమరదాసుమరల ప్రవేశించును. వాని వెనుక కాశిముకూడ వచ్చును]

రాణి—[చేతులుజాచి]—బిడ్డా! నన్ను—నాయనా! నేఁ బోవుచుంటిని. నాకు సెలవిమ్ము తండ్రీ!—

అంత్—అమ్మా! నీవు వెళ్ళిపోయెదవా?—నన్నువిడిచిపెట్టి, నీవెక్కడకు బోదువమ్మా?

రాణి—ఎచ్చటికి కులసతులొకనాఁడు నాకున్ననొకనాఁడు పోవలెనో యచ్చటికే! బిడ్డా నన్ను వెళ్ళనిమ్ము.

అంత్—వెళ్ళనియ్యనా?—వెళ్ళనియ్యనా! [కంపితస్వరమున]—అమ్మా—

రాణి—తండ్రీ! ఎవరియమ్మయుఁ గలకాలము స్థిరయుండదు.

అంత్—అమ్మా! ఎవరియమ్మయైనఁ యీవిధముగా తన బిడ్డను విడిచిపెట్టి వెళ్ళిపోవునా?

రాణి—నాయనా! ఇది నా సతీధర్మము!

రఘునా—రాణీ, రాజ్ఞీ! ఇది మీ మాతృధర్మముగాదా!

రాణి—ఛీ! బిడ్డా! ఏడ్వకుము. ఏడ్వవచ్చునా?—నాయనా! ఊరకో!—నేను వెళ్ళవలెనురా తండ్రీ!

అంత్—నీవు వెళ్ళవలెనంటే వెళ్ళిపొమ్ము. నీకిష్టమైన,—నన్ను విడిచి వెళ్ళిపోవుట నీకిష్టమైన, నన్నువిడిచి నీవు వెళ్ళగలిగిన, నీవు వెళ్ళిపొమ్ము! నే నడ్డుపెట్టను! [వెక్కి వెక్కి యేడ్చును.]

రాజ్ఞి—(బిడ్డనెత్తి కవుంగలించుకొని, మూతని నిమురార్చుచు)—తండ్రీ! ఊరుకొనుము! సంతోషముతో నన్ను వెళ్ళనిమ్ము. ప్రసన్నమనస్కుఁడవై నీ యమ్మకు సెలవిమ్ము.

అంత్—నేను సెలవియ్యను!

రాణి—సమరా! నీ వీబాలునకు బోధజేసి చెప్పుము.

సమర—నాయనా! ఇది నియమ్మయొక్క సతీధర్మము! ఈ ధర్మమున కడ్డువెట్టుట నీ కర్తవ్యము కాదు.

రజియా—ధర్మమా! సేనాపతీ!—కన్నబిడ్డల వీడి, వారలఁ బరహ స్తములం దప్పన మొనరించి వెడలిపోవుట ధర్మము నా?—దీని నీవు ధర్మమందువా?

సమర—బాలా! ధర్మమును మనము విచార మొనరింపఁ గూరుచుని యుండలేదు! అనుష్ఠాన మొనరించుటకే సంసిద్ధులమైయుంటిమి! దాని సమ్ముఖమున సతమ స్తకులమై యుండుటే మన కుచితము! ఏ రీధర్మములను నిర్మించిపోయిరో, వారలు మనలకంటెఁ జాల మదుంబగుల నేర్చినవారు! వారలు మనలకంటె ఘనులు!

అజిత్—అయినను, అమ్మా! నీవు నన్ను విడిచి వెళ్ళిపోదువా— [కంపితస్వరమున]—ఇది నీకు బాగుగనున్నదా?—నీ కుచితమని తోఁచుచున్నదా? బిడ్డను విడిచిపోవుట నీకుఁ గష్టముగఁ దోఁచుట లేదా?

సమర—కష్టము! కష్టము!! (కంపితస్వరమున) తండ్రీ! ఆమె ఒక్క నీయమ్మయేనా? నా యమ్మకాదా? సమస్త మార్వారునకు అమ్మ కాదా!—అయినను, నాయనా! [కంఠము రుద్ధమైపోవును] ఆ! ఆ!! (బిగించుక దుఃఖోపశమన మాచరించుకొని) ఆమెను విడిచి వేయవలెను!—తండ్రీ! ఇది ప్రతిమను విసర్జన మొనరించుట! ఇది బాలిక నత్తవారింటికి కంపుట!!—కష్టముగ నున్నదని నిష్టనుభంగ మొనరింపవచ్చునా?

అజిత్—నా కదేమియుఁ దెలియదు. నేను మాయమ్మను విడిచి పెట్టను.

మహారాణి నిరుపాయమూర్తియై సమరదాసును విలోకించును.

సమర—బిడ్డా! నీవు క్షత్రియకుమారుండవు—నీవిట్లు క్రందన మొనరింపవచ్చునా? ఈవిధముగ నీయమ్మను పోవలదని ప్రబతిమాల వచ్చునా? విమువనని పెంకిపట్టు పట్టవచ్చునా?—నీవయసునందే

ఇకఁబోయెదను!—సమరా! మాటలాడ కూరకుంటివేమితండ్రీ!

సమర—(గద్గదకంఠుఁడై)అమ్మా! పొమ్మ! హిందువునై, భర్త ననుగమింపవలదని యెట్లు సెప్పుదును!—అమ్మా! పొమ్మ—

(అని మాతృకను రాజ్ఞికిఁ బ్రణామమాచరించును.)

రాణి—కుమారా! చిరంజీవివికమ్ము. ఈవార్త దుర్గాదాసుకుఁ దెల్పి, నాయాశీర్వాదమాతని కెఱింగింపుము!—

[అధోవదనుఁడై సమరదాసు మెల్ల మెల్లగ రెండవవైపునకు నిష్క్రమించును.]

దృశ్యాంతరము

[జాజ్వల్యమానమగుచితి—క్షత్రనారీగణసహితయై మహారాణి నిలువంబడియుండును, నారీమణులు పాడుదురు.

గీతము

మర్త్యదుఃఖములన్నియు మాసిపోవ,
"పూజ్యురాలవు నీ"వని బుధులు మెచ్చ,
దేవదుందుభులెల్లెడ ద్రోనగాను,
ననలగురిపింప నమరులు నభమునుండి,
దిశలువెలుఁగఁగ నీశుభ్రయశము సోడ,
జనుము మాయమ్మ మారువాటుజననినీవు-
నీదునాథునికడకును నెమ్మిమీఱ,
పతియె సతికిని సర్వదాగతియెగాన.

పావనగుణశోభితయైన, యా క్షత్రియకుల నారీశిరోమణి యగ్నియందు లంఘనంబొనర్చును. పడతులు పాడుచు పాడుచు ప్రస్థాన మొనరింతురు—

[So jumped the Mother of Marwar in the living embers of glory. The worthy wife of a worthy husband the patriotic Mahamaya was the embodiment of all feminine virtues. Her life for ever shines as a beacon light to lead the womanhood of the world to the rich vistas of purity and patriotism. The love she cherished towards her husband, her children and abobe all her country was platonic, yet divine. She apotheocised task as she would her Task-Master! With more than stoic rigidity she set foot upon the path of duty knowing that

'... ... it was the way to glory: (and that)
He (or she) that walks it, only thirsting
For the right, and learns to deaden
Love of Self, before his (or her) journey closes,
He (or she) shall find the stubborn
thistle bursting
Into glossy purples, which out-redden
All voluptuous garden-roses.

So she did not demur to reprimand even her loving spouse when she found him listening to the Siren Song of Temptation sent into him by the crafty Aurangzeb and deviating, though slightly, from the rugged Path of Duty. Subsequent to the tragic end of her husband and son, she nursed an inflexible determination to avenge the wrongs done to her by the tyranny that sat on the then Delhi throne and to rehabilitate the glories of Marwar. When her husband's following was steeped in the guag-mire of dejection she screwed up her courage to the stickingplace, and by virtue of her magnetic personality inspired depression to rise and jump with the swift foot of ardour and alacrity to break down the invelnerable Moghul phalause piecemeal, to vindicate the honour of Marwar and to bring back the halcyon days of Rajasthan! Eventually she gained her objective by smashing the Mogul van-guard into dust and nothingness and—albeit she was bent upon thirsting the claws of reprisal

in the face of the vindictive Gulneyar the authoress of a thousand and one blunders—yielding to Rajsimha's Sermon on the Mount, sent the delinquent her life-long fœ, back to the Moghul camp *sans* doing her any harm. After finishing her duty towards her Ajit and her Marwar, she fulfilled that duty which she weened she must needs do to her departed lord, by tearing herself from her dear Ajit and by flinging head-long in the blazing conflagration of *Chitty* with a face beaming with the light of purity, love, patriotism and virtue. It is impossible to descant upon the sterling qualities of this ideal lady of holy India within the purlieus of a compendious disquisition. I shall therefore laconically observe that Mahamaya was a lady of such patriotism and such purity as it would be difficult for us to find her proto-type in any clime and in any age though the heroines of fiction and romance may make an approach to her. It is for her country-women the daughters of *Bharata-mata*, to imbibe her idealism to imitate and emulate her noble example, to break asunder the chains of superstition to exercise the demon of ignorance, to educate, edify and enlighten their sons, the standard-bearers of Indian freedom, and to send forth a galaxy of heroes who, until they find their father-land shining resplendent in the federation of strong, free nations, would

'Strive, to seek, to find
... And not to yield!']

## ద్వితీయరంగము

అజ్మీరునందు మొగలు ప్రాసాదాగారము—ప్రభాతకాలము—ఔరంగజేబు దిలీర్ఖానులు ప్రసంగించుచుందురు.

దిలీర్—ప్రభూ! రాజపుత్రులతో సంధి గావించితిని. రాథోడు సేనాధిపతియైన సమరదాసుని సంధికి సమ్మతింపఁజేయుట జాలకఠిన మాయెను; అతఁడిది కపటసంధి యనెను.

ఔరం—తుదకాతని నెట్లు సమ్మతింపఁజేసితివి?

దిలీర్—నా నిజపుత్రద్వయ మాతనికిఁ బ్రతిభూరూపంబుగ [జామీనుగ [as surety or guarantee] విడిచిన యనంతర మాతఁడీసంధికియ్యకొనెను!

ఔరం—ఏ నిబంధనములతో సంధిగావించితివి?

దిలీర్—చిత్తూరును, దాని యధీనస్థ జనపదములును, రాజపుత్రులకుఁ దిరిగి యీయఁబడుననియు, హిందువుల దేవమందిరములు భవిష్యమున భద్రముగా నుంపఁబడుననియు, యోధపుర పతి కాతని రాజ్యము మరల నీయఁబడుననియు, రాణా నిజవాహినులతో సామ్రాట్టునకుఁ బూర్వమువలెనె సహాయ మొనరింపవలయుననియు నిర్ధారణమొనరించి సంధిగావించితిని.

ఔరంగ—నిజవాహినులతో నీకు సాయముసలుప రాణా జయసింహుఁడియ్యకొనెనా?

దిలీర్—నిస్సందేహముగా నియ్యకొనెను. సంధిస్థాపన మొనరింపనందటికంటె నాతని కధికేచ్ఛగలదు. సముద్రాను "భీమా! రాజపుత్రకులాంగారా! స్త్రైణా! స్త్రీలోలా!" యని యాతనిఁ దీవ్రముగ నాక్రోశించి, ప్రథమమున సభను పరిత్యజించి వెడలిపోయెను. అప్పుడే మొగలు సామంతులందఱు రాణా ననేకవిధముల నెత్తి పొడవసాగిరి! రాణా యధోవదనుఁడై యూరకుని యుండెను.

ఔరం—తదుపరి?

దిలీర్—తదుపరి మంత్రాలోకసభ మూయెను. అందు నూతన నిబంధనలతో నూతన సంధిపత్రము లిఖింపఁబడెను! "మొగలాయీలను విశ్వసింపరా" దని సమరదాసు సుదీర్ఘనిశ్వాసమున బలికెను! అనంతరము నేను సామంతుల నిర్వురను జామీనుగ మొగలాయీల

కొసఁగి, బహుకష్టమున నాతనిని సంధికియ్య కొనఁజేసితిని!

ఔరం—నీవు నిజసందనులను శత్రువులకడ వీడి వచ్చితివా?

దిలీర్—చిత్తము ప్రభూ!

ఔరం—మిత్రమా! నీవు మహాత్ముండవు— నే నీసంధిని పాలన మొనరించెదను.

దిలీర్—సార్వభౌములకు విజయమగాక!—[శ్యామసింహుఁడు ప్రవేశించును]

శ్యామ—రాజాధిరాజ పాదుసాహ యౌరంగజేబు మహాప్రభులకు జయమగాక!

ఔరం—మహరాజ్! వార్తలేమి?

శ్యామ—స్వామీ! కార్యోద్ధరణమై పోయెను!—ఆశాతీతంబుగ నుద్ధారితమాయెను!! సామ్రాజ్యమిఁక నిష్కంటకమై యుండును!

ఔరం—ఎట్లు?

శ్యామ—సంధి యసంతరమునఁ గిరిపయుద్రాహ్మణులచే నుద్ధతుఁడగు సమర్దాసును సమయింపఁజేసితిని!

దిలీర్—ఏమి!—నీ వాతనిఁ బొలియింపఁజేసితివా?—నిక్కమే?—

శ్యామ—నిక్కము! నిక్కము!!నిక్కము!!! [చంకలు కొట్టుకొనును.]

దిలీర్—ఏమి! నీ వాతనిని హత్యఁ గావింపఁ జేసితివా!!

శ్యామ—అవునోయి అవును! అవునోయి అవును!! నేనే వానిప్రాణములను దీయించి వైచితిని!!!

దిలీర్—సామ్రాట్! క్షమింపుఁడు—[శ్యామసింహుని గళంబును గట్టిగఁ బట్టుకొని]—పామరా! పాషండా!! కులద్రోహీ!!!—రాజపుత్రకులాంగారా!!!! నీ ప్రాణంబులను నే నిప్పుడె దీసి వైచెదను!, కట్టుడీ! యిప్పుడే నిన్ను మట్టు వెట్టెదను!

శ్యామసింహుఁడు—[కంఠగతప్రాణుండై, సామ్రాట్టును విలోకించుచు

## చతుర్థదృశ్యము

దాక్షిణాత్యమున, పాలిగరు దుర్గము— రాత్రికాలము.

మరాఠాధిపతియైన శంభుజీ(Sambhajee, son of the great Sivajee) యును, దుర్గాదాసు యక్బరులును యాసీనులై యుందురు.

శంభుజీ—దుర్గాదాసూ! నీ వసమసాహసకార్యము నాచరించితివి! ఏనాఁడును రాజపుత్ర యశ్వాగ్నోహకులను మాత్రము వెంటగొని, యోధపురమునుండి పాలిగరమున కరుదెంచితివి!

అక్బరు—మేము వచ్చి చాలదినములాయెను. ఇంత వఱకు దేవర దర్శనము మాకు లభింపలేదు!

శంభుజీ—షాహజాదా! నేననేక రాజకార్యములందు వ్యస్తుఁడనై యుంటిని. అందుచే విలంబమాయెను. మన్నింపుఁడు! యువరాజా! అభ్యర్థన మందెట్టి త్రుటి కలుగలేదుకదా?

అక్బరు—లేదు. దేవరవారి సామంతులు నాకు యథోచితసత్కారములఁ జూపిరి. నాకెట్టిలోఁటును కలుఁగలేదు.

శంభుజీ—షాహజాదా! మీ పిల్లలెచట?

దుర్గా—వారలను మార్వారు మహిషికడనుంచి రావలసి వచ్చెను. వారల యెడలఁ జక్రవర్తి కెట్టి కనికరము లేదు. ఏలినవారొక్క యువరాజునకు మాత్ర మాశ్రయ దానమొసఁగుఁడు.

శంభుజీ—షాహజాదా! మీకేఁక నెట్టి చింతయును లేదు. తామిపుడు లోహదుర్గమందుంటిరని తలంప వచ్చును!—దుర్గాదాసా! మీర లీయనను సామ్రాట్టు పదమున నలంకృతుఁ గావించితిరా?

దుర్గా—కావించితిమి మహారాజ్!

శంభుజీ—ఖాస్ [చాలు]—అక్బరుషాహా! మహారాష్ట్రులముగు మేముకూడ మిమ్ము సార్వభౌములనని గౌరవించెదము!

అక్బరు—నాసోదరుండగు మాజాన్ సైన్యసహితముగ నన్నెదు
ర్కొన నరుదెంచెను.

దుర్గాదాసు—కుమార్ యజీముకూడ వాహినీ సహితుఁడై యాహ
మదునగరముఁ కేగుదెంచెను.

శంభుజీ—యువరాజా! మీకెట్టిభయమును లేదు. బహదర్పూరునకు
దోడ్కొనిపోయి మిమ్ము మొగలుసామ్రాజ్యమున కభిషిక్తుల
గావించెదను.

[శంభుజీసైన్యాధ్యక్షులగు శాంతజీ కేశవులు ప్రవేశింతురు.]

శాంతజీ—మహారాజ్! రంజయాదుర్గము పతనమైపోయెను.

శంభుజీ—మంచిది! బాగుగనే జరిగినది! సంతుష్టుడనైతిని!

కేశవ—మహారాజ్! కర్నల్ కేరిఫర్డినాండులు [Colonel Kerry and Ferdinand] దేవరదర్శనము వేఁడుచుండిరి. వారల నిచటకుఁ గొని
రమ్మందురా?

శంభుజీ—తీసుకొనిరండు—పోయిన దేమి!

[శాంతజీ కేశవులు నిష్క్రమింతురు]

శంభుజీ—షాహజాదా! ఇంచుకైన విశ్రామములేదు—రాజులకు
రాజకార్యములు ప్రశాంతము వెంటఁదిరుగుచుండును—ఈ రంజయా
దుర్గమును, ఫిరంగీయులు సువరాతు మిషమునకుఁ బూర్వము
తమ కింపుకాసించిరి. అది యిపుడు భూమిం గూలెనని మా శాంతజీ
మీ సమ్ముఖమందే దెలిపియుండెను!—దుర్గాదాసుగారూ! రాజపు
త్రులు యుద్ధమేమో యెఱుంగుదురా!

దుర్గాదాసు—రాజపుత్రులు దేశార్థమై ప్రాణములను త్యజించు
టెఱుంగుదురు.

శంభుజీ—కాని వారు పలుమాఱులు యవనపదదలితులైరికదా!

దుర్గాదాసు—అగుటసత్యమే! కాని సమస్త యార్యావర్తమందు

రాజస్థానము రేణుకవగిది నున్నదని దేవర యెఱుంగుదురు. రాజస్థానమట్టులున్నను, సమస్త మహారాష్ట్రమందొక్క రాజపుత్రులు మాత్రమే యీ మున్నూరువత్సరములనుండి శిరముల నెత్తి నిలువంబడియుండిరి!

శంభుజీ—అట్లయిన మహారాష్ట్రులేల శిరంబుల నెత్తి నిలువంబడని వారు!—మహారాష్ట్రులొక శిరముల నెత్తుకొని నిలువంబడలేదు-వారలు శిరంబులనుకూడ నెగయుటకు ప్రయత్నము సేసిరి! ఎవరిశక్తి యధికమో గ్రహింపుము. దుర్గాదాసా! మీరే మహానిలువంబడిపోవుచువారలును, తక్కుంగలవారలందఱు మూలబడియుండుచుండువారలనియు దలంపకుము.

దుర్గాదాసు—మహారాజ్! నేను మహారాష్ట్రులు హీనులనుచుండుట లేదు. రాజపుత్రులు పరికిపందలైన వారలు గారనియు, మొగలు పదాఘాతముల కోర్చియుండువారలు గారనియుఁ జెప్పుచుంటిని. [క్షణమాగి]—మహారాజ్! నా రాక యొక్క ప్రథమోద్దేశ్యము యువరాజును నిరాపదుఁ గావించుటయే!

శంభుజీ—మంచిది! వచ్చితివి! వచ్చుట మంచిపనే!—వచ్చితివి కాన, మహారాష్ట్రు లెట్లు యుద్ధము చేయుదురో గాంచి, మరల తిరిగి పొమ్ము. పోయినపిదప వీరులగుటెంచి కథల నెన్నియో మీవారలకుఁ జెప్పుకొనఁగలుఁగుదువు!

దుర్గాదాసు—[స్వగతమున]—"ఇంతగర్భ ముండువానికిఁ బతనమవశ్యముగ సంభవింపక మానదు!"

[కెరి, ఫర్శినాండుల సహితుఁడై కేశవరావు ప్రవేశించును]

శంభుజీ—కెరీవొరా! మీ రింకయూ దుర్గముయొక్క యవస్థ గాంచితివా?

కెరి—చిత్తము రాజా!

శంభుజీ—మా శత్రునౌకలకు మీరలు మీ రేవుసం దాశ్రయ మొసంగినారో, మీ బొంబాయి యుపనివేశమునకు (To the colony of Bombay) నాపై పెట్టినయే ప్రాపించునని యెఱుంగుము. ఆనేక యట్లు ప్రాపించుచుంటిని, మహారాష్ట్రీ ఎలిఫెంటాయందు—(In Eliphanta) మీరు దుర్గనిర్మాణ మొనరించుచున్నారు! అట్టిచట మా రాజ్యాన దుర్గనిర్మాణ మాచరింపు మని నెవరంగీకరించి యున్నాము!

కెరి—రాజా—

శంభుజీ—నే నేమియు విన నిచ్చగింపను. పొమ్ము—[సంపవపాశ్చాత్యు నుద్దేశించి]—పోర్చుగీసు సర్దారా! మీరలు నా వారణ (Warning) లెక్క సేసితిరి కారు! మీ గోవాం ద్వీపము నాక్రమించుకొనుటకై చే నౌక నౌకల నంపితిని! మీగోవా (Goa) వాణిజ్య మెట్లు జరుగునో చూచెదగాక! ఇప్పుడైనను జాగరూకులై మెలంగుడు—ఇంక పొండు.

[కెరిఫర్గినాండులు వంగి సలామొనర్చి నిష్క్రమింతురు]

శంభుజీ—దుర్గాదాసా! నా సంగివారలను, గొంతము భయము కలుగుచుండును!—సాబేష్షా!

నేపథ్యమున—హుజూర్!—హుజూర్!

శంభుజీ—సరాబ్ ఆవు జల్దీ—[గుడీమువిల్లా] నేపథ్యమున—జో హుకుమ్, మహారాజ్—[ఒకని దపుహా—]

శంభుజీ—ఈ భంగి వారి నాసుభముగా నిచ్చుచుండు పేల్చెదరు!! నా కెన్నడు పెళ్లానలైనను, మొదలు ప్రాణములున్నవారివలె నొకని నొకరంటి పెట్టుకొనియుండుటయే ఒక్కటే గతి,—ఒక్కటే లక్ష్యము,—ఒక్కే దిక్కు ముఖము—ఓ! యేమియైనను

[సారాపాత్రం గరముస నిడుకొని సాబేష్షాను ప్రవేశించును]

శంభుజీ—[సారాపాత్రం దీసికొని, యక్బరు దుర్గాదాసులకు దానిని

ముసల్మానులు సంభోగవిలాసములను బాగా యెఱుఁగుదురా?

అక్బరు—[సురాపాన మొనరించుచు]—కాని, సురాపానము వారి మతనిషిద్ధము!

శంభుజీ—ఆలాగా!—అక్బరూ, ఆమతము నాకు నచ్చినదికాదు! అది ముసలిబోటివారికు గాదు.—యువరాజా! నువ్వే చెప్పు! యింత మంచివస్తువు మఱియొకటి యున్నదా?—ఎంతశుభ్రము! ఎంత శాంతము!—ఎంతశుద్ధము! కాని, లోపలికి పోగానే అది ప్రపంచమంతా రంగురంగులుగా మార్చివైచును! హా! హా. హాః హాః [పకపక నవ్వును] ఏం, యువరాజా! పాడండే పాడండి! ఆడండి! హెయ్ తకతకా తయ్ ధీధీధీ!!!

దుర్గాదాసు [పోవుచు పోవుచు, స్వగతముగ]—శంభుజీ! ఈ సురాపానములే నిన్ను సర్వనాశనముపాలొనర్చుటకు ద్రోసివైచును!

[నిష్క్రమించును]

శంభుజీ—ఓహో అక్బరూ! దుర్గాదాసుగాడు ముసల్మానుల్ని పట్టుకుని సన్న్యాసుల్ని చూచావా? నాగావా! ఏమిరా! వాఁడికో అమూల్యము! తన సతీత్వమంతా మంటగలిపి శాపించేసేడు!—గొంగ మూలపోకడ!

అక్బరు—పాడండనే పాడండి!

శంభుజీ—అవును పాడండి!—ఇంకేం రండి! ఎగురే! ఎగిరిగింతెయ్! అద్దుగిల్లాగి! నావా! వహావ్వా!—ఓ రేవు! యువరాజా! యుద్ధం చేసి పాపమం యెందుకు? [illegible] వున్నాళ్ళు యుల్లాసగ బ్రతుక [illegible] తున్నారో యెఱుఁగుదువా? "సంభోగసుఖాలే ఖలుధర్మసాధనము!"*—అస్! పాడండి!!—యువరాజు ఇప్పుడొక మంచి పాట పాడండి! వీరి యూవా వాని గాథను పాడండి! వీరెవరో తెలుసునా?—అచ్చంగా వీడు

పోరి కమ్ము వెడలిపోయి యుండును!

పరిచారిక—పోట్లాటా లేదు, కొట్లాటా లేదు!—అటువంటి దేమీ జరుగలేదు! పెద్దరాణీ పెదవి [పెదవి] మెదపనే లేదు!—ఇంట్లో ఆమె వున్నట్టే తెలియదు! అణిగి మణిగి వుంటుంది!—చిన్న రాణీయో అహర్నిశలు నానా కూతలూ కూస్తూ వుంటుంది! పిల్లి మీదా, ఎలుకమీదా నెపం పెట్టి, చెడతిట్లు తిట్టుతూ, రాకాసిలాగ నిప్పులు మీద పడుతూ వుంటుంది! ఏమన్నా, ఆ ఇల్లాలు తల వంచుకొని కూర్చొని వుంటుంది! చిన్నరాణీయే కొంపకు పెద్దపోరు తెచ్చిపెట్టింది! ఆ ముఖము చూస్తే ఆమెనోరు లక్కపిడతలాగే వుంటుంది! అయితే, పెద్దరాణి కంటతడి పెడితేనే అన్నీ చిక్కుబడ్డే పోతుంది! ఇంత అందం, ఇంత అనాకారము కూడా చెల్లుగనక పెద్దముండనైనా నేనెక్కడా చూడలేదు బాబూ!

జయసింహ—ఛీ! పోగుకో! నోటికివచ్చినట్లు కూయకుము!!

పరిచారిక—ఓ నాయనో! అచ్చంగా కుంభకర్ణుడే! మింగేస్తాడు బాబోయి బాబో!—సరే! చూస్తా! ఎల్లా మింగుతాడో! అయ్యబాబో! గ్రుడ్లు ఎర్రవి చెయ్యగానే బెదుర్తాననుకుంటున్నావు! నీపౌగరు మోతుతనము చూపించటం నాదగ్గిరా? చిన్న పెళ్ళాం వాగుడు ప్పటించి, నీకు కంటిమీదా కనపడడలేదు! ఒళ్ళెరగకున్నావు!—నేనో! అల్లాకాదు! రాజ్యమంతా పెంటపాలుచేసి, ఆ స్వరాజ్యం, నీలాగి దానికాళ్ళు జపంచేస్తూ కూర్చుని వుండేందుకు, అది నా ఇష్టదేవత కాదు!

జయసింహ—చూడు, నీవు నన్ను పెంచి, పెద్దవాడనుచేసిన పెద్ద ముండవని చెప్పి, నీవేమి కూసినను, ఓర్పుతో సహించుకొను చున్నాను! ఇక్కడవాగక, పోయి పెద్దరాణిని పిలుచుకురమ్మ.

పరిచారిక——నేనల్లా పిలిచేదాన్ని కాను! నీవామె గదిలోనికి పోకూడ దేం? ఆమెగదిలో కాళ్ళెట్టితే అవి పొక్కు లెక్కిపోతాయి కాబోలు! ఆయమ్మ నాకుముల్లే కానీపం చేసి, పిల్లో గంజో తాగేందుకొచ్చిన మణిసికాదు!——ఆమె గొప్పోరింటిబిడ్డ!—— ఆవిడికిగాను గొప్ప రాజనకం చేశాను!

జయసింహ——నీవు వెళ్ళవా యేమి?

పరిచారిక——ఈ——? ఒక్కసుంతే యెట్టచేసేశావు పిల్లనెందూ—— అచ్చంగా దూర్వాసముని మోస్తరే! నాట్లేస్తా వేటికొంటమ్మా ——అవును. పానిలో ఖద్దూరం యేముందీ? అంత దేశాన్ని తురకోళ్ళ చేతిలో పెట్టేసి, యింటికొచ్చి, మూలనున్న ముసిలిదాన్ని నాపై సాముచేసేవాడు చెయ్యలేనిపనేమిటి? చిగ్గూ బిడియము వుంటే కాదూ మణిసికి!——దేశమంతా యేమనుకుంటున్నారో యెఱిగుంటే కాదూ?——

జయసింహ——అవును. నన్ను లోకులందరూ నిందవిందము చేయుచున్నారు. కాని, వెంకిబామ్మా! నీవు కూడ అల్లానిందించవచ్చునా? నా మన సేలాగున్నదో తెలుపుదునా?

పరిచారిక——నీవు నాకు 'తగుదుసమ్మా' అని వేరే యేమీ చెప్ప నక్కర్లేదు! నా కంతా ముందే తెలిసిపోయింది!——ఏదో మందు పెట్టింది అది!——మందుపెట్టేసింది!——పెళ్ళామై నెత్తెక్కి తొక్కు తోంది!——లేకపోతే నువ్వు మంచిబిడ్డలాగే వుండే వాడివి!——సరే నేనిక పోతాను! పోయి పద్దరాణీని పిల్చుకు వస్తాను! కాని ఆమెను నువ్వు పల్లెత్తుమాటన్నావంటే నా, యీ చెంబుచ్చుకు నీ బుఱ్ఱమీద పెడతాను! పెంచి పెద్దోణ్ణిచేసినానసరే, మఱేం చేసినానసరే, యింటి కొచ్చిందేవికి చూపే అవమానము చూచి వూరుకోలేను. [నిష్క్రమించును]

జయసింహ—నిజంబుగ నామె నన్నుండే పెట్టెను! ఏమంత్రబలంబుచేతనో నన్నామె పూర్తిగఁ గన్మయుఁ గావించివైచెను!—నా కేమియుఁ దోఁచుటలేదు! చిత్తమంతయుఁ గలంగిపోయెను! ఆమె నన్ను వీడి వెడలిపోయెను—ప్రపంచమంతయు శూన్యముగఁ గన్పట్టుచుండెను. నమ్ముఖమందంధకారము తక్క నాకేమియుఁ గాన్పించుట లేదు.

[మెల్ల మెల్లగ సరస్వతి ప్రవేశించును]

సరస్వతి—నన్ను పిలిచితిరా?

జయసింహ—అవును పిలిచితిని. చిన్నదాని యెచ్చటో యెఱుంగుదువా?

సరస్వతి—ఎఱుంగను!

జయసింహ—నీతో నేమియుఁ జెప్పిపోలేదా? సాహసమాడిపోయినదా?

సరస్వతి—లేదు.

జయసింహ—[దయతో నామె నిండు దృష్టి నుంచి చూచి] సరస్వతీ! నీవు లేవా? గనే నీ మాట నేను నమ్మవైతునా!

సరస్వతి—నమ్ముటయు నమ్మకపోవుటయు మీయిష్టము! నన్నడిగిరి గాన నే నిట్లు చెప్పితిని!

జయసింహ—ఆమె పోయిన కారణ మేమైన నెఱుంగుదువా?

సరస్వతి—ఎఱుంగను! నే నెఱుంగను!

జయసింహ—ఇట్టి కారణమై యుండు నని యనుమానించితివా?

సరస్వతి—అనుమానించితిని.

జయసింహ—ఏమి యనుమానించితివి?

సరస్వతి—ఏమి యనుమానించితినో చెప్పఁజాలను!

జయసింహ—చెప్పఁజాలవా, లేక, చెప్పఁదలఁచుకొనలేదా?

సరస్వతి—మంచి దట్లనే యనుకొనుఁడు!—నేను చెప్పఁదలఁచుకొన

లేదనియే తలంపుడు!

జయసింహ—సరస్వతీ! నీ పతిభక్తి యిదిగదా?—మంచి దదేది యైనను, అదెట్టిదైనను, నేఁజెప్పు దానినివినుము. నేనామెకొఱకై దేశత్యాగము చేయవలయుచున్నను, చేయుదుఁగ!—అట్లనియెఱుంగవు గాఁబోలు!

సరస్వతి—ఎఱుంగకేమి?—ఎఱుంగుదుఁగ! ఏదేశంబును తుచ్ఛులైన మ్లేచ్ఛులకు తెజాసువులై విక్రయించివైచి వచ్చితిరో, అదానిని, ఆదేశంబును తాము మరల గ్రహించుటం దాశ్చర్యమేమున్నది?

జయసింహ—నేను దేశమును విక్రయించి రాలేదు!—సంధిగావించి వచ్చితిని!

సరస్వతి—రాణా! దీనిని సంధియందురా? ఏ ముసల్మానులే యొక వత్సరముక్రిందట దేశ, జాతి, ధర్మములను బీడించి మొఱిరించుచుండిరో, యే ముసల్మానులను మా గ్వాలియరు వీరులు విగ్రహమునందు (In War) బరాస్తులఁ గావించిరో—వారితోడనా, మాముసల్మానులతోడనా సంధిగావించుట!—రాణా! మీరు మీరాణాపదమును కళంకము గల్గించితిరి!

జయసింహ—ఎవరికొఱకు గల్గించితిని?—నాకొఱకా లేక జాతికొఱకా?

సరస్వతి—చిన్నరాణి కొఱకు!—నన్ను మీరనుగవలయునదిఁ కేమైననున్నదా!

జయసింహ—లేదు.

సరస్వతి—మంచిది—అట్లైన నేనికఁబోయెదను!

జయసింహ—పొమ్ము—నేఁగూడఁ బోయెదను.

సరస్వతి—మీ యిష్టమెట్లో యట్లాచరింపుడు!—నే నొక్కమాటఁ

జెప్పిపోదును! ఎచటికిఁ బోవలయునో, ఇచ్ఛయున్నదో, యచటి కరుగుఁడు. కాని, మీకు శాంతి ప్రాపింపఁజేయను. ఏ యుద్దామ ప్రవృత్తి భరమున నేను పత్నివీడి, పుత్రులవీడి, రాజ్యమును వీడి, వెడలి పోవుచుంటినో, యది ప్రేమకాదు,—లాలసము (Passion)—ప్రేమకంటె నిర్ఝరిణి చాంచల్యస్థిరమై, స్వచ్ఛమై, మధురమై యుండును. వారి ప్రవాహము నడుపునది యుచ్ఛ్వసితమై, పంకిలమై, ప్రమత్తమై యుండెడు! నిక్కంబుగ ప్రేమ చకిత విద్యుత్తు చాంచల్య తీవ్రమై యుండదు—జ్యోత్స్నచందనమున స్నిగ్ధమై, మధురమై యుండును!—యివ్విషయము జ్ఞప్తి యుందుంచుకొనవలయును. అక్షరాక్షరము లివి సత్యము నాఁడో చరమాంకదు!

[నిష్క్రమించును]

యశింహ—సరస్వతీ! ఇది ప్రేమకాదనియు, లిప్స (Passion) యనియు నెఱుంగుదును! ఇది యున్న మెల్లమెల్లగ నాహుతుపగిది గ్రాసమొనరించుచుండెను!—వ్యాధివిషము కరణి నిది సమస్త శరీరమున వ్యాపించుచున్నది. ఒక గభీరావర్తములోనికి బలంబుగ నన్నీడ్చుచున్నది! అంతయు బోధపడుచునే యున్నదికాని, యుపాయములేదు!—ఉపాయము లేదు!!

[ఉద్భ్రాంతభావముతో నిష్క్రమించును.]

## షష్ఠదృశ్యము

మార్వారుదుర్గము—దుర్గాదాసు శయనాగారము

రాత్రిజాము.

శయ్యపై నుపవిష్టుండై, దుర్గాదాసు ఒక పత్రము చదువుచుండును:—

“ఈ విధంబుగఁ దమ సరళోదారభ్రాత సమరసింహుఁడు

(Or Samardas) మృతుండాయెను. ఈ వైపున మన మహారాణి చితారోహణ మొనరించి, తన స్వర్గీయభర్త ననుగమించెను ఆ వైపున స్త్రైణుండును, కాపురుషుండును యగు రాణాజయసింహుండు మొగలులతో కడు యవమానకరసంధి సలిపి, రాజ్యమును పరిత్యజించి, ద్వితీయమహిషింగూడి జయసముద్రతీరమున కరిగి యచ్చో వాసముచేయుచుండెను. ఆతని గూర్చి రణకతంబునను, మహారాజ్ఞి స్వర్గారోహణకతంబునను, వీరవరుండైన సమరదాసు మృత్యువుకతంబునను, రాజస్థానమంతయు విచ్ఛిన్నమైపోయెను—"రాథోరు సేనాధిపతీ' తాము నిజసీమకు మరలిరండు. మా యపరాధముల నన్నింటిని క్షమింపుడు. కృపాళులై మా యెల్లర వేడికోలు నాలింపుడు''—ఓ!—పత్రమునందు నీ దుర్గతులకంటె బెక్కులగు సామంతుల సందేశములున్నవి. [ఇట్లని యుత్తరమును మడచివైచి, యుపాధానతలమునందు దాచియుంచి, దుర్గాదా సథో వరుండై, మూగారమధ్యమున సంచారిచేయుచుండును.]

శంభుజీ—[గదిలోఁ బ్రవేశించి, మనోజడితస్వరమున] దుర్గాదాసూ వింటివా.

దుర్గా—[చమత్కృతుఁడై] ఏమి మహారాజ్ ?

శంభుజీ—ఔరంగజేబు గాడిని సర్వపర్వత ప్రదేశముల నుండి తరిమి తరిమి కొట్టివేసితిని—పాపము బ్రాహ్మణు శంభుజీతో సమరము సలుపుటకై వచ్చెను—నాయనగారికి సంగతి తెలిసినదిగాదు

దుర్గాదాసు—కాని, బిజాపుర గోల్కొండలు [Bijapur and Go conda] పతనములాయెగదా!

శంభుజీ—అయితేనేమో,, చెవలా! అవిపడితే నాకేమి! [క్షణమూరకొని] దుర్గాదాసూ! విజాపుర గోల్కొండలు పతనములైనను నా కెట్టిహానియుఁ గలుగలేదు! ఈ దిక్కున విజాపురి పశ్చి

ప్రాంతము నాక్రమణ మొనరించుకొని కూరుచుంటిని! వెట్టినా యన యౌరంగజేబుగా రా దిక్కునుండి ముందునకు రాగనే వెనుకనుండి శంభుజీ సైన్యము తరిమి కొట్టసాగెను! మరల నా చిట్టితండ్రి పిలుచుకుని త్రిప్పి, ఆ దిక్కునకుఁ దిరుగగనే శంభుజీ గారి సైన్యము మరల వెనుకనే సిద్ధమై తరుముసాగెను! ఎడాపెడా కూడఁ గొట్టిగొట్టి వదలివేసినారు! తెలిసినది కాదు రాబోవు పాపము—యీతఁడు శంభు! మఱి యెందుకూ కాఁడు!

దుర్గాదాసు—కాని, యీస్పృశ్య యుద్దేశహీన యుద్ధముయొక్క ఫలమేమి? మహారాజా! అనుమతి యొసఁగుఁడు—రాజపుత్ర సైన్యమును నే నిత్తావునకుఁ గొనివచ్చెదను. రాజపుత్రులును మహారాష్ట్రులును కలసి యౌరంగజేబు విపక్షమున నిలువంబడుదము.

శంభుజీ—ఓరి రాజపుత్రా! రాజపుత్రుఁడనని యెందుకురా, ఆ యెగుర్పాటు! యుద్ధమంటే యేమో రాజపుత్రు లెఱుఁగుదురా! కత్తి చూడగానే, ఆమడదూరము పాఱిపోయే చవటస్మలా మాకు సాయము చేసేవారు! ఎప్పుడో యొకప్పుడు మరాఠులే చూసి చూసి రాజపుత్రులను, మొగలాయీలనుకూడ రొక్కమూత్రే పచ్చడిచేసి వదలిపెట్టెదరు!

దుర్గాదాసు—మహారాజా! రాజపుత్రులను ద్వేషము మొనరించినయెడల, మహారాష్ట్రుల గౌరవము వృద్ధికాదు! వారలూ హిందువులే. మహారాష్ట్రులూ హిందువులే!

శంభుజీ—అవునవును నిజమేరా!—దుర్గాదాసూ! నీ పరుపుబాగా మెత్తగా నున్నదికదా?

దుర్గాదాసు—రాజపుత్రులకుఁ గావలయు పరుపున కీపాటి మెత్తతనము చాలును! మా కనేక సమయములం దశ్వపృష్ఠములే పరుపులగుచుండును!

భుజీ—ఇక్కడేవుండు, నీకూనాకూ. ఈ జన్మలోనే నీకూనాకూ కలియదు! యుద్ధమూ యుండవలెను, దానికూ గాఁ సంభోగముండవలెను!—దుర్గాదాసూ! ఏమెట్లున్నను సరేకాని, పసుపు మాత్రము మెత్తగా నుండవలెనోయి—శ బ్లేష్ఖాన్! అరే కా బ్లేష్ఖాన్సూ! !—

పథ్యముస— హుజూర్! [మహాప్రభూ!]

ంభుజీ—అంతయుఁ దయారైనదా?

పథ్యముస—చిత్తము హుజూర్!

ంభుజీ—అట్లైన, దుర్గాదాసూ! నీవిఁకఁ బరుండుము. నేఁ బోయెదను. [నిష్క్రమించును.]

దుర్గాదాసు—[ఆగారమందుఁ బచారుచేయుచు]— మహారాష్ట్రులు నిక్కముగ మహామోఘులు!—అద్భుతయుద్ధచాలనము! ఆశ్చర్యసమరకౌశలము! అబ్బురంపు సహిష్ణుత!—వీనితోఁ రాజపుత్రుల యేకాగ్రత త్యాగ ప్రభుతలని కలుఁపఁగలిఁగెనో, యేమిచేయుట యసంభవమగును?—కాని, యట్లు కానేరదు! భారతమాత భాగ్యము సుప్రసన్నముగ లేదు. హిందువుల హృదయములు విచ్ఛిన్నలై పోయిరి! వారలు మరలఁ గలియుట స్వప్నవార్త!

[This is true not only in the days of Durgadas but also in the days of Gandhi! But there is this difference between India of Durgadas and India of Gandhi, that while India was then yet full of heroes India is now full of men completely emasculated! Mother India! Fortune, as Durgadas says, frowns on you,—on you, the mother of sages and heroes!]

ఇట్లని యాతఁ డాగారమధ్యమునఁ బచారుచేయుచుండును. అప్పు డాకస్మికముగ దూరమునుండి యార్తస్వరము వినంబడును!

దుర్గాదాసు—ఓః! ఏమితీవ్రయార్తధ్వని! ఎట్టికరుణానాదము! ఓ!

అది యుద్ధమును భేదించుచుండెనే! ముఱింత దగ్గర!—ముఱి దగ్గరగ వినంబడుచున్నది!—ఓ! ఏమి! ఈ మాగాఱద్వారాహిమిందే! ఓ! ఇది కాంతా కాతరోక్తి!—అహా! ఈస్వరము హృదయమును భేదించివైచుచున్నది!—

ఆయిలాయిత కేశియై, ప్రస్తవసనయైన నారి యొకర్తుక, పరుగున నా మారాగారమునందు బ్రవేశించును.

నారి—రక్షింపుడు! రక్షింపుడు!!

దుర్గాదాసు—భయములేదు!—తల్లీ భయములేదు!—నీ వెవతె వమ్మా?

[ఖడ్గహస్తుండై శంభుయు, నానివెనుక నాట్లేష్ఖానను ప్రవేశింతురు.]

శంభు—(రాజైస్వరమున)—పిశాచీ! సతాసీ! తెలుపుడీ. నీవు నాపనే బోసిచ్చితివి: ఎముగాలమునే యది పలాయనము నెనరించను!

నారి—అమ్మ యిల్లాలు!—సంసారిస్త్రీ" కులాంగన!!!

శంభు—ఆమె సంసారియైతే నాకేమి?—నీ పామ్మోనిపోయినది!—నీవుట్టేమి మునిగినది?

[నారి భయంబుచే భూమిపై వాలిపోవును. శంభుజీ పరువిడి వచ్చి, కరవాలముగ దూసించుచు, ఆమెపై లంఘింపనుంకించును.

దుర్గాదాసు—(ఆకస్మికముగ నాతని సమ్ముఖమునకు ఱికి)—శంభుజ!—మహారాజ్ఞ!—ఇదేమి! శాంత కత్యాచారము చూపుమంటిరేల?—అబల నొకర్తుకను పాలియింప గమకించుచుంటిరేల?—ఇగిమీరాకు పిగునా?

శంభుజ—ఛీ! ఊరుకో!—ప్రక్కకు తప్పుకో—

దుర్గాదాసు—తప్పుకొనుట యసంభవము! అబలయెడల సూష

యత్యాచారమును దుర్గాదాసు నేటిపర్యంత మెన్నఁడు నిలిచి చూడలేదు—మహారాజ్! దానిని కోరలో నుంచుము!

శంభుజీ—ఆమె యెవతెయో యెఱుంగుదువా?

దుర్గాదాసు—ఆమె యెవ్వరైననేమి?—ఆయమ నాయమ్మ!

శంభుజీ—ఛీ! తప్పుకో!

దుర్గాదాసు—మహారాజ్! శాంతింపుము! నీవు మహాపాప మొనరించితివి! లేకున్న, నీయబలయెడల దౌరాత్మ్యము నీవంటివానికి సంభవముకాదు!

శంభుజీ—ఇప్పుడుకూడ తప్పుకోమనియే చెప్పుచుంటిని!

దుర్గాదాసు—అట్లు తప్పుకొనువాఁడు దుర్గాదాసుకాఁడు!

శంభుజీ—అట్లైన, కరవాలముఁ దీసికొనుము. నేను నిరస్త్రశత్రువును వధింపను. తరవారిఁ దీసుకొనుము!

దుర్గాదాసు—ఈపాటి జ్ఞానమున్నదా! అట్లైన, నీయూడు దానిని హింసింపఁబోవుచుంటివేమి?—మహారాజ్! నామాటవిని వెనుకకు—

శంభుజీ—కరవాలముఁ దీసుకొనుము. (కాలితో దుర్గాదాసును చివాలునతన్ని)—తీసుకొనుము! లేకున్న చచ్చిపోఁగలవు!

దుర్గాదాసు—"కరవాలముఁ దీసుకొననక్కఱలేదు" అని యాతఁడు శంభుజీ కంఠము పట్టుకొని వానిని గిఱ్ఱున భూమిమీఁదకు విసరివైచి, వాని కరములందున్న కృపాణము నూడబెఱికి, దానిని దూరంబుగఁ బాఱవైచును! పిదప నాతఁడు నిజోష్ణీషమును విప్పి, దానిచే శంభుజీకరంబుల రెంటిని బంధించివైచును. తరుణముకలిపెట్టి కాబ్లేష్‌ఖాన్ కాలుంకకు బుద్ధిసెప్పును.

[పలాయన మొనరించును]

దుర్గాదాసు—మహారాజ్! నీ యాతిథ్యమును గ్రహణ మొనరించి

శంభుజీ—దుర్గాదాసూ! ఏమిరా నీ సాహసము! ఆశ్చర్యము కలిగించితివిరా దుర్మతీ! నిన్నుఁగాల్చి వేయను, జీవించియుండ భూపాతము చేయుదును! [I will not burn you, but bury you alive]—నీకెట్టి దండన మొసంగుదును? ఎవ్విధంబునఁ జావఁగోరుచుంటివి?

కాబ్లేష్—మహరాజ్! మెహమాన్‌కు అప్నాహాత్‌సే జాన్‌లేనా ఠీక్ నహీం. ఇంటికి వచ్చినవాని (మెహమాన literally means visitor) ప్రాణములను మీ చేతితో మీరు తీసివేయుట సరియైన పనికాదు! వీనిని వీని ప్రియమిత్రుండైనఁ (దోస్తు) యౌరంగజేబు హస్తములందు సమర్పించుట మంచిది!—ఘాత మొక్కటియే యగును! అట్లు కావించిన యెడల దేవరవారు చెడుపనిని (బురా కామ్) చేయనక్కఱలేదు.

శంభుజీ—అవును! నీ వన్నమాట నిక్కము! అట్లు చేయుటే మంచిది! కాబ్లేష్! వీని నౌరంగజేబుకరములందు విడిచిరమ్ము. ఆతనియొద్ద విడుచుటయు, వ్యాఘ్రమువివరంబున విడిచి వచ్చుటయు నొక్కటియే [ఇట్లని యాతఁడత్యుచ్చహాసముఁ గావించును]

కాబ్లేష్—(స్వగతమున)—సమయంబో సుసమయము కాబ్లేషుకు కొంచెము నఫా (లాభము) ముట్టుగాక! బహుత్ ఇనామ్ మిలేగా [గొప్పబహుమానమును దొరకును]

దుర్గాదాసు—మంచిది! నేను మడియుట కరుగుచుంటిని! కాని, శంభుజీ! నీతోఁ నొకమాటఁ జెప్పిపోయెదను! దానిని జ్ఞప్తియందుంచుకొనుము. నీకుఁగూడ నొకప్పుడిట్టియవస్థయే యీ కాబ్లేష్ ఖాను కరమందేఁ బ్రాపించును! ఇప్పుడైన శ్రేయము నభిలషింతువేని, సురాపానము మానుము! నారీ జాతిని సమ్మానింపుము! మఱి, యీ కాబ్లేష్ఖానును విశ్వసింపకుము!

శంభుజీ—అనుచరు లనుగమించ బద్ధహస్తుండైన దుర్గాదాసు నిష్క్రమింతురు.

పటపరివర్తనము=Change of scene.

## సప్తమ దృశ్యము

అహమదునగర ప్రాసాదము—అంతఃపురాగారము.

రాత్రి కాలము.

గుల్నేయార్ సామ్రాజ్ఞి యేకాకినియై, అగదియందుఁ బచారి చేయుచుండును.

గుల్నేయార్—మేమీ దాక్షిణాత్యమున కరుదెంచితి మేమి యుద్దేశ్యమున? అక్బరును బట్టుకొనుటకును, విజాపుర గోల్కొండలను (Bijapur and Golconda) స్వాధీనపఱచుకొనుటకును, మహారాష్ట్రుల దమనమొనరించుటకును, ఔరంగజే బిచటి కరుదెంచెనని లోకులు తలంచుచుండిరి—వారలు మూర్ఖులు. చిరు చక్రంబులు పెక్కులు ఘూర్ణిల్లి పోవుచుండెను; కాని, యీ ఘూర్ణిత చక్రముల ద్రిప్పుచున్న దిచటఁ గూరుచున్న నేను— నే నాలస్యమునకు తర్జనిఁ ద్రిప్పకున్న, దుర్గాదాసక్బరులును, విజాపూరు శంభుజీలును కలసియైన ఢిల్లీ సమ్రాట్ప్రాసాద రాజిని దాక్షిణాత్యమున నొప్పుకొని రాలేకయుండుదురు!—ఎట్టి ప్రభూత శక్తి నట్టిమిత హస్తముల [Liberal hand] నపవ్యయ మొనరించుచుంటిని! సాగరా! (ఒక పరిచారిక)

సుర—దుర్గాదాసా! దుర్గాదాసా! నేను నిన్నెట్లు ప్రేమించుచుంటినో,—యెట్టి మధురతిక్త, యుత్తప్తశీతల, తీక్ష్ణకోమల

ప్రవృత్తి [A desire which is at once sweet and bitter, hot and cold, sharp and soft: Figure Oxymoron] నాయంతరమందీవు యుదయింపఁజేసితివా?,—యెట్లు నీకొఱకై సమస్త మొగలు సామ్రాజ్యమును పూర్వోత్తరమునుండి దాక్షిణాత్యమున కెద్చుకొని వచ్చితినో, నీ వెఱింగితివో, నిన్నెట్లు ప్రేమించియుందునో!— సాగరికా! [Servant-maid]

సురి—(పరిచారికి యనుదెంచి, యామె కరయుగళమందు సురాపాత్ర మిడును. ఆమె మధుపానమొనరించును.)

గుల్నేయూరు—(నిర్లక్ష్యమునఁ బాత్రనుపాఱవైచి)—ఆహా! ఏమి పిపాస! దుర్గాదాసూ! నేను సురాపాన మభ్యసించితినేలనో యెఱుంగుదువా?—దుర్గాదాసూ! నీవు నేఁడు నన్నుఁ గాంచినయెడల, నన్ను గుఱుతింపఁగలుగుదువో లేదోయని శంకించుచుంటిని! నేనతిశీఘ్రముగ నెదిగితిని! ఈ ప్రవృత్తిమహాజ్వాల యెట్టిది! —ఎట్టిదుర్గమపియవేగము! ఎట్టిసుధురోత్పీడనము!

[ఔరంగజేబు ప్రవేశించును.]

ఔరంగ—ప్రేయసీ!

గుల్నేయార్—ప్రభూ! వందేగి (జోహారు).

ఔరంగ—ప్రియూ! మంచివార్త! దుర్గాదాసు పట్టువడెను.

గుల్నేయార్—వట్టిమాట! పరిహాసముచేయుచుంటివి!

ఔరం—పరిహాసముకాదు ప్రియూ! సత్యము! కాబ్లేష్‌ఖాన్ వానిం బట్టి నాకడకుఁ గొనివచ్చెను! ముప్పదివేల స్వర్ణముద్రలను వానికి బురస్కారముగ నొసంగితిని. అంతియకాక, శంభుజీనికూడ బట్టియిచ్చినచో ఆ పైకమునకుఁ బదిరెట్లు సొమ్మును బహుమానముగ నొసఁగెదనని వానికిఁ జెప్పితిని.

గుల్నేయార్—సత్యమే!—నాథా! నాకీవు నిక్కంబుగు ప్రేమఁ

జూపుచుంటివని నే నిన్నాళ్లకు గ్రహింపఁ గలిఁగితిని! దక్షిణసీమ ప్రయాణకష్టమిన్నిదినములకు ఫలించెను! మనరాక యిప్పటి సార్థకమయ్యెను!

ఔరంగ—కాని,—పత్నీ! నీవు సురాపాన మొనరించితివా?

గుల్‌నేయార్—అవును సురాపాన మొనరించితిని. దుర్గాదాసు మనకుఁ బట్టుఁబడినకతన, సంతోషచిహ్నముగ నిప్పుడే మఱొక పాత్ర సురను గ్రోలెదను—సాగరికా!

ఔరం—ఏమి!—సురాపానము నా ప్రాసాదమందా?

గుల్‌నేయార్—[సగర్వముగ లేచి నిలువంబడి] అవును! సామ్రాట్టూ! అంత కంగారు పడుచుంటివేల?

ఔరం—నేను సురాపాన విరోధనని యెఱుంగుదువా?

గుల్‌నేయార—నీ వట్టే కావచ్చును. నేను కాను!

ఔరం—నీవు కావా?—నీవు మునల్మాను ధర్మదీక్షితవు కావా?

గుల్—అది నా యిచ్ఛ! ఇష్టమైన నే నీమతమును విడిచియైన పెట్ట గలను!—ఇఁక మతమందువా?—మతమునను సరించి మసలుటకు నేను తయారుగాలేను! సామ్రాట్టూ! నా వైపున కొక్కమాఱు తిరిగిచూడుము! ఈ సుగోళ కోమలబాహుయుగళమును వీక్షింపుము! ఈ సుదీర్ఘ ఘనకృష్ణకేశదామమును విలోకింపుము! ఈ తరళస్వచ్ఛస్వర్ణాభవర్ణమును కన్నులారఁ గాంచుము! ఈరూపము మసీదులోఁ బాచ్చి, తలఁబగులఁ గొట్టుకొనుటకై నిర్మింపఁ బడెనా?—నీవు గొప్పధార్మికుండవు! మునల్మాను మతాభిమానివి! ఆచారపరాయణుండవు! నిష్ఠపరుండవు! అట్టి నీవు నన్నుఁ బరిణయమాడక ఆచారపరాయణురాలైన యొకవృద్ధాంగన నేలబెండ్లి గావించుకొనలేదు?

ఔరం—గుల్‌నేయార్! నీవే మనుచుంటివో, నీ వెఱుంగకున్నావు.

గుల్‌నేయార్—ఎఱుంగ కేమి? బాగుగ నెఱుంగుదును.—సరే దాని కేమికాని, దుర్గాదా సెక్కడ?

ఔరం—దిలీర్ఖానుయొక్క రక్షణమందు.—ఆతని కెట్టిదండన విధించు టుచితమో తోపకున్నది. ముందు—

గుల్—ఆతని కెట్టిదండనయు విధింపవలదు. వానిని విడచి వైచుము.

ఔరం—అదే మట్లనుచుంటివి!—అది సంభవమా?

గుల్—సంభవము కాకేమి! సంభవమే! అట్లని నీ వెఱుంగకపోవు. కాని విడచినమాత్రము పెట్టఁదలఁచుచుంట లేదు! నాతోఁ గాఁ రాగార మునకు రమ్మా. దుర్గాదాసును విడచివైచుమని నేఁ జెప్పెదను— —నీవప్పుడు నీస్వహస్తములతో వానిని విడచివైచుము!

ఔరంగ—నీ వేమనుచుంటివో యెఱుంగవు! ప్రకృతిస్థవుకమ్మా. నీ వత్యధికముగ సురాపాన మొనరించితివి! ప్రకృతిస్థవుకమ్మా! (Come to yourself).

[సామ్రాట్‌నిష్క్రమించును]

గుల్‌నేయార్—మంచిది! నేను ప్రకృతిస్థనగుచుంటిని. దుర్గాదాసూ! నిన్ను నేనే స్వహస్తములతో విడచివైతును. అట్లొనర్చుట నా కెంత గౌరవము! నేను నిన్ను స్వయముగ విడిపించివైచి, యనురాగపురస్సరముగ నిన్ను నా యారామ్మునకుఁ జేర్చుకొని, నీమోహామృతము నాప్యాయనంబుగఁ గ్రోలి తనివితీర నీ సుందర గండతలంబులఁ జుంబించిచుంబించి, నాయవ్యాజప్రేమను నీకు ధారవోసెదను! దుర్గాదాసూ! చిత్తజరూపా! నేను నిన్ను ఢిల్లీ సింహాసనమున నాసీనుఁగావించి, నీ పార్శ్వంబున నుపవిష్టనై, నీసామ్రాజ్ఞినగుదును!—అదెట్టిసమ్మానము!—ఇక నౌరంగజీబో ఔరంగజీబూ! నీవు నా ముష్టిమధ్యమందుంటివి! నిన్నుఁ గ్రిందఁ బడఁద్రోయు టెంతపాటిది!—దుర్గాదాసూ! నీ సర్వాపరాధము

లను మన్నించివైచితిని! ఇంతకన్నక, తీవ్రరాగానలజ్వాలచే నన్ను జ్వలించివైచితివి! నా హృదయపంజరమునుండి ప్రవేశింపక, సాంద్రగహనసీమలందును, భయంకర పర్వతప్రదేశములందును, గభీరోపత్యకాభ్యంతరములందును, నన్ను నీవెనుకవెనుకల బర్విడఁజేసితివి;—నీ కొరకు యెన్నిటిని సైరించివైచితిని! దుర్గాదాసూ! నేఁడు నీ సర్వదోషముల క్షమించివైచితిని!—ఆహా! నేఁడెట్టి దినము! ఎట్టి యుత్సాహజనకసమయము? ఎట్టి యానందము! ఎట్టిమోహగము! ఎట్టి సౌఖ్యము!—మోహనాంగా! మనోజరూపా! ఆయతబాహో! తప్తకనకాంచితవస్త్రా! ఇంద్రాయుధా! ప్రభాకరతేజా! రమ్ము! మనోభవబాణాఘాతముల నే నిఁక నోర్వఁజాలను! నేను నీ దానను! సమస్తమహీరాజ్యసహితంబుగ నీవు నన్నేలుకొనుము! రమ్ము! నీ రొమ్మును నా రొమ్మునఁ జేర్చుకొమ్ము! సుందరా! ఇఁక తడవు సేయకుము!—ఆహా! ఎట్టిహాయి! సౌఖ్యము! మోహము! ఆలింగనము! నాకము! దుర్గాదాసూ! ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా!! ప్రాణేశ్వరా!!!

[ఉద్భ్రాంతభావమున కరములసాచి విభ్రమించును]

## అష్టమదృశ్యము

శిబిరకారాగారము—గభీరరాత్రి

దుర్గాదాసు శృంఖలాబద్ధుఁడై యుండును.

దుర్గాదాసు—తుదకిట్టి ప్రాపించెను. ఏ యవమానమెన్నఁడు విజాతీయులును, విధర్ములునైన శత్రులవలనఁ గలుఁగలేదో దానిని నేఁడు స్వజాతీయులును, స్వధర్మలునైన హిందువుల వలన బడసితిని!—శంభుజ! మహారాష్ట్రులెన్నఁటికైన రాజపుత్రులను

ముసల్మానులను యొక్కమాఱే పదదలితులఁ గావించివైతురని తలంచుచుంటివి! అట్లైనను, అది దుఃఖజనక ఘటనకు కానేరదు! కాని, అట్లు కానేరదు!—అట్టులు జరుగదు! ముందొకప్పుడు మహారాష్ట్రులును, రాజపుత్రులును, ముసల్మానులుకూడ నొక్కమాఱే యేరేని యన్యజాతీయుల పదతలమునందుఁబడి పొరలాడుదురు! ఆ దృశ్యమును నీవు గాకున్న నీ సంతతి వారైనఁ గాంచగలుగుదురు! (History testifies to the truth of Durgados' Prophecy) విశ్వాసఘాతకతకు శాస్తి యుండి తీఱును.—ఎవరు! ఎవరైన కారాగారద్వారమును దెఱచుచుండిరాయేమి?

(సర్వాలంకారవిభూషితయై సుందరవసనధారిణియైన గుల్ నేయార్ కారాగారమునఁ బ్రవేశించును)

దుర్గాదాసు—ఇదేమి యపరూపాలంకారము! ఇదేమి సౌందర్యజ్యోతి! ఎవరుమీరు?

గుల్ నేయార్—నేను బేగమ్ గుల్ నేయారును!

దుర్గాదాసు—బేగమ్ గుల్ నేయారా!

గుల్ నేయార్—దుర్గాదాసూ! గుఱుతింపఁజాలకుంటివా? మనల కిరువురకింతకుమున్నొకమాఱు సమావేశమాయెను. అపుడు నేను నీ కరములందుఁ బందీనై యుంటిని. నేఁడు నీవు నా కరతలములందు బందీవై యుంటివి!

దుర్గాదాసు—తామునాకు శిక్షవిధింపసరుదెంచితిరా?

గుల్ నేయార్—కాదు; నేను నిన్ను ముక్తుఁగావింపవచ్చితిని.

దుర్గాదాసు—ప్రత్యుపకారరూపంబుగనా?

గుల్ నేయార్—కాదు!

దుర్గాదాసు—అట్లైన సామ్రాట్టుయాజ్ఞాపాలనమొనరించుటకా?

గుల్ నేయార్—బేగమ్ గుల్ నేయార్ సామ్రాట్ యౌరంగజేబుయాజ్ఞ

నుపాలింపదు. బేగమ్ గుల్ నే హూర్ యాజ్ఞనే సామ్రాట్ యౌరంగజే బింతకాలము పాలనమొనరించుచు వచ్చుచుండెను!

దుర్గాదాసు—అట్లైన మీయాగమనమునకు హేతువేమి?

గుల్ నే హూర్—దుర్గాదాసూ! నిన్ను కారాగృహమునుండి విముక్తుం జేయుటకే నేనరుదెంచితిని. ఏలనన నీవునా ప్రాణేశ్వరుండవు!

దుర్గాదాసు—[చకితుండై]—ఇదేమి పరిహాసము?

గుల్ నే హూర్—నేను,—భారతసామ్రాజ్ఞి గుల్ నేహూర్ నగు నేను, నిన్ను—ఒక సామాన్య రాజపుత్ర సేనాధిపతి మాత్రుండవగు నిన్ను, 'ప్రాణేశ్వరా' యని పిలచినందులకు నీవు మిక్కిలి యక్కజపడు చుంటివి కాబోలు! అవునది యాశ్చర్య పడ వలసిన విషయమే! కాని నేను సాధారణ నారి చూపునకార్యము సలుపు దానను కాను! సామ్రాజ్ఞినయ్యు, సామాన్యసేనాధిపతి నొకని 'నీవు నా ప్రాణేశ్వరుండ' వని యెట్లు నే నక్క జగంబంగికైన బల్కంగలిగి యుందురా? కాని, నా ప్రవృత్తి యత్యద్భుతమైనది! సాధారణమైన దానిని, సామాన్యమైన దానిని సామ్రాజ్ఞి గుల్ నేహూర్ వాంఛింపదు! సైంధవమును స్వారిచేయుతఱి, రశ్మి నామె సడలించివైచును; సామాన్య, సంయత, పరిమిత మానందము నామె యభిలషింపదు. అశీమోచ్ఛృంఖల రాజత్వమే యామె వాసస్థానము! [Empress Gulneyar doesn't like what is simple and ordinary. She puts premium on unrestrained ecstasy! Extremes she loves but not what is mediocre and simple.]

దుర్గాదాసు—కాని—సామ్రాజ్ఞీ—

గుల్ నేహూర్—వినుము. నా మాట కడ్డురాకుము. నేం గావించు నదంతయు నత్యద్భుతముగ నుండును! ఈ ప్రకాండ మొగలా

మ్రాజ్య మొక ప్రకాండవిస్మయము కాదా?—ఆ విస్మయము నా సృష్టి! ఈ సామ్రాజ్యము సామ్రాట్టుయొక్క హస్తాక్షరంబే యయ్యు, రచననాయది! నాకనుమాత్రమున నే యౌరంగజేబు సామ్రాట్టై యుండెను!—పరిపాలన మొనరించుచున్న దీగుల్ నే యార్ సామ్రాజ్ఞియే! నా తర్జనియుత్తోలనమున సామ్రాజ్యము దుసమరోత్పన్నమగును; నాయభయదానంబున సామ్రాజ్యమున శాంతిస్థాపనమగును! నాకస్మితసృష్టిమాత్రంబున నొకానొక రాజ్య ముత్థానమగును; నాభ్రుకుటిక్షేపమున నొకానొక రాజ్యము పతనమగును! బహువర్షము నిస్పృశకుహీమంబుతో సహీరాజ్య చక్రింబుఁ ద్రిప్పుచుంటిని! అస్మదాజ్ఞకతననే సామ్రాజ్యమం దిట్టి యద్భుతపరిస్థితులు తోఁచుచుండెను!—ఏ నాఁడు నీ కరములందుఁ బందీనైతినో యానాటి యవస్థ నియతికఠోరవిధానమంచు మాలిఁ దాల్చితిని—ఏ నాఁడవు సమ్ముఖమందు నే నింత దనుక మస్తకమును నతమొనరింపలేదు. నీ కరములందుఁ గైదీనైన ముహూర్తమునఁ దే నా మోహంపుసృష్టి నీ పయింబడెను! కాని, తాను బందీయైయున్నప్పటికి, నీ ప్రేమ భిక్షవేఁడుట కుద్యుక్తయగుటకు, గుల్నేయారు యొక్క ప్రవృత్తి యంత చులకనైన యుపాధానముతో (Clement) గఠితమై యుండలేదు. నేఁడు నీవు నా బందీవి. ఇదియే నా ప్రేమజ్ఞాపనకుఁ దగుసమయము—దుర్గాదాసూ! నా చిత్తము నీ యందు హత్తియున్నది!

దుర్గా—బేగమ్సాహేబూ! మీరు రేఁగుచుండిరో ప్రాయశః మీ రెఱుంగకున్నారు!

గుల్నేయార్—దుర్గాదాసా! నీవు సామ్రాట్టునకు వెఱచుచుంటివా యేమి? రమ్ము!—సామ్రాట్టు నా దాసుండని యెఱుంగఁగలవు; నేను వానిదాసిఁ గాను. నిన్న ఢిల్లీ సింహాసనమున నాసీనుఁ గావిం

చెదను—నమ్మా!

దుర్గా—బేగమ్ సాహెబా! క్షమింపుఁడు! దుర్గాదాసునకు మాతృభూమి భారతభూమియైయుండ, సమస్త పృథ్వికైన సామ్రాట్టు కాఁగోరను!

గుల్‌నేయార్—సామ్రాజ్య మక్కఱలేదా?

దుర్గా—మాతా! నా కక్కఱలేదు!—పుత్రుని నన్నుఁ జేసి తాము తిరిగి పొందుడు.

గుల్‌నేయార్—ఏమి! నీకు నేనుఁ గూడ నక్కఱలేదా! నిరుపమాన సౌందర్యోపేతమైన సామ్రాజ్ఞిఁ బొందుటఁ గూడ నీ వపేక్షింపవా?

దుర్గా—[శివశివయని చెవులుమూసుకొని] అమ్మా! తా మట్లు వచింపకుఁడు! 'పరదారాన్ మాతృవత్' యని తలంచు దలంచి రాజపుత్రులు పరకాంతలను మాతలుగా భావింతురు. తాము తమ మానమును గాపాడుకొనఁజాలకున్న, నేను గాఁపాడెదను.

గుల్‌నేయార్ కుణాకాముస్తభిన్నయై, మాటలాడనేరక విలువంబడిపోయెను. ఆమె నయనాంతరములనుండి బాష్పస్రోతము ప్రవహింపసాగెను; తానాలోచనచేఁ డెనో లేక స్వప్నమందుండెనో! ఆమె యెఱుంగఁజాలకుండెను. పిమ్మట నామె యిట్లనెను:—

“దుర్గాదాసూ! నీవు నాకొఱకు,—యెవరికొఱకుఁ గాదు—నీ చేతు లందు నాహృదయ సామ్రాజ్యమునుంచుచున్న, ప్రత్యాఖ్యాన మొనరింతువా?”

దుర్గాదాసు—భారతసామ్రాజ్ఞీ! ఎనిమిది నూఱు ఔరంగజేబులు ఈ పృథివిని తొలంగి జేయుచున్నారు! దుర్గాదాసులూ యున్నారు! (Figure Metonomy)

గుల్‌నేయార్—ఏమి నీ బింకము!—దుర్గాదాసూ! దీని ఫలమెట్లు తేలునో యెఱుఁగుదువా?

దుర్గాదాసు—ఎఱుంగుదును—మృత్యువే దీని ఫలము!

గుల్‌నేహార్—దుర్గాదాసా! నీవు పరిహాసము జేయుచుంటివి!

దుర్గా—జీవనమునం దెంతకును నెక్కుడు గంభీరభావమును నెన్నఁడు ప్రసంగించి యుండలేదు!

గుల్‌నేహార్—ఏమీ! నీవు నా కుటుంబమునకు ద్రోహివై యుంటివా? ఎట్లు చెప్పినను, నా వాంఛను పూర్ణము సల్పఁ నీ వియ్యకొనవా? ఏమీ! ఏ నిర్ఘృణ్యభావము!—దుర్గాదాసా! గుల్‌నేహార్ నతజానువయై ప్రేమభిక్ష వేడినను, ఆశీర్వాదము పదువునఁ బరిణయ వితరణమొనరింపు మనియు ముందే జెప్పియుంటిని—మంచిది! ఇపు డేమికోరుదును! భువనోన్మోహినియైన గుల్‌నేహార్ సామ్రాజ్ఞియా లేక భయంకరంబగు మృత్యువా?

దుర్గా—భయంకరంబగు మృత్యువే!

గుల్‌నేహార్—మరియొకమారు ప్రశ్నించుచుంటిని—భువనోన్మోహినియైన గుల్‌నేహార్ సామ్రాజ్ఞియా, లేక భయంకరంబగు మృత్యువా?

దుర్గాదాసు—భయంకరంబగు మృత్యువే!

గుల్‌నేహార్—మూఁడవమారు, కడపటిపర్యాయము నడుగుచుంటిని: —భువనోన్మోహినియైన గుల్‌నేహార్ సామ్రాజ్ఞియా లేక భయంకరంబగు మృత్యువా?

దుర్గాదాసు—భయంకరమగు మృత్యువే!

గుల్‌నేహార్—భయంకరమగు మృత్యువే కావలయునా? మంచిది, నీకదే ప్రాప్తించును!—ఇప్పుడే నీతల తరవారి కెరయగును! ఈ ముహూర్తమందే నిన్ను దండధరుపాలి కంపుచుంటిని!!—గుల్‌నేహార్ కడ నొక్కటే బడయుదువు—అయితే ప్రేమ, లేకున్న ప్రతిహింస! ప్రేమ యొక్కటిలేనిచో, ప్రతిహింస,

స్వయం యీశ్వరునకే వెలువఁజాలని గ్రాతఁడు సాధుతయొక్క-యభేద్యవర్మంబుచే నాచ్ఛాదితుండై యుండెను! నీవు తుచ్ఛజీవివి!—పాపియవు!—విరజా!—నన్నేమియు పిలువఁ దలంపకుము. అంతయు వింటిని!—(ప్రసన్నాత్ముఁడై దుర్గాదాసు ప్రేమాలకరిగి కరములు జోడించి)—దుర్గాదాసా! మహాపురుషా! నీవు మహాత్ముండవని యెఱుంగుదును! కాని, యిట్టి మహాత్ముండవని స్వప్నమందైన దలంచియుండలేదు!! పాపిష్ఠుండనైతిని. పావనుండనైతిని!! (అని యాతఁడాకస్మికముగ దుర్గాదాసు పాదంబులపై బడి, తత్పదపద్మముల నేత్రములు కద్దుకొని లేచి)—మహనీయగుణగరిష్ఠా! విశేషంబు పలుకఁజాలను! స్వహస్తంబులతో నే నిప్పుడు నిన్ను బంధవిమోచనం గావించుచుంటిని! [బంధనములను విప్పివైచి]—మహాభూమీ! వెలుపలకు రమ్ము!—నా నిజసర్వోత్కృష్టహయమును నీ కొసఁగుచుంటిని. పంచవేలయశ్వారోహకుల నీకుఁ దోడిచ్చుచుంటిని! స్వీయసీమకు మగుడి చనుము!—నా యాజ్ఞచే నే మొగల్సేనానియు నీ కేశమునైన స్పృశింపఁడు!—శూరా! రమ్ము!—ఎందేని బేగమ్‌సాహెబ్!
[దుర్గాదాసు కరంబు బట్టుకొని దిలీర్ఖాను నిష్క్రమించుచున్నాడు.]

గుల్‌నేహార్ కాంబఖ్షులు ప్రస్తరమూర్తులంబలె నిలువంబడి యుందురు.

[It is impossible to find a parallel to Durgadas in the annals of the world. Sarangadhara and Pravarakhya indeed evinced the same adamantine spirit as that we find in our hero in resisting the sweet kisses of Temptation. But round Sarangadhara and Pravarakhya is gathered much of poetic fiction. To compare our immortal hero with them is therefore idle and absurd. Durgadas a man of many parts stands unique in the vistas of History spreading the aroma of ineffable purity over all countries in all ages! Oncemore I say, Bravo! Durgadas!]

[ఈ సమయమున సస్మితాననుండై కాబ్ లేష్‌ఖాను ప్రవేశించును].

అక్బరు—ఎవరు?—కాబ్లేష్‌ఖానా! శంభుజీ యెచట?

కాబ్లేష్‌ఖాన్—ఇంకా శంభుజీ యేమి?

అయ్యా శంభుజీ పని యీలా అయినది [పతనభంగిని చూపును.]

**(Showed the sign of fall)**

అక్బరు—అదేమి?

కాబ్లేష్—ఉగ్గిన కట్టెను బిందెవలె తాగాడిమీద నుంచి గభాలున— అహాహాహా [పకపక నవ్వును.]

అక్బరు—నూతిలో బడిపోయెనా? నను కొక్కెన యున్నది సాంబోలునే!

కాబ్ లేష్—అయ్యా! కాదు. శంభుజీ పట్టు పట్టినాడు! వెట్టినాయన యిపుడు నీ బాబు శిబిరములో పడియున్నాడు. చేతులకు— [బంధనావస్థ చూపును.]

అక్బరు—అదేమి!—అది యసాధ్యము!

కాబ్ లేష్—అసాధ్యము గిసాధ్యము యేమీ లేదు! అయ్యా! నేను చెప్పినదానిలో యేమీ తొక్కు లేదు!—అంతా నిజం—నిజమంటే నిజం!—యిపుడు మీ త్రోవేదో మీరు చూచుకోవచ్చును.

అక్బరు—ఏమి! నీవు చెప్పినదంతా నిజమేనా?

కాబ్లేష్—[తలయూపి]—అచ్చం నిజమే! అయ్యా! కాబ్లేష్‌ఖాను అబద్ధం యెప్పుడో కాని చెప్పడు. శంభుజీగారు సంకెళ్ళు తొడుక్కొని కూర్చున్నారు. ఇప్పుడు మీ రేం చెయ్యతల్చుకున్నారో స్థిరం చేసుకోవాలి! మీ మొగము తెల్లగా మసిబొగ్గయిపోయిందేమి బాబయ్యా? [అక్బ రూరకుని యుండును.]

కాబ్లేష్—అయ్యా! వినండి! నా సలహా వినదల్చుకుంటే,—మీరు నా వెంటబడి సాగ్రమాట్టు దగ్గరకు రండి!

అక్బరు—[మ్లానహాసనము సలిపి]—సాగ్రమాట్టుగ్గఱకా? అంత

మొనరింప దుర్గమునుండి బాహిరమున కరుదెంచెనా లేదా?—సత్యము వచింపుము; మిథ్య చెప్పి తప్పించుకొని పోఁజాలవు.

కాఁబ్లేష్—[గజగజ వడంకుచు]—బాబయ్యా! అవునండి! క్షమించండి!

దుర్గాదాసు—సుజీ నీవు ముందా వార్తను సమూరు యజీమునకుఁ దెలిపితివా లేదా? తరువాత సమూరు యజీ మైదువందల మొగలు సేనానులు వెంటఁ గొనివచ్చి, మహారాజును బందీ గావించెనా లేదా?—ఏమను చెదవు? ఇది నిజమా కాదా?

కాఁబ్లేష్—అవును బాబయ్యా!—[పలాయనోద్యతుఁడగును.]

దుర్గాదాసు—భగోమాత్! [పోకుము!]—

[ఇట్లని దుర్గాదాసు కాఁబ్లేష్‌ఖాఁన్ గళంబుఁ బట్టుకొని, గంభీర స్వరమున—"దుర్మతీ! యల్లాను స్మరించుకొనుము!" మనును]

కాఁబ్లేష్—బాబయ్యగారూ! బాబయ్యగారూ! క్షమించండి! రక్షించండి!! రక్షించండి!!! నేను మీ బంటునండి! [ఇట్లని యాతఁడు భయవిహ్వలుండై, కంపితకాయుఁడై దుర్గాదాసు చరణద్వంద్వమును గట్టిగఁ బట్టుకొనును]

దుర్గాదాసు—పొమ్ము. నిన్ను వధింపను. నా హస్తమును నీ హత్యచేఁ గళంకితము గావింపను. ఇహకాలమందును, పరకాలమందును కూడ నీవు శంభుజీని [illegible]తుఁ గావించివైచితివి! నరకమందుఁగూడ నీకు తావులేదు—పొమ్ము—[ఇట్లని యాతఁడు కాఁబ్లేష్‌ఖానును దూరంబుగఁ దన్నివైచును. కాఁబ్లేష్ లేచి, కుంటుచు, నత్తావునుండి వెడలిపోవును]

దుర్గాదాసు—[అక్బరు నుద్దేశించి]—షాహజాదా! ఒకనాఁడు నేను శంభుజీ నుద్దేశించి 'కుసురానాగుతే నిన్ను సర్వనాశకూపమందుఁ బడఁద్రోయుననియు 'ఆసర్వనాశసాధనము నీకాఁబ్లేష్‌ఖానే గావించు' ననియుఁ జెప్పియుంటిని. తుదకాతని కట్టిగతియే ప్రాప్తించెను!—

దుర్గాదాసు—షాహజాదా! వినుమా! నా వెంట మార్వారునకు రండు—నేను జయించి యున్నంతకాలము మీ కెట్టి భయము లేదు—రండు?

అక్బరు—దుర్గాదాసా! నేను మార్వారునకు రాను. మృత్యుపాలగుదును. మహాత్మా! నేను నీ కపరాధుండనై యుంటిని! నీకు విశేష క్లేశము నొసంగితిని. క్షమింపుము. నన్ను రక్షింప నీవు, స్వదేశమును, స్వజనమును విడిచితివి! నాకొఱకు నీవు నీ ప్రాణముల కొడ్డితివి. నిజప్రాణములఁ దుచ్ఛ మొనరించి [illegible] సంసిద్ధుఁడ వైతివి!

దుర్గా—షహజాద్! అట్లొనర్చుట నా ధర్మము! అది కర్తవ్యము [illegible]మే!

అక్బరు—కర్తవ్యమా! నేను మృత్యుముఖమున నున్నాను, ఏ కర్తవ్యమును పాలన మొనరింప నేరకుంటిని. [illegible] గావించితిని. సర్వకార్యములు మితిమీరి దుష్కృత్యములు చేసితిని; విలాసమందు మునిగియుండి రాజ్యకార్యము విడిచితిని! జనకునకు విద్రోహుండనైతిని; స్త్రీహంతకుఁడనైతిని; నాకొఱకై నిచ్ఛాపూర్వకముగ నీ కెంతేని యరిష్టముఁ గలుగఁ జేసితిని; తుదకు శంభుజీ మృత్యువునకు గారణమైతిని; దుర్గాదాసా! ఇఁక నేఁ బోయెదను! నా కొఱకై నీ వెంతేని శ్రమఁదీసుకొంటివి! కృపాళుండవై మఱొకించుక శ్రమఁ దీసుకొనుము—దయాళుండవై మఱొక యుపకారము చేయుము. నిజసీమకు మరలిపోయి నా ర[illegible] కాఁపాడుము. మహాత్మా! నా తనయను నీ కరములం దప్పన మొనరించుచుంటిని! ఆమెను గాచుభారమంతయు నీపై బడవైచుచుంటిని! ఇఁక నేఁ బోయెదను! సెలవొసఁగుము—[ఇట్లని యక్బరు దుర్గాదాసు కరంబులఁ బట్టుకొనును.] [తెరపడును.]

## ద్వితీయాంకము

జయసముద్రప్రాంతీరప్రాసాదము — సాయహ్నకాలము

జయసింహ కమలలు ప్రాసాదపార్శ్వయాగారమందు నిలువంబడి ప్రసంగించుచుందురు.

జయసింహ—కమలా! నీవు విచారింపవు కాకుము. నీ కొఱకే నేను దేశంబు విడచితిని, రాజ్యము విడచితిని, పుత్రులను విడిచితిని.

కమల—ఎవరు విడువుమని చెప్పిరి?

జయసింహ—నీవు.

కమల—నే నెన్నఁ డట్లుచెప్పియుండలేదు. పెద్దరాణి, చిన్నరాణియుం దెవర్తుక కావలెనో తామె కోరుకొనునే యేలుకొం డనిమాత్రము చెప్పియుంటిని. ఒక్కమారు తామువురపత్నులు నేల రాననియే నేఁ బల్కితిని.

జయసింహ—నేను సన్న్యసించుకొంటిని. పెద్దరాణిని వదలివైచితిని.

కమల—కాని, రాజ్యమును విడువుమని నేఁ జెప్పియుండలేదు. రాజ్యమును పెద్దరాణి పుత్రుఁ డనురసింహునకు సమర్పించి, యిమ్మని నేను వచింపలేదు. నా పుత్రుఁ డీ యంత పనికిమాలిన వాఁడా?

జయసింహ—ఓ! ఇంగితము కానివాఁడు పెద్దరాణికిని మగఁడము? కమలా! ఇట్లని యిరావతిలోని వేళ నోరు తెఱచి చెప్పితివి కావు? నిజమందు నీకు కమలాక్షిమా కలుగుటకు వెంటపడే పెద్దరాణి కలహకారణమా మేదినీ ప్రకాశమొసఁగలేదు. ఇపుడు నా కంతయుఁ దెల్లమయ్యెను—కమలా! రాజ్య మనురసింహునిది! కాని నేను నీ వాఁడను! అనురసింహుఁడు జ్యేష్ఠపుత్రుఁడు. శాస్త్రానుసారముగ జ్యేష్ఠపుత్రుఁడే రాజ్యాధికారి.

కమల—అట్లైన నా కంటె మీ శాస్త్రిమెక్కుడాయెనా?

జయసింహ—కమలా! ఒకప్పుడు నా కడ నన్ని శాస్త్రములకంటె నీవే మిన్నవై యుంటివి.

కమల—ఇపుడు మాత్ర మేలకాదు?—మీ మరణాంతర మన్నము కొఱకై నేను పెద్దరాణి గుమ్మముకడ భిక్షారిణినై యుండవలెననియా మీ యభిప్రాయము?

జయసింహుడు—[స్తంభితుఁడై, క్షణకాలము నిరవుఁడై యుండును] పిదప మెల్లగ] కమలా! నీ కింతభవిష్యచ్చింతకలదా? నాకెన్నఁడట్టి చింతయేలేదే!—అట్లైన నీ చింత నీ పుత్రునికొఱకు కాక, నీ కొఱకేనా?

కమల—రాణా! నిజచింత నంతగర్హితమైనా? నిజచింత యెవరికుండదు మహారాజా?

జయసింహ—ఎవరికేమి? నేనెన్నఁడు నాకొఱకు చింతించి యుండలేదు. నేను రాణారాజసింహుని పుత్రుండను. తలంచినంతనే యేమి కాలేకయుందును? సుఖ, మాన, విత్త, ప్రభుత్వములను విలాసంబు కొఱకై పరిత్యజించి, జాతిధిక్కారము నొసలఁదాల్చి నీకై నేను వనవాసినైతిని. భవిష్యముమాట దూరమునుంచుము. నేను నీ కొఱకు వర్తమానమునే విడచివైచితిని!

కమల—నాకొఱకే విడచివైచితిరా? లేక నారూపము కొఱకు విడచి వైచితిరా? మీరు నన్నుఁ బరిణయ మొనరించు కొనుట నా కొఱకుకాదు. నారూపంబు కొఱకు! నేను మిమ్ముఁ బరిణయ మాడుట మీకొఱకుకాదు. మీరాజ్యము కొఱకు!

జయసింహ—ఏమి! నా రాజ్యము కొఱకునన్నుఁ బెండిలి గావించు కొంటివా? నేను సరిగనే వినుచుంటినా? అట్లైన నేనింతకాలము స్వప్నము విలోకించు చుంటినా? నీ హృదయమును బడసితినని

యెయ్యెడ నేవలనునఁ గాంచిన నానావిధ సౌందర్యసుగంధసంగీతములు గానంబగునో, యెయ్యెడ నభహృదయమును భేదించి, సౌందర్యవృష్టిధారా దివారాత్రములు వీనిపై గురియుచుండునో, యెయ్యెడఁ బృథ్వీగర్భ, పుష్ప, ఝంకార, సౌరభములనుండి సౌందర్యోత్పన్న యజస్రశాంతము బయల్వెడలుచుండునో, ఆవిశ్వ సంసారమందు సౌందర్యముకొఱకు నీకడ కరుదెంచినదా? కమలా! నీయీసౌందర్యమేది! ఎందుండి వచ్చెను? ఎందేగెను?

కమల——ఇపుడు మీ యభిప్రాయమేమి?

జయసింహ——అభిప్రాయమా! —ఎఱుఁగను—మోహమంతరించెను!— కానిచాలయకస్మాతము——సమయమొసఁగుము——సౌందర్యము!— సౌందర్యము——బాహిర సౌందర్యము!——హృదయములేని నారీ సౌందర్యము——ఆహా!

ఈసమయమున ద్వారపాలకుఁడు ప్రవేశించి, యభివాద మొనరించి,——"మహా రాజా! రాజమంత్రి దేవకర్మసమయము వేఁచియుండె" ననెను.

జయసింహ——రాజమంత్రియా!——ఇపు డిచటికి కేలవచ్చెను!—— పోయి, వెంటనే లోనికిఁ దీసికొని రమ్ము.

[ద్వారపాలకుఁడు నిష్క్రమింపగనే జయసింహుఁడు కమల నుద్దేశించి పల్కెను——"కాని, యిన్నాళ్లీవెట్లు, యేయుపాయమున నీకదర్యచిత్తమును సుందరవదనమందు మూసియుంచితివి?—— నీ విట్టి కుత్సితవని నేఁగలనైనఁ దలంచి యుండలేదు. కమలా! నీవిఁక లోపలి కరుగుము. నీయెడల నాకెట్టి క్రోధములేదు. నీయుచ్చయాశ లన్నియు నిరాశలై పోయెను. నా యుచ్చయాశ లన్నియుఁ గూడ నిరాశలై పోయెను!——లోపలి కరుగుము."

కమల——[పోవుచు పోవుచు, స్వగతమున]——

ఉన్నదాని౯ గూడ౯ గోల్పోతి౯ గాబోలు!

[నిష్క్రమించును.]

జయసింహ——నీనిక్కొఱకే సామ్రాజ్యము౯ బరిత్యజించితిని!——లక్ష్మి స్వాహాపితిత్రైమై సరస్వతిని పీకి వచ్చితిని.——సరస్వతీ! ఇప్పుడు ప్రేమనశె నిన్ను౯ గొంచెము కొంచెము అనుభవింప౯ గలుగు మంటి——"ఇది ప్రేమకాదు. ఇది మోహము. ఎప్పటికైన ఇది యంతమొందక మానదు మానా౯ నీవు చెప్పనే చెప్పితివి. నీపలుకు సత్యమాయెను. అర్థాంగీ! నీ వన్నిసమయములందు సత్యమే పలికితివి. కాని, యీసత్య మన్నిసత్యములకంటె గొప్పమైనది!——[This truth is the truth of all truths!]

[మంత్రి ప్రవేశించును]

జయసింహ——మంత్రీ! రాజ్యవార్త లేమి?

మంత్రి——మహారాజా! నేను యిస్తాఫా (Resignation) యొసంగుటకై వచ్చితిని. [నేను నా మంత్రిపదమును త్యాగము నొసంగి వచ్చితిని.]

జయసింహ——ఏమి! మంత్రీ! ఏమి జరిగెనో తెల్పుము!

మంత్రి——ఏమిజరిగెనందురా? దేవరపుత్రులను నాకు౯ గాలిన యవమానము౯ బ్రసాదించెను. రాజకుటుంబమున నక్రోశించి చేసి, చేసి, నేను ముదుసలినైతిని. కాని యిట్టియవజ్ఞ నాకెన్న౯డు జరిగియుండలేదు.

జయసింహ——మీకేమి యవమానము జరిగెను?

మంత్రి——కుమారు యమరసింహుడు౯ డొక యున్మాద మత్తేభమును నగరములోనికి వదలివైచెను. కొందఱు పురవాసులా భయంకర హస్తిచే హతులైరి. అందుచే నేనాతనిం చుక గద్దించితిని. అప్పు డాతడు చరణదలిత భయంకర సర్పంబుచాడ్పున౯ జఱ్ఱున లేచి,

అనరాని మాటల నెన్నేనియుని నాముండమును పూర్తిగ ముండన మొనరింపఁజేసి, ముండమాడ్కిఁ గావించి పదంపడి నన్ను గార్ధభ పృష్టమున నుపవిష్టుఁజేసి నగరము చుట్టుఁ బ్రదక్షిణముఁ జేయించెను.

జయసింహ—ఏమి! ఆ కట్టిడి యిట్టిచెట్టకొడిగట్టెనా! నేను నిన్నుఁ దన యభిభావకుఁ (Guardian) గావించి వచ్చితినని యమరసింహుఁ డెఱుంగునా?

మంత్రి—ఆతఁ డది యెఱుంగునో యెఱుంగడో నే నెఱుంగను. ఇసుమంతయైన పితృభక్తి యాతనికున్న ట్లీకార్యమందును బ్రకాశము కాలేదు.

జయసింహ—నడువుము! ఎల్లినేను రాజ్యంబునకు మరలివత్తును. ఈ విషయమున యథావిహితము గావించెదను. ఇపుడు గృహంబులోని కరుగుదము రమ్ము.—[కమలతో జరిగిన ప్రసంగముజ్ఞప్తికి రాగా] నారీ! నారీ! ఇట్టి నటనసూపఁ గలవా!—అవును! ఇపుడు తెల్లమగుచున్నది—ఇపు డంతయుఁ దెల్లమగు చున్నది!

[మంత్రి సహితుఁడై జయసింహుఁడు నిష్క్రమించును.]

## తృతీయదృశ్యము

కోయేలా దుర్గశిఖరము—జోత్స్నాలోకితవిభావరి.

[రజియాసహితుఁడై యమరసింహుఁ డొక వేదికపై గూరుచుని యుండును.]

రజియా—రా కుమారా! జాబిల్లి యెంతసుందరముగఁ గన్పట్టుచుండెనో చూచితివా? చూడుమదే పూర్వదిక్కున నొక నల్ల మేఘము పైనుండి నయ్యామినీ నాథుఁడు మెల్లమెల్లగఁ బైకారోహించుచుండెను! మొగులు యంచులం దెవరో తరళస్వర్ణ రేఖను

చిత్రించివెడలిపోయెరి! అంబుధరముక్రిం దంతయుగాఢకృష్ణరాగము పూయబడియుండెను! శశధరుఁడు మేఘశిఖరపార్శ్వమునుండి మెల్లగఁ దొంగిచూచుచుండెను.—ఆహా! ఏమినిశీథిని! ఎంతస్నిగ్ధ మెంతశాంత మెంతస్థిరము! రాజపుత్రా! ఆదృశ్య మెంత యందము గ నున్నదో చూచుచున్నావా?

అజిత—లేదు. నేను కేవలము నిన్నే జూచుచుంటిని.

రజియా—అట్లైన నీవు చాల తప్పుగావించుచుంటివి! ఈవిశ్వమందు నల్వంకల నిట్టి యద్భుతదృశ్యములుండ, వాని నన్నిఁటిని వదలి, నన్ను విలోకించుచుంటివా? ఆహా! ఈ పృథివి యెంతసుందర మైనది! ఈజగతి యొందు యత్రశాంత, యనంత, యవారిత, సంగీతమువలెఁ దోఁచుచుండును. ఈనీలిమ దాని యనులోమము; ఈశ్యామలత దాని విలోమము; ఆలోకమందు దాని గ్రహము; అంధకారమందు దాని సమము; పర్వతపర్వతములందు దాని న్యాసము; తరంగ తరంగములందు దాని మూర్ఛన! రా కుమారా! ఈ పృథివి యందె మెంత యద్భుతమైనది!

అజిత—నా కన్నిదృశ్యములకంటె నీ ముఖమే యందముగఁ దోఁచుచున్నది.

రజియా—ఏమి! అన్నిదృశ్యములకంటె నా ముఖమే నీ కందముగఁ దోఁచుచుండెనా? నాయీానన మఫరిస్ఫుట గులాబిసుమ వ్రీడారక్తమదృష్టికంటె నధిక సౌందర్యముగ నున్నదా? [Does my face appear more beautiful than the red mellow, half-blossomed rose just bashfully opening its eyes?] వేలావిలీనలహరీలీల కంటె నది యధిక సుందరముగ నుండెనా? [Does it appear nicer than the rhythmical commingling of the ripples with the margin of the main?] కృష్ణ మేఘాంత రిత శరశ్చంద్రుని కంటె నది యెక్కు డందముగనుండెనా?

[Does it look more charming than the Lamp of Heaven that sprinkles its silver light within the vaults of the cloudy mansions?] — [The above passage brimful with poetry reminds us the blind Puritan poet whose match-less pen exposed the bright vistas of poetry in his prose. Such prolific imagination can also be found in the great Keats and the immortal Shakespeare. It is such prose, radiant with the jewels of Muse and not the stale, sterile grub-street doggerel that embellishes literature and that merits the manipulation of Play on the Stage].— రాకుమారా! నీవింకను బాలుఁడవనుటంజేసి, ప్రకృతిమహిమ నెఱుఁగకున్నావు. ప్రకృతి సౌందర్య మద్భుతముగాదా!

అజితసింహు.—నేనింక బాలుండను కాని కారణముననే ప్రకృతి సౌందర్యముకంటె నీసౌందర్యమే యెక్కుడద్భుతమైనదని యెఱుంగఁగలుఁగుచుంటిని! బాలా! జగతియొక్క శ్రేష్ఠసౌందర్యము నారి యని యిప్పుడు గ్రహించుచుంటిని!! మఱి నారియొక్క శ్రేష్ఠసౌందర్యము నీవు!!!

రజియా.—నేనా! నేనది విశ్వసింపను.

అజితసింహ.—సుందరీ! విశ్వసింపక పోవుటకు కారణము నీవు నన్ను ప్రేమింపకపోవుటే!

రజియా.—ప్రేమింపకపోవుటా? రాకుమారా! ప్రేమ యననేమో యెఱుంగను; కాని, యెవనిఁ బ్రేమింపనగునో వానిని సర్వదా గాంచ వాంఛగలుఁగునో, వానిఁ గాంచినంతనే, వాని కంఠస్వరము వినినంతనే హృదయ తంత్రి మ్రోగుచో నిక్కముగ నిన్నుఁ బ్రేమించుచుంటినని ముమ్మాటికి చెప్పఁగలను!

అజితసింహ.—కనకాంగీ! నన్ను నిక్కముగఁ బ్రేమించుచుంటివా? సత్యమే వచించుచుంటివా?

రజియా—నే నబద్ధమాడుట లేదు.
అజితసింహ—ప్రాణాధికమా!

[ఆమె కరములఁ బట్టుకొనును.]

రజియా—ప్రియతమా!

గీ త మా ల

ప్రాణనాథుఁడ! నాబాహుబంధమందు
లీనమైపోయి, యెడఁదనీ వానియుండి,
యొసఁగు మధురామృతము హర్ష మెసగ నాకు
తాపము నశింపఁజేయు గీతారవమ్ము
హాయిఁ గూర్పఁగఁ మదికి నీ రేయియందు,
అర్క-శీతాంశుతారక లంధకార
జడధిలోపలమునిగిన సరకు గొనక,
నీకు నేనును నాకును నీవయంచు,
సంతరింతము సంతోషజలధి ప్రియుఁడ!

పాడుచుఁ బాడుచు రజియా యజితసింహుని బాహులందు లీనమైపోవును. సరిగ నాసమయమందే ముకుందదాసు ప్రవేశించును.

ముకుంద—'మహారాజ్'!—అని, రజియా యజితులు పరస్పర బాహు సంలగ్నులై యుంటఁ గాంచి, గిఱ్ఱున వెనుకకుఁ దిరిగి పోసాగును.

అజితసింహుఁడు—[అతఁడు పోవుటఁ గాంచి,] ముకుందదాసూ! విశేషమేమైన నున్నదా?

ముకుంద—చిత్తము మహారాజ్! సేనాధిపతి దుర్గాదాసు దాక్షిణాత్యమునుండి తిరిగి వచ్చెను.

అజితసింహ—ఎవరు? దుర్గాదాసు తిరిగి వచ్చెనా? అతఁ డెచట?

ముకుంద—వెలుపల.

అజితసింహ—పోయి చూతము రమ్ము—కాదు! ఆతనినే యిచటికిఁ దీసుకొని రమ్ము.

ముకుంద—చిత్తము. [నిష్క్రమించును.]

అజితసింహ—బాలా! ఇఁక నీవు నిజాగారమున కరుగుము.

[రజియా నిష్క్రమించును.]

అజితసింహ—దుర్గాదాసు తిరిగి వచ్చెనా! నా రక్షకుఁడును, దేశప్రత్యాశయు నైన మహాత్ముఁడు మరలి వచ్చెనని వినినంతనే, యుల్లాసభావముకాక, యేదో దుశ్చింత చిత్తమం దుదయించె నేల? నా చిరసంచితభక్తి ప్రేమకృతజ్ఞతల నావిల మొనరించున దిదేమి చింత? ఆహా! ఇ దనుచితముకాదా! ఈ ప్రవృత్తిని మనంబునుండి దూరీకృత మొనరించి వైచెదను.

[రాజపుత్రసామంతులైన ముకుందదాసు, శివసింహులు ననుసరించి దుర్గాదాసు ప్రవేశించును.]

దుర్గాదాసు—మహారాజ్! భృత్యుండు మరలి వచ్చెను. అస్మచ్చిరసంచితయాశా!—దేవరను 'మహారాజా!' యని సంబోధించినంతనే నా కంఠ మానందముచే రుద్ధమై పోవుచున్నది.—మహారాజ్! అభివాదన మొనరించుచుంటిని. [ఇట్లని యాతఁడజితసింహుని పదంబును చుంబన మొనరించును.]

అజితసింహ—మిత్రశిరోమణీ! భక్తశమంతకమా! అస్మత్ప్రియతమ సేనాపతీ! కుశలముగ నుంటివా?

దుర్గాదాసు—దేవర యనుగ్రహమునఁ బ్రస్తుతము కుశలముగనే యుంటిని—ప్రభూ! తమంత తామే సామంతులకు దర్శన మొసఁగితిరా?

అజితసింహ—అవును. నాయంత నేనే సామంతులకు దర్శన మొసఁ

సమరదాసునకుఁ బ్రాపించిన శోచనీయ మృత్యువు [Lamentable death] కారణమున మా జయపథంబంతయు నుత్సవరహితమై దుఃఖప్లావితమై పోయెను !

అజితసింహ—సేనాపతీ! జయసింహుని పుత్రుఁడైన యమరసింహుఁడు నిజజనకునకు విపక్షియై విద్రోహాచరణము సలుప గడంగెను. దానంజేసి జయసింహుఁడు మార్వారుయొక్క సాయము వేఁడెను. దుర్గాదాసూ! సైన్యసమేతుండవై పోయి, నీవు జయసింహునకుఁ దోడుపడుము.

దుర్గాదాసు—దేవర యాజ్ఞ శిరసా వహించెదను. ఎల్లి ప్రత్యూష మందే పోయెదను !—కాశిమ్ యెచ్చట ?

శివశింగు—ఆతఁడు వ్యాధిపీడితుఁడై పడియున్నాఁడు. లేకున్న నందఱి కంటె ముందే వచ్చి యాతఁడు ప్రభుపదంబుల [Feet of Durgadas] కెరలియే యుండెడివాడు.

దుర్గాదాసు—వ్యాధిపీడితుఁడై యున్నాడా? ఏమివ్యాధి? ఆతఁ డెచట ?

శివశింగు—లోపలిగదిలోఁ బరుండియుండెను. విశేష రుగ్ణతయేమియు లేదు. జ్వరము; సామాన్యజ్వరము. వాని కొఱకై మీరు చింతింప నక్కఱ లేదు.

దుర్గాదాసు—నడువుఁడు—వానిని చూచి వత్తము.—

[దుర్గాదా సందఱిం గూడి వెలుపలకు నిష్క్రమించును.]

## చతుర్థదృశ్యము

దాక్షిణాత్యమున మొగలు శిబిరము—ప్రభాతకాలము ఔరంగజేబు దిలీర్ఖానులు నిలువంబడి ప్రసంగించుకొనుచుందురు.

ఔరం—దిలీర్ఖానూ! అక్బరట్లైన పారసీకదేశమున—[Persia]

కరిగెనా?

దిలీర్—చిత్తము ప్రభూ! ఒక యాంగ్లేయ పొగయోడనెక్కి, నౌకా ధూమము బుగుల్ బుగుల్ మని నభము సేర, దేవర పుత్రుఁడు పారసీకసీమాభిముఖముగ బోయెను.—అచటినుండి యక్బరు మక్కా పోవునని వింటిని.

ఔరం—[దీర్ఘనిశ్వాసము వదలి]—ఆతని శిక్షార్థమై కావింపఁబడిన వ్యయ, యత్న, శ్రమలన్నియు నిష్ఫలములై పోయెను!

దిలీర్—ప్రభూ! అట్లు తలపకుఁడు. ఆశిక్ష యొక్క ఫలమేమో నేఁడు కానంబడెను. శిక్షయే లేకుండిన, నిపుడును తాపము కలుగకుండెడిది!

ఔరంగ—దిలీర్ఖానూ! నేనుకూడ మక్కా పోయెదను. నాజీవన కార్యము శేషించెను. ఇఁక నొక పనిమాత్రము మిగిలియున్నది.-గజియా యుద్ధారసాధన మొనరింపవలెను. నీవు దుర్గాదాసును విడిచి వేయకున్న యెడల నాతఁడు పోకపూర్వము కార్యము నుద్ధారము కావింపఁ గలిఁగి యుండునేమో యని తలంచుచుంటిని.

దిలీర్ఖాను—దుర్గాదాసునకు భయము సూపియా? ప్రభూ!—అది సంభవము కానేరకుండును! భయమననేమో, యావీరుఁడెఱుఁగఁడు. ఆనాటి గభీరనిశీధమందు, కామ్‌బక్ష్ దుర్గాదాసు మస్తకోపరిభాగమునఁ దరవారి నెత్తినతఱి—ఆహా! దుర్గాదాసెట్లు వక్షమునుసాచి నిలువంబడెను! ప్రభూ! నే నెన్నఁడాదృశ్యమున మఱువఁ జాలను. ఆకస్మికముగ నాశూరుని శిరము శైలశిఖరమకరణి నిబ్బరముగ నిలువంబడి పోయెను! ఆతనివక్ష మాకాశమ వడువున ప్రశస్తమాయెను.—స్వామీ! అట్లున్నతకాయుఁడై ఆయతవక్షుఁడై యాతఁడుండు టే నెన్నఁడు జూచి యుండలేదు!

ఔరంగ—మిత్రమా! దుర్గాదాసు మహాత్ముఁడు. అందుల కేమియు సందియములేదు. కాని—

దిలీర్—స్వామీ! కర్తవ్యార్థము, రాజపుత్రులు ప్రాణంబుల వీడ భయముమొందకుండుటేగాక, అట్లనువుల వీడుటందు వారు లోక విధమగు గర్వంబనుభవింతురు! అట్టిరాజపుత్రులం దుత్తమరాజ పుత్రుఁడు దుర్గాదాసు!

ఔరంగ—ఒప్పుకొంటిని. రాజయోను మరల బడయునాశ దురాశయా?

దిలీర్—కాదు. స్వామియీవిషయమున నాకుఁ బూర్ణాధికారమొసఁగుచో దేవర కోరిక నే నక్కార్యము నిర్వహింపఁగలుగుదును.

ఔరంగ—ఏ యుపాయమున?

దిలీర్—ప్రభూ! రాజపుత్రులను, ముఖ్యముగ దుర్గాదాసును యెట్లు నడపవలెనో నే నెఱుంగఁ గలుఁగుదును. వాని యాత్మమర్యాదపై నిర్భర మొనరింపుఁడు. ఆతఁడు పుష్పముకంటె కోమలమగును. వానికి భయము చూపగడంగుఁడు, ఆతఁడు లోహంబుకరణి దృఢమైయుండును.

ఔరంగ—మంచిది. నీపై సంపూర్ణ భారము విడుచుచున్నాను. నా చిత్తమేమియు స్థిమితముగ లేదు. బుద్ధిదోషంబుకతన మాజాముసు శత్రుఁ గావించితిని; అజీమును లోభిఁ జేసితిని; అక్బరును విద్రోహిఁ గావించితిని. కాంబక్షను పిశాచిగాఁ దయారు చేసితిని. కాని, బుద్ధిదోషమెందో యెఱుంగఁ జాలకున్నాను.

దిలీర్—స్వామీ! బుద్ధిదోషమెందో యెఱుఁగఁ గలిఁగియే యున్న, నది యంతరించియే పోయెనని తలంప నగును.

[ఈ సమయమున కామ్బ్లేష్ఖాన్ ప్రవేశించి యభివాదన మొనరించును]

ఔరంగ—కామ్బ్లేష్ఖానూ! ఏమి చేయుకొని వచ్చితివి?

కాబ్లేష్—ప్రభూ! శంభుజీని గాడిదపై గూర్చుండఁబెట్టి, నగరవీధులం దూరేఁగుట ముగిసెను. బోడిబుఱ్ఱ దబదబ మొత్తుకొనుచు, "నన్నెవ్వరైన చంపివేయుఁడు. నన్నెవ్వరైన చంపివేయుఁ" డని కాఫరు బిగ్గఱగా నఱవసాగెను. నేనును సహింపలేను—మహాప్రభూ! వాని నిప్పుడిచ్చటికిఁ దీసుకొనివత్తునా?

ఔరంగ—తీసుకొనిరమ్ము.

కాబ్లేష్‌ఖాన్—మహాప్రభూ! నా, ఇనామా!

ఔరంగ—ఇచ్చితిని. కాబ్లేషూ! ఇచ్చితిని! గొప్పబహుమాన మిచ్చితిని.

[కాబ్లేష్ సలాముచేయుచు నిష్క్రమించును.]

ఔరంగ—ఖుదాతాలా! నీవనుగ్రహించుము నాకిఁ కేమియు నిష్టములేదు. నాయుష్యము ముగిసెను. నామేనుకండము బ్రద్దలైపోయెను—(పిడుగు తుణకారు మూర్ఛకునియుండి)—ఏ దేవుఁడు సంభవమని కలంపలేదో—నా సిన్న—గ్లీనామ్మా—భార్య తాఁధీశ్వరి—ఆమె కేమయ్యెనో గిరినాము!—హాహా. ఇదేవుఁడుఁ దలంచియుండలేదు—స్వప్నమునఁ గూడఁ దలంచియుండలేదు.

నిసిక్—ప్రభూ! దేని స్వప్నమునఁ దలంచియుండమో, యదే యప్పుడిటికంటె ముందుఘటించుట, నేఁ బలుమారులు జూచుచువచ్చుచుంటిని.

[పింజరాబద్ధుఁడైన శంభుని దీసుకొని, యమ కాబ్లేషులును, ప్రహరులును ప్రవేశింతురు].

ఔరంగ—ఇదిగో! మరాఠావీరుఁడు! ఏమోయి మహారాజ్! కొరానునిఁక సేవగింతువా? మసీదుల పవిత్రములఁగావింతువా? మొల్లాలు [Mohammadan monks] కవమానము చూపెదవా? ఏమి? మాటలాడకూరకుంటివేల?

చున్నారా ? [Do you wish that any-body should embrace Islam against the dictates of his conscience ?]

ఔరంగ—దిలీర్ఖానూ! ఈ యిస్లాము మతప్రచారముకొఱకే నేనీ రాజ్యభారము నొకఁ దాల్చితిని. దీనికొఱకే జనకుని కారాగారబద్ధుఁ గావించితిని! దీనికొఱకే భ్రాతలహత్య గావించితిని! ఖోదా (అల్లా) యెఱుంగును!

దిలీర్—స్వామీ! భవదుద్దేశ్యము నేనెఱుంగకపోలేదు. తాము సంశిధార్మికి ముసల్మానులగుటం జేసియే, యిపుడుకూడ నేను మీపార్శ్వమున నిలువంబడియుంటిని. తాము కపటాచారపరాయణులని దలంచియేయుండిన, బహుదినములకుఁ బూర్వమే భృత్యుఁడు దేవరకడ సెలవుతీసికొనియుండును—కాని, ప్రభూ! బాహుబలమున మతప్రచారముగునా? తరవారి యగ్రభాగమున విశ్వాసము స్థాపితముగునా! పదాఘాతముచే రాజభక్తి తయారగునా? మహారాజాధిరాజా! ఇపుడుకూడఁ జెప్పుచుంటిని,—కడపటిమాఱు వచించుచుంటిని. తామింక మఱలుఁడు! ఇప్పుడైన హిందూవిద్వేషమును పరిత్యజింపుఁడు. మీయౌదార్యముకతన హిందూముసల్మాను లొక్కటి అగుదురుగాక! దేవాలయమసీదులందు స్వాతంత్ర్యభావమున నల్లామహాదేవుల నామములు నినాదితములగుగాక! ఒక్కమారే డమరుశంఖాధ్వనులు బయల్వెడలుగాక! హిందూముసల్మానులు తమ జాతిభేదమును మఱచి, తాము సోదరులంచెఱింగి యొండొరులు కౌగిలించుకొందురుగాక!—హిందూముసల్మానులు తమ మతద్వేషమును మఱచి తాము సోదరులుగ నెఱింగి, యవ్యాజప్రేమ పురస్సరముగ నొకనినొకఁ డాలింగనము మొనరించుకొని, నిజపుత్రకలహవిలోకన జనితదురంతచింతచే బొగులు భారతాంబ యుల్లమును పల్లవింపఁ జేయుదురుగాక! అద్దినమున హిమాలయశైలమునుండి కన్యా

కుమారిపర్యంతము, పృథివియం దెన్నఁ డెవరు గాంచియుండని సామ్రాజ్య మొండు స్థాపితమగుట నిక్కము !

ఔరం.—దిలీర్ఖానా ! హిందూముసల్మానులొక్కటియే యగుదురా ?

దిలీర్—స్వామీ ! ఎందులకు కారు? వారలింత కాలమొకే యాకాశము క్రిందనుండిరి. ఒకే వాయువును సేవనమొనరించుచుండిరి. ఒకే విధంపు సలిలమును పానమొనరించుచుండిరి. ఒకే భూమిజాత సస్యఫలంబుల నారగించుచు వచ్చుచుండిరి. అట్టులయ్యు వారల ప్రాణము లొక్కటికాలేదా? వార లొక్కమారు, ధర్మభేద జాతిభేద, యాచారభేదములను మఱచి, నతజానువృత్తై, కరకమలముల ముకుళించి, భక్తిబాష్పగద్గదస్వరమున, నీ శ్యామల, సుజల భారతభూమి నొక్కమారు ప్రాణభరమున 'మాతా!' యని పిలతురు గాక ! సార్వభౌమా ! ఆ మహిమాయైశ్వర్యమె ట్లాహ్లాద జనకమైయుండును !

[If the reader laughed at me when on a previous occasion I ventured to show in the great Delirkhan a statesman, dowered with the lofty genius of a Burke, he would bear me out after a studied perusal of the above peroration pregnant with wisdom and patriotism. Had Aurangzeb but deigned to act up to the sage counsel of his noble minister, Hindus and Musalman would, singing their sectarian prepossessions and religious animosities in the common aspiration of contributing to the well being and tranquility of mother India and catching glimpses of their bright millennium, have long long ago been tied by the silken threads of braternal love and holy affection. But the dogged pertinacity of the bigoted tyrant did not suffer him to perceive the wisdom that was in Delir's counsel, brought forth the tragic dismemberment of the great Moghul Empire and eventually exacerbated the enemical propensities of the Hindu and Mussalmans, the impetuous sons of a saintly mother. The reader must note that

రక్తమందా రాజశ్వ మంతరించెను!!!!

[ఇట్లని దిలీర్ఖాను చినాలును నిష్క్రమించును]

కాబ్లేష్—మహాప్రభూ! నా యినామ్!

ఔరంగ—నీ యినామా?—ఇదిగో!—[ప్రహరులనుద్దేశించి]—బంధింపుఁడు!

కాబ్లేష్—సుల్యా! సుల్యా!! సూ!!! సుల్యా!!!! నన్నే!—

[ప్రహరులు కాబ్లేష్ఖాను పెడరెక్కలు విఱిచికట్టివైతురు]

ఔరంగ—అజీమూ! వీనిని వెలుపలకుఁ గొనిపోయి, సత్వరమే వీని శిరముఁ దీసుకొనిరమ్ము!—కాబ్లేష్ఖాన్! మేము చాల సమయములందు విశ్వాసఘాతకుల సహాయముఁబొంది బాధ్యులమై యుండుట నిక్కమే! కాని యంతరంగమందు వారలకు ఘృణచూపుచునే యుందుము—పొమ్ము! నీ యజమానుఁడు శంభుజీ పోయిన తావునకు నీవుకూడ పొమ్ము!!

కాబ్లేష్—మహాప్రభూ!—ప్రభువులు మీరు రక్షించాలండి! అయ్యా! బాబయ్యగారూ! క్షమించండి! రక్షించండి! రక్షించండి!! రక్షించండి!!!

ఔరంగ—ఛీ! పో!!

(అని నిష్క్రమించును.)

అజీమ్—నడు! కుక్కా!!

కాబ్లేష్—(అజీము పాదములపై బడి) దండమండి బాబయ్యగారూ! దండమండి! నన్ను చంపెయ్యకండి! నేను మీ గొలామునై (బానిసనై) మిమ్ము కనిపెట్టుకుంటానండి!—దేవుడుసాక్షండి! మీతోడండి! మీపాదాల—

అజీమ్—(గట్టిగఁ దన్నుచు)—చల్! నిమక్హరామ్! (నడు! విశ్వాసఘాతకా! నడు!)—అని నిడివియైన బెత్తముతో వానిని

చావమోదఁదొడంగును.)

కాబ్లేష్—కొట్టండి! కొట్టండి!! కొట్టండి!!!—చెప్పుచున్నను కూడా కొట్టండి?—మళ్లుచున్నను చావమోగండి. ఒంటినిండా బాగా తెట్లు తేతేదాకా 'ఛీ! పో! గండిదా!' అని గట్టిగాతన్ని వెళ్ళగొట్టెయ్యండి!—కాని నన్ను చంపేసేయకండి! బాబయ్యగారూ! మహాప్రభో! చంపేసెయ్యకండి! ఆడదుండండి! చంపేసెయ్యకండి! చంపేసేయకండి!! చంపేసేయకండి!!!—దండమండి! మీపాదాలిక దండమండి!! బాబయ్యా దండమండి!!!

[అని యాతఁడజీము పాదములఁ గట్టిగఁ బట్టుకొనును. అజీము బెత్తముతో వానిని తీవ్రముగ మోదుచు, యీడ్చుకొని పోవును. ప్రహరులుకూడ కాబ్లేషానును చావఁదన్నుచు నిష్క్రమింతురు].

## పంచమదృశ్యము

యోధపురప్రాసాదము—రాత్రికాలము

అజితసింహ శ్యామసింహులు ప్రసంగించుచుందురు.

శ్యామసింహ—అట్లైన దేవరరాజ్ఞాసోదరుని పుత్రికను [రాణియొక్క భ్రాతుష్పుత్రి] పరిణయ మాడితిరా?

అజితసింహ—అవును. దుర్గాదాసిటీవల యుదయపురమునకుబోయి, యచటనుండి, యీ సంబంధముఁ దీసికొనివచ్చెను. నే నందుల కియ్యకొంటిని.

శ్యామసింహ—మహారాజ్! మీవారు మార్వాడ వంశజీయులు నేఁడిట్లు కలియుట పరమసౌభాగ్యము! గజసింహుని కుమారి నిరుపమానసౌందర్యోపేతయుని వింటిని.

అజిత—కాని, యామె ప్రతిమమాత్రమే!—ఇంకను బాలికయే!

శ్యామసింహ—ఆ ప్రతినయే యొక్కనాఁడు రక్తమాంసములతో సౌష్టవసంపన్న కాఁగలదు. అందుచే నామె విషయమై యిపు డేమియు యోచింపనక్కఱలేదు.

అజితసింహ—ఒక్క మాటనైనఁ బల్కుటెఱుంగదు!

శ్యామసింహ—నేర్చుకొనును! మహారాజ్జీ! నేర్చుకొనును! ఆడు వారలు చాచిల్కలంటివారలు—'సీతారామా' యని నేర్పిన 'సీతారామా' యందురు. మరల 'రాధాకృష్ణా' యని నేర్పిన 'రాధాకృష్ణా' యందురు—మహారాజ్జీ! రాణా తన కనిష్ట పత్నిని పరిత్యజించె నని వింటిని. అది సత్యమేనా?

అజిత—అవు నదిసత్యమె! ఆతఁ డామెకు నూనవేతన మొసఁగు చుండెను.

[ఈ సమయమున దుర్గాదాసు ప్రవేశించును]

శ్యామసింహ—దుర్గాదాసూ! షాహజాదీ! యెచట?

[The daughter of a Moghul king or prince is called a shahajādi. Raziya is spoken of here as shahajādi]

దుర్గాదాసు—నే నామెను సేనాపతి సుజాయెత్ నకు నొప్పగించితిని. ఆమెను మీ రక్షించుటకంటె వారి రక్షించుటే శ్రేయమని తలంచితిని.

శ్యామసింహ—ఏమి! నా యెడల విశ్వాసము లేకపోయెనా?

దుర్గా—మహారాజ్! సత్యము వచించున దేమన—మీ యెడల నాకు నిక్కముగ విశ్వాసము లేకపోయెను; కాని, యెట్టులోనరించినను యొక్కటియే! ఆ పెను సామ్రాట్టుకడకు మీరు కొనిపోయిన నేమి, సుజాయెత్ కొనిపోయినను యంతయేకదా!

శ్యామసింహ—అవును—కాదు—అవును—కాదు—అవును! మంచి పనే చేసితివి. షాహజాదీని యాతని కొప్పగించుటెంతో నా

కొప్పగించుటఁగూడ నంతయే!

అజితసింహ—షాహజాదీయా! దుర్గాదాసూ! ఏ షాహజాదీ?

దుర్గాదాసు—అక్బరుషాహారుమారై యగు షాపుత్ వున్నిసా! ఆమెకు మాఱుగ నేను మార్వారు భర్తకొఱకు, యుద్ధ మవసరము లేనిదే మూఁడు జనపదములను బడసితిని.

అజితసింహ—దుర్గాదాసూ! ఏమనుచుంటివి! నీవు నా—నీవు నా మానము మొగలాయీలకు కప్పన మొసఁగి వివచ్చితివా?

దుర్గాదాసు—చిత్తము ప్రభూ! ఆమెను తన నాన్నల కొప్పగించి వైచితిని.

అజితసింహ—[తీక్ష్ణ కోపము సద్బుద్ధియుండి పిదప] సేనాధిపతీ! ఆమెను మొగలులకు కప్పగించివైచుటకు నీ యధికారమెట్టిది? లేదును నేను!—నా యనుమతిఁ దీసికొనకుండ—

శ్యామ—మహారాజా! నేను కూడ సేనాపతి కట్లే చెప్పియుంటిని! మహారాజ్ యొక్క యనుమతిఁ దీసుకొనకుండ—

అజిత—[శ్యామసింహుని మాటలు వినిపించుకొనక] అట్లైన యిక నీకును తీ! నీవుకూడ నీ కుట్రయందుంటివా!

శ్యామసింహ—[స్వగతము]—ఇదేమి!—యిదేమి!! ఏబుద్ధి! ముందు మాట! నేనెకసారీ! ఇంకమునుపటి మాట మఱచిపోలేదు! మరల చెప్పి చూచెదను! [ప్రకాశముగ]—మహారాజ్! నేను—

అజిత—ఛీ! నోరుమూయుము!'

దుర్గాదాసు—[అజితసింహుని నుద్దేశించి]—ప్రభూ! నేను దేవర యనుమతిఁ దీసుకొనలేదు. కారణమేమనగ, నే ననుమతిఁ గోరినను, అద్దానిని ఒసఁగకనే యుందురు! అక్బరును, ఆతని వారలును నా యాశ్రయమును స్వీకరించిరి. దేవర యాశ్రయము స్వీకరించలేదు.

అజితసింహ__కుట్ర! __ కుట్ర!! __ కుట్ర!!!__ ప్రకాండచక్రాంతము!!!!

శ్యామసింహ__మహారాజా! నేను దీనిలో లేను__నే నన్న దేమనిన

అజితసింహ__ఛీ! దురాత్మా! దూరముగఁబొమ్ము__ [ఇట్లని యాతఁడు శ్యామసింహుని బలంబుగ దూరమునకుఁ దన్ని వైచును.]

అజితసింహ__హా! కుసుమాంగీ! ఆశ్లైన నిన్నుఁ గోల్పోతినా! ఈ జన్మమున నాకిఁక నీ దర్శనము చేకూరదా? నీ కొఱకు నేను దుర్గాదాసును కూడఁ గోల్పోతినా!__[ఇట్లని యాతఁ డాయాగార మధ్యమునఁ బచార్లు సేయఁ దొడంగును.]

[కాశిమ్ మహమదు పొగలు పొగలుచువచ్చి, యాయాగారమందుఁ బ్రవేశించును.]

కాశిమ్__రాజా! దుర్గాదాసు మహారాజ యెచ్చట?

అజితసింహ__ఆతఁడు రాజ్యపరిత్యాగ మొనరించి వెడలి పోయెను.

కాశిమ్__అతఁడు తనంత తాను వెళ్ళిపోయెనా, లేకపోతే, నీవే అతనిని తరిమి వేసితివా?__శ్యామసింహుఁడు చెప్పినమాట నిజమేనా?

అజితసింహ__అవును అవును నిజమే, నేను వానిని వెడలఁ గొట్టి వైచితిని.

కాశిమ్__తెలిసినది. ఎందులకు వెడలఁగొట్టివైచితివి రాజా?

అజితసింహ__లంచము__లంచగొండియైనందులకు!

కాశిమ్__లంచమా!__దుర్గాదాసు మహారాజ లంచముగొండి యయ్యెనా!__బాగుబాగు!__ఇట్లనుటకు నీకు నోరెట్లువచ్చినది! దుర్గాదాసు లంచము పుచ్చుకొనినాడా! దుర్గాదాసు లంచమే పుచ్చుకొన్నయెడల నీవంటివాఁడొకఁడు మహారాజు కాఁగలిఁగి

యుండునా? ఆతఁడిచ్ఛగించినయెడల నిన్ను తఖ్తునుండి దూరమునకు తన్నివేసి, తాను యోధపురమునకు రాజై హాయిగా కాలిమీఁదఁ గాలు వేసికొని కూర్చుండఁగలిగెడివాఁడుకాఁడా? దుర్గాదాసు లంచగొండియయ్యెనందువా? అరే నిమక్‌హరామ్! (అరే! విశ్వాసఘాతకా!) ఎవ్వఁడు నీకు, యింతకాలము ప్రాణమిచ్చి, నిన్ను బ్రతికించెను? ఎవ్వఁడు యీ యిరువైయైదేండ్లు పోరాడి, తన శరీరములోనున్న రక్తమంతయు దేశముకొఱకు ధారపోసెనో, ఆతనిని యీ పెద్దకాలమునందు, పగల యింటిగుమ్మమునుముందు ముష్టియెత్తుకు బ్రతుకుమని తరిమి వేసితినా? ఇక నీకు ధర్మమయినదా నిమక్‌హరామ్! (విశ్వాసఘాతకా!)

అజితసింహా—కాకా—(Kākā - Peternal uncle)

కాశిమ్—ఖబర్దార్! నన్నింక ‘కాకా’ అని పిలువకు! (ఫిర్ ముఝ్‌కో చచ్చాకహకర నహీఁపుకార్నా!) నేనిట్టి నిమక్‌హరామ్ (విశ్వాసఘాతకుండనైన) ‘కాకా’ను కాను! (మై ఐసే నిమక్‌హరామ్‌కా చచ్చానహీఁహూఁ) నేనింక నీకొఱకు కొంచెమున తలఁచుకొనలేదు. [మై ఆవుర్ తుమారా రోటీఖానా నహీఁచాహ్తా] నేను కూడ పోవుదును [మైభీ జాపుంగా!] కష్టపడి తింటాను! [మెహనత్ కర్కే ఖాపుంగా!] కష్టపడో, లేక ప్రతిగుమ్మమువద్దను ముష్టెత్తుకొనుచునో, నాదుర్గాదాసుమహారాజును పోషించుకొందును! [మైమెహనత్ కర్కే యాదర్వాజాసె దర్వాజాభీక్ మంగ్‌కర్ అపన్నె మహారాజ్ దుర్గాదాస్‌కో ఖిలావుంగా!] అతనికిమ్మత్ (విలువ) నీకేమి తెలియునురా నిమక్‌హరామ్! (విశ్వాసఘాతకా!) [ఉస్కీ కదర తుమ్ క్యాసమ్ఝేగా నిమక్‌హరామ్!] [అని కాశిమ్ వేగముగ వెడలి పోవును.]

[అజితసింహుఁడేమియుఁ బలుకక రెండవదిక్కుగాఁ బోవును]

రును కాను. కండ్లుగంటులు కట్టెను; చెక్కిలిలు పూర్తిగ వాడి పోయెను; శిరోజము లన్నియు నెరసిపోయెను. నే నా గుల్ నేయూరును కాను!—నే నెవతెను? [ఉచ్ఛ్వాసము.] నే నెవతెను?

[ఈసమయమున రజియా ప్రవేశించి—

“సామ్రాజ్ఞీ!” అని పిలుచును.]

గుల్ నేయూర్—ఎవరు?—రజియా! ఏమని పిలిచితివి ‘సామ్రాజ్ఞీ’! యనియా? నే నట్లైన నే నాగుల్ నేయూరునా?

రజియా—బామ్మగార్యా—

గుల్ నేయూర్—అమ్మాయీ! నావంక తేఱి చూడుము.—నే నా గుల్ నేయూరునో కానో నిజము చెప్పుము.

రజియా—బామ్మయ్యా! నీ వా గుల్ నేయూరు వవునో కావో యెఱుంగను. కాని, నీవు నా ముసలి బామ్మయేవే!

గుల్ నేయూర్—సత్యమే! గుర్తింపఁ గలుగుచుంటివా? నిజము చెప్పు మా వెరను—గుర్తింపఁ గలుగుచుంటివా! ఎవ్వని కృపాకటాక్షము కొఱకు భారతాధీశ్వరులు లాలాయితులై యుండువారో, ఎవతె రాజ్య, జనపద లక్ష్యమున నెవ్వతె రోష కుంచిత భ్రుకుటీభంగమును భయమున లక్షించుచుండునో, ఎవ్వతె ముష్టిబద్ధకృపాణులై దశలక్ష సేనాని లెవ్వతె తర్జనీ యింగితము ననిమేషలోచనులై యపేక్షించు చుండువారో, అకాంతనే నయ్యె, భారత సామ్రాజ్ఞి గుల్ నేయూరు నైయుండి నీ వానాఁ డొక్క దినమున మాత్రము విలోకించితివి. మఱి నేఁడు నేను సార్వభౌమునిచే నుపేక్షితనై, రాజన్యవర్గంబుచే ధిక్కృతనై, విశ్వంబుచే వర్జితనై యుంటిని! నేను గుల్ నేయూరునా? బాగుగఁ బరికించి చూడుము!

రజియా—బామ్మయ్యా! నీవు నిక్కముగ నా బామ్మయ్యవు! జగం

బంతయు నిన్ను వర్జించినను వర్జింపనిమ్ము. నేను మాత్రము నిన్ను విడువక నీఛాయవలె సదా నిన్ననుసరించి, చరించుచుందును.

గుల్ నేహారు—ఏమి? నేను నీకెన్నండైన నేదేని మంచి గావించి యుంటినా?

రజియా—ఎన్ని యుపకారములు గావించియుండవలెను. నీయందు బద్ధానురాగినై యుండునట్టి దినము నీవు నా సహదుఃఖినివై యుంటివే! నేను కూడ నాడే కౌగిలించి—ప్రేమించి యుంటిని!

గుల్ నేహారు—నీవుకూడ ప్రేమించుచుంటివా? ఎవరిని ప్రేమించితివి? కాని, నావలెనే ప్రేమించితివా? నావలెనువున బ్రతుకుచూ జలమునందు దగ్ధమై పోతివా? ఒక సామ్రాజ్య మయ్యనురాగము కొఱకు గావించితివా? ఆదరింపక వానిచే ప్రత్యాఖ్యాత వైతివా?—కాదు! అట్లు యుండవు! నీ వీ దాహమును కల్పన యైన గావింపజాలవు. (you cannot even imagine)—ఆనాటి నుండి నా మానెలన్నియు మగిలిపోను! నేడు నీవు గాంచుచుంటివి గుల్ నేహారు కాదు;—ఆమె కంకాలము!(Her Skeleton!). నిజమగు నా గుల్ నేహారు కాదు.—అమ్మా! ఇప్పుడు నేను సర్వభ్రష్టనై యుంటిని!

ఈ సమయమున పరిచారిక ప్రవేశించి రజియాను పిలుచును—
"అమ్మాయిగారూ! రండి!"

రజియా—ఉండుము. కొంచెముసేపు నిలువంబడుము. వచ్చెదను.

పరిచారిక—అల్లావల్లా కాదండి అమ్మాయిగారూ! పాదుషాగారి హుకుము లేదు.

గుల్ నేహారు—హుకుము లేకపోవు టెందులకు దాసీ?

పరిచారిక—అమ్మాయిగారి నిక్కడకు రానిచ్చుటకు—[రజియా నుద్దేశించి]—రండి! అమ్మాయిగారూ! రండి!

బాష్పాకులలోచనయై రజియా గుల్‌నేయూరు ముఖమును విలోకించుచు నిలువంబడును.

గుల్‌నేయూర్—(రజియా నుద్దేశించి)—పొమ్ము!

[విషణ్ణముఖియై రజియా నిష్క్రమించును.]

గుల్‌నేయూర్—నేఁడు నే నింత హేయనై పోతినా! నిజపాత్రితోఁ బ్రసంగించుటకైన దగనా? దాసి యొకతె కూడఁ గం డ్లెఱ్ఱఁజేసి పోవుచుండెనా? ఇఁక నెందులకు! ఈహేయము నంతమొందింప వలెను! అందులకు నేనే యంతమొందవలెను! భృత్యాధికృత కూడ నై, గుల్‌నేయూ రీరాజ్యపశ్చాదాగారమున వాసము సేయదు! సామ్రాజ్ఞినై నే నీరాజ్యమం దడుగిడితిని! సామ్రాజ్ఞి నైయ్యే, యిం దుండి నిష్క్రమించెదను.

పాడుచుఁ బాడుచుఁ గొందఱు వైరాగివనిత లాభవన పార్శ్వపథముగుండా పోవుదురు.

గీతమాల

జీవనంబను వార్ధి వీచికలయందు
గ్రిందుమీఁదును పడుచును రేపు మాపు,
యీఁతఁ గొట్టుచు నున్నార మింతవఱకు;
ఘోరకోలాహలంబందు నౌర! మనము
కొట్టుకొంటిమి జాలగ మిట్టిపడుచు;
ఇంక సలిలముఁ జొచ్చియు శంకవీడి,
మరణసీమలో నుందము మౌనమునను,
కడలి సొరకున్నఁ దెలియదు గాన లోతు.

గుల్‌నేయూర్—సరిగ వచించిరి! "కడలి సొరకున్నఁ దెలియదు గానలోతు!" చాలును! అట్లే సొచ్చెదగాక! భయమేమి? అదే మంచిది! నేఁ డాత్మహత్యఁ గావించుకొందును!

(ఈసమయమున, కాంబక్షూయాగారమందుఁ బ్రవేశించి)—"అమ్మా! నేను నీకడ సెలవుఁ గొనుటకై వచ్చితిని—యిప్పుడే బీజపురము బోవుచుంటిని. జనకుని యాదేశము!"

గుల్‌నేయార్—అట్లగుగుమవని వింటిని. అది నీ జనకుని యాదేశము—అడ్డుపెట్టుటకు నే నెవతెను?—పొమ్ము. [కాంబక్ష్ జనని చరణములను స్పృశించును. గుల్‌నేయార్ తలమాత్ర మొకించుక వంచును. పిదపనామె] పుత్రా! ఇదే మస్త కడసారి చూపు!

కామ్‌బక్ష్—ఏమి తల్లీ?

గుల్‌నేయార్—ఏమియా? నేను మరణించెదను—నేను మరణించెదను—నే నాత్మహత్యఁ గావించుకొందును!

కామ్‌బక్ష్—అదే మట్లనుచుంటివి జననీ! నీ చిత్తముత్యక్తమాయె నని యెఱుంగుదును! కాని—

గుల్‌నేయార్—మరణింతు నెందులకు?—యెఱుంగఁ గోరుదువా? అట్లైన వినుము. ఎంతకాలము నేను సామ్రాజ్ఞినైయుంటినో, అంతకాలము బ్రదికియుంటిని! ఎంతకాలము పరిపాలన మొనరించితినో, అంతకాలము బ్రదికియుంటిని!! ఎంతకాల మాదలనెత్తి గర్వినైయుండఁగలిగితినో, అంతకాలము బ్రదికియుంటిని!!!—నేఁడు సార్వభౌముని తాచ్ఛిల్యముఁగొని, భృత్యునిధిక్కారముఁ గొని, పుత్రప్రపౌత్రుల కరుణగొని మృత్తునందు మస్తకము మఱుఁగుపఱచుకొని గుల్‌నేయారం మనియుండఁ గోరదు!

కామ్‌బక్ష్—అమ్మా! ఆ దినములు మరలఁ దిరిగి రాకమానవు. ఇపు డీవు జనకునిమ్రోల క్షమాభిక్ష వేఁడుకొనుటయుత్తమము కాదా?

గుల్‌నేయార్—ఏమి! క్షమాభిక్షయా! నేను క్షమాభిక్ష వేఁడుకొందునా? నా పుత్రుడవు కావా నీవు?—నీ మాతనింకను గుఱు

తింపలేదా? కాంబక్షూ! కమలాప్తు డెట్టి గరిమతో నుదయించునో, యట్టిగరిమతోడనే యస్తమించును—పొమ్ము! కాని మగుడి యరుదెంచి, నీవు నీ మాతను గాంచఁ జాలవు!

కామ్‌బక్ష్—అమ్మా—

గుల్ నేయార్—ఊరకొనుము—ఏమియుఁ బలుకకుము. నేను స్థిర ప్రతిజ్ఞను! ఇహలోకమునందిదియే మనకడసారి చూడ్కని ధ్రువంబుగ నెఱుంగుము—పొమ్ము—

[అవనతవదనుఁడై కాంబక్ష్ వెలుపలకు మెల్లగ వెడలిపోవును]

గుల్ నేయార్—ఆదిత్యుఁ డస్తమించుట కధికవిలంబనములేదు. పరిచారికా!—లేదు: ఎవతెయులేదు! ఒక్కదాసియైన నేఁడు నా యాజ్ఞనపేక్షించియుంటలేదు! పూర్ణస్వాతంత్ర్యమువహించి, ప్రతి పరిచారిక ఒక్కొక్కప్రక్క వెడలిపోవుచుండెను. అంతమొందెను! నాగరిమావైభవములన్నియు నంతమొందెను!! నేను కూడ నంత మొందుదను!!!—[ఇట్లని గుల్ నేయా రందుండి నిష్క్రాంత యగును. క్షణానంతరమున నౌరంగ జేబొక పరిచారిక ననుసరించి అత్తావున కరుదెంచును]

ఔరంగ—ఏది సామ్రాజ్ఞి?

పరిచారిక—ఎఱుంగను. స్వామీ! ఇంతకుముం దామెయిందే యుండెను. ఇపుడు లోనికరిగి యుండును!

ఔరంగ—పిలుచుకనిరమ్ము.

[పరిచారిక నిష్క్రమించును.]

ఔరంగ—దుర్గాదాసూ! నీకడ నేను బాహుబలమునఁ బరాజితుండనైతిని, కాని ఆ పరాజయముకంటె నీయపజయమధికము! గుల్ నేయార్ పగిది నారిని నీవు ముష్టిమధ్యంబున బడసియు వీడివైచితివి; గుల్ నేయార్ భంగి సామ్రాజ్ఞియొక్క ప్రేమను ప్రత్యాఖ్యాన

మొనరించితివి. నీవు మహాత్ముండవు!—దిలీర్ఖానుయొక్క యను రోధము కతనను, మహనీయగుణగరిష్ఠుండవగు నీకు సూపనగు సమ్మానముకతనను, నేఁడు కుటిలయైన 'భారతాధీశ్వరిని' క్షమించెదను—నిక్కముగ క్షమించెదను. దిలీర్ఖాన్! —మక్కామహాక్షేత్రమున కరుగుటకుఁ బూర్వమొక యుగ్ర, యుచ్ఛృంఖల నారి యెడల నీకుఁ గ్రోధము సూపుటెందులకు?—

[గుల్నేయూరధికతరాలంకృతయై ప్రవేశించును.]

గుల్నేయూర్—ఎవరు!—ఎవరు!! సామ్రాట్టా! ఇంత యనుగ్రహము కలిఁగెనేల?

ఔరంగ—సామ్రాజ్ఞీ!—

గుల్—అట్లు సంబోధింపకుము. నే నీకు సామ్రాజ్ఞిఁ గాను! ఎంత కాలము నీపై నిరంకుశాధికారము సూపితినో, యెంతకాలము నిన్ను నా శాసనబద్ధుఁ గావించివైచితినో, అంతకాలము నేను సామ్రాజ్ఞినై యుంటిని. నేఁడు నే నీకు సామ్రాజ్ఞిఁగాను! గుల్నేయూరును మాత్రంబనే—నీ వేమి చెప్పదవో చెప్పుము.

ఔరంగ—ఏమి! ఇంతలోనే నీ కంత మార్పు కలిఁగెనా? ఇదేమి! నిన్ను గుఱుతించుట కష్టమగుచుండెనేల?

గుల్నేయూర్—నా గౌరవముతోఁ జోడనే నా సౌందర్యము కూడ సమాధియాయెను! సామ్రాట్టూ! ఇపుడునీవిచ్చటికేల వచ్చితివి? చెప్పుము. అధికసమయము లేదు! నేను మరణింపఁబోవుచుంటిని. విషంబు ద్రావితిని!

ఔరంగ—ఏమి! విషంబు ద్రావితివా!!—ఏల త్రావితివి?

గుల్నేయూర్—ఏల ద్రావితం' చనుగుచుంటివా? ఔరంగజేబూ!—స్థవిరశీర్ణ యౌరంగజేబూ! నీ తాచ్ఛిల్యమును తలఁదాల్చి, నేను జీవనధారణ మొనరింతుసని దలంచితివా? నీకృపాభిక్ష వేఁడి, నే నీ

పృథివీజడధియందు నా ప్రాణతరిణిని వడపుచుందు ననుకొంటివా? అల్లదె ప్రాగ్దిశంగానంబడు ప్రభాకరుని విలోకింపుము. పదంపడి నన్ను వీక్షింపుము.—అట్లు వీక్షించినంతనే మే మిరువుర మన్న సెల్లేంద్రమంచు గలంపకుందువా? సామ్రాజ్ఞినై దిగంతరేఖ (Horizon) నధిరోహించితిని; సామ్రాజ్ఞనయ్యే దిగంతరేఖ యం దస్తమించుచుంటిని!

ఔరంగ—గుల్‌నేయూరూ! నేడు నిన్ను క్షమించుటకై వచ్చితిని. నీకడనుండి యూడవెఱుకుకున్న వాని నన్నింటిని, మరల నీకొసంగ సంసిద్ధుడనై యున్నాను.

గుల్‌నేయార్—ఏమనుచుంటివి? క్షమింపవచ్చితిననుచుంటివా!

ఔరంగ—మహిళా! నిన్ను నేనిక బ్రేమింపజాలను! నీవు నన్నెట్టి వినాశకూపమందు బడద్రోచితివో యెఱుంగనేర కున్నావు! నాప్రేమ, విశ్వాస, మహాశాయుష్యములు నన్నింటి నొక్కముహూర్తములోనే యడుగంటజేసివైచితివి. యావన్మంది వియంతమొందినను, అవి మరలనుదయించి, సతీపతులు బ్రణయబద్ధుల గావించును. కాని, వార్ధక్యమందలి నాశన కూపమునుండి వెల్వడజాలక దారాభర్తల దుదివఱకు బృధకులగావించియే యుండును! నికనీన నాయాశలన్నియు నంత మొందెను! నాప్రేమయంతయు భగ్నమాయెను! నాయుష్యమము లన్నియు నిష్ఫలములాయెను! నేనిపుడు సర్వభ్రష్టుండనై యుంటిని! నేగూడ మృత్యువాతం జొరంబోవుచుంటిని. ఇపుడు నిన్నిక బ్రేమింపజాలను. నాకిక నట్టిశక్తిలేదు—అట్టి వాంఛ గతించిపోయెను! ప్రేమింపజాలం గాని, నిన్ను క్షమింపగలుగుదును.

గుల్‌నేయార్—క్షమయా?—చక్రవర్తీ! నన్ను నీవుక్షమింతువా?

ఔరంగ—నీచశ్రేణిలోకులు కులటలైనజాయలను, క్రూరకుఠారా ఘాతపరంపరలచేఁ బొలియించివైతురు. సాధారణశిక్షితమానవులు వారలను పరిత్యజించివైచెదరు. కాని, మహాత్ములైన వ్యక్తులు వారలను మన్నింతురు !

గుల్నేహార్—(వ్యంగ్యస్వరమున)—ఓహోహో! నీకిట్టిమహాత్మ్య మెప్పటినుండి యలవడెను ? కాని మహాత్మా ! గుల్నేహా రెన్నఁడెవ్వరిని క్షమియించుటలేదు ; యెవ్వరిక్షమను వాంఛించి యుండను లేదు !

ఔరంగ—నీవు తప్పుగ్రహించితివి! నేను మహాత్ముండనుకాను. కాని దిలీర్ఖాను మహాత్ముఁడు. నేనిపుడు యంత్రముచందమున గార్యముసలుపుచుంటిని. నిన్ను క్షమింపుమని దిలీర్ఖాను నాతోఁ జెప్పెను. అందుచే నాసియనురోధము మదసలం—

గుల్నేహార్—దిలీర్ఖానుయొక్క యనురోధమా? చక్రవర్తీ! నీవిఁక నాకడనుండి దయచేయుము ! నీక్షమ నాకక్కఱలేదు. నేను నిరయములోనికిఁ దిగిపోవుచుంటిని—సౌందర్యతిలకుండైన, శ్రీదుర్గాదాసుపైగల తీవ్రయసీమ విరాటానురాగమును, హృదయమునిండ బూర్ణమొనరించి, శోడ్డ దోడ్కొనిపోవుచుంటిని! ఆబలియుని బడసియేయున్న యెడల, నేనాతని నొకమేఘఖండము చాడ్పున నాప్రణయరజ్జువుచేఁ జుట్టివైచి, కూడంగూడఁ ద్రిప్పు చుండెడిదానను ; ఆతని నాయాప్యాయ్యాలచేఁ దిలతిలమందుఁ దుపాపములుపగిది దగ్ధమొనరించివైచియుందును! గాని, యాతనిఁ బడయఁజాలనైతిని. అయిన నెన్నఁటికైన నెచ్చోనైన బడయఁ జాలకపోవని దలంచెద. అప్పటివఱకు నావాంఛానలము రగుల్కొలుపుచు నుందును ! ఔరంగజేబూ! ప్రతిహింసచాడ్పున ప్రబలమై, యుద్దామమై, జ్వాలామయమైన ప్రణయముఁగల

వారలు కొందఱు కొందఱే విశ్వసంసారమం దుందురు. అట్టి వారలలో నేనొకర్తుకనంచెఱుంగుము.— నాశిరము ఘూర్ణిల్లి పోవుచున్నది. ఇఁకఁ బల్కఁజాలను. మృత్యుదేవతసమీపించినది! —ఔరంగజేబూ! నాకెట్టిదుఃఖములేదు! పతితనైతినను దుఃఖ మేమియులేదు. లేచితినిగానఁబడితిని. ఎవ్వారలుచ్ఛాంతముచ్చత్తమ సంటియుందురో వారలెన్నంబడరు. నాకేక నెట్టిదుఃఖము లేదు. నారినై జన్మగ్రహణ మొనరించియున్నయెడల, పురుషునిముష్టిమధ్యమందుంచివైచితిని! సామ్రాజ్ఞినై యున్నచో, ప్రకాండసామ్రాజ్యమునొంటు పాలన మొనరించితిని! ప్రేమించియున్నచో, ప్రేమదాన మొనరించితిని, కాని ప్రేమభిక్ష వేఁడ లేదు. ఎట్టిదుఃఖములేదు. ఎప్పటికైనమరణింపకతప్పదు. దానంజేసి యచిరములోనే మరణించుటుత్తమము! ఓ!—అడిగో! ఖద్యోతుఁడస్తమించుచుండెను—నేఁగూడ నస్తమించుచుంటిని!!!!

(అని యామె గుభాలున భూమింగూలును).

ఔరంగ—హా మ్మా! నీవనుతప్తచిత్తవై మరణింపలేదు. ప్రాయశః మరణముయొక్కఆవలియొడ్డునందు నీయనుతాపమారంభమగును. కాని, నాయనుతాపము మృత్యువునకుఁ బూర్వమే యారంభమాయెను!

## సప్తమదృశ్యము

ఆగ్రాప్రాసాద యమునాలగ్నయవిందము—సంధ్యాకాలము
దిలీర్ఖానొక యుద్యోగితోఁ బ్రసంగించుచుండును.

ఉద్యోగి—చక్రవర్తి మృతిఁజెందెనా? (క్యాసామ్రాట్ మర్గయా?)

దిలీర్—అవును ముబారకూ! అదత్యంతశోచనీయమృత్యువు. ఆతని శయ్యాపార్శ్వమం దాతని పుత్రులలో నొక్కఁడుండైనలేదు

ఆతని పత్నిముందే యస్తమించెను. నే నొక్కరుండనుమాత్ర మాతనికడ నుంటిని! ఆహా! అది మిగుల విషాదకరమైనమృత్యువు! [హా! బహుత్ అఫ్‌సోస్ మాత్ హై. ఉన్కే బిఛోనే కేపాస్ వున్కే యేక్ బేరాభీనహిథా.—వున్కీ బేగమ్ మర్గయీఆగే. వహాహం ఎకేలాథే! బహుత్ అఫ్‌సోస్‌మాత్!]

ముబారకు—ఆతఁడు మక్కాపోవలెనని యనుకొనుచుండెనుకదా? [ఉన్కే క్యాబాత్ నహిథా మక్కాజానేకు?]

దిలీర్—అవును. కాని యాతఁ డచ్చటకుఁ బోవుటపడలేదు.. [హా! మగర్ వున్సోనే నహిగయ్] దౌలతాబాదునందే యాతఁడు మృతిఁ జెందెను. [ఒదౌలతాబాద్మే మరే.] ఆ మృత్యుదృశ్యమును నే నెన్నండు మఱువఁజాలను. అనుతప్తహృదయముయొక్క యర్థసుప్త్యావస్థయందా మర్మభేదక్రందనము— "హా! హా!! మహారాష్ట్రులారా! క్షమింపుఁడు! రాజపుత్రులారా! క్షమింపుఁడు! పఠానులారా! క్షమింపుఁడు! భ్రాతలారా! క్షమింపుఁడు! జనకా! క్షమింపుము!"—ఆ యాక్రందనము—ముబారకూ! నేఁ జెప్పఁజాలకుంటిని!—

ముబారకు—చెప్పుఁడు! చెప్పుడు!!

దిలీర్—ఆ యాక్రందనానంతరము—మృత్యువాతఁ బడనున్న ముహూర్తమందా భయవిహ్వలభగ్నయుక్తి— అదిగో! సమ్ముఖమున మృత్యువుయొక్క కృష్ణమహార్ణవము! అందు నానాతరిని తేల్చివైచుచుంటిని"—అనంతరము—"హాో! అల్లా!!"— అను మర్మభేదచీత్కారము—ఓ! ఆ దృశ్యమును మఱువఁ జాలను.

ముబారకు—ఆహా! ఆ మృత్యువు నిక్కముగ విషాదకరమైనది!— ఇపుడు చక్రవర్తి యెవరగుదురో చెప్పఁజాలము.—[బహుత్ అఫ్

సోస్ హై! బహుత్ అప్ సోస్ హై!! హంలోక్ నహిబోల్ సక్తేహై కోన్ బాద్ హోహోగాఅభీ]

దిలీర్—మాజాము యజీములు సింహాసనముకొఱకై ఘోర ప్రారంభించిరి. ఫలమీశ్వరుఁ డెఱుంగును. [మాజామ్ ఆవుర్ అజీమ్ లడ్నే ఘురూకియ్యే తఖత్ కేవాస్తే. నతీజాఖొదాజాన్తాహై]

ముబారకు—తాము షాహజాదీ రజియా నిచ్చటికిఁ గొనివచ్చితిరా? [ఆప్ షాహజాదీ రజయాకి యిహా క్యాలాయాహై?]

దిలీర్—అవు నామెను తీసుకొని వచ్చితిని. పాప మాబాలకు నేఁడు తలిదండ్రులు కఱవైపోయిరి—ఆమె కిపు డేరును లేరు; ఆమె పగిది దుఃఖిని పృథివియందు మఱొకర్తుక యుండదు!—ఇపు డామె నొక వృద్ధపరిచారికకడ నుంచవలసి వచ్చుచుండెను. [హా! హం వునోఁ కేలాయేహై షాహజాదీ కామా బాబ్ నహిహై ఆజ్—వున్కీకోయీ నహిహై. కోన్ అప్ సోస్ హైవున్కేతరే?—హం రక్తేహై వునోఁకే యిహా సాత్ ఏక్ పురాణే మామా కే.]

ముబారకు—మీ రెచటి కరిగెదరు? [ఆప్ కహా జావేంగే?]

దిలీర్—నే నొకమాఱు మహాత్మా దుర్గాదాసు కడకు బోయెదను. [హం ఏక్ దఫే జావేంగే మహాత్మా దుర్గాదాస్ కేపాస్]

ముబారకు—ఎందులకు? (క్యాంవ్?)

దిలీర్—పనియున్నది. ఇఁక వెలుపకుఁ బోదము రమ్ము. [జరూరత్ హై ఆవ్! హంలోక్ బహార్ జావేంగే అభీ]

[ఉభయులు నిష్క్రమింతురు.]

[ఉద్భ్రాంతభావమున రజియా మెల్ల మెల్లగ నా తావునఁ బ్రవేశించును.]

రజియా—నే నాతనిఁ బ్రేమించితిని! అందేమి దోషమున్నది? ఎవరు మమ్ముల విచ్ఛిన్న మొనరించివైచిరి? ఎవరు మా కెడ

బాటు గావించిరి?—మా సుఖముఁ జూచి సహింపఁజాలకపోయిన వా రెవరు? హా! సుందరాంగా! యశస్తిలకా!

పరిచారిక—ప్రవేశించి. ఓ! అమ్మాయిగారూ!

రజియా—అబూగిరిదుర్గమం దానాఁడు, శుభ్రజ్యోత్స్నాలోకమున, శైలపదమూలమున మే మిరువురము కలిసికొంటిమి—రాపుత్రా! మన మపు డేల కలసికొంటిమి!

పరిచారిక—అదిగో! మళ్ళీ మొగ మెట్టిం దీవిడ! తనలో తా నేదో గొణుగుకొనుచున్నది!—ఏమండో! అమ్మాయిగారూ!

రజియా—సౌందర్యతిలకా! అవతరింపవా! అంతరింపవా!! ఆహా! నీ నామమాధుర్య మేమని వర్ణింతును!—అంతరింపవా!

పరిచారిక—అబ్బే! ఈయమ్మ నా కిప్పుడు జవా బిచ్చేటట్టు కన బడదు. నే నూరికే చించుకోవడ మెందుకు? నా దారిని నేను పోతాను. ఏమో కాని, యీ పిల్లవానికి మే మాటిపోయింది! పిచ్చిదానిలాగా తనలో తానే వాగుకుంటుంది! పోనీ! వాగుకోనీ! నా సొమ్మేంపోయింది!— [వేగిమే వెడలిపోవును.]

రజియా—ఆహా! అభ్రభాగ మంతయు పవిత్రసాంధ్యరాగములతో విలసిల్లుచున్నది! సుమసౌరభము మూపుసం దిడుకొని, మందానిలుఁ డల్లెడల భ్రమణ మొనరించుచున్నాఁడు!—కోకిల తీయనైన తన గానరసముచే మానవుల చెవుల నింపివేయుచుండెను! నీలసలిలపూరితయమునా శైవలిని ప్రవాహ మూర్ఛమును వేష్టన మొనరించుచుండెను! అదిగో! నభము మబ్బుల నెట్టు లాయెనో! ఆహా! ఏమి నిర్మలము! ఏమి నీలిమ!! ఏమి సౌందర్యము!!!

గీతమాల

గగనమందును తారలు క్రాలునేల?
నవ్వనేలను జాబిల్లి నభమునందు?

పుష్పనిచయము యింక నేల బూయవలయు ?
మలయపవనమేల నింక భూవలయమందు
వీవవలయు ? నిలను యల విహగతతులు
స్వాదుగానము నింక నేల సలుపవలయు ?
అక్షిగింగి జ్యోతి వేళంబ యంతరింప,
వేగ నిత్తఱి యసువులువీడ నెడఁద.

[పాడుచుఁ బాడుచు రయా నిష్క్రమించును.]

షష్ఠదృశ్యము

పేశోలాప్రాదతీరస్థప్రాసాదము—సాయాహ్నకాలము.

దుర్గాదాసేకాకియై నిలువంబడి, ఆదృశ్యమును విలోకించుచుండును.

దుర్గాదాసు—వ్యర్థుండనైతిని. ఈజాతిని లేవందీయఁజాలకపోతిని. మొగలుసామ్రాజ్యము నిలువనేరకుండుట నిక్కంబైనట్లు ఈజాతి యింక లేవంజాలకుండుటయు నంతే నిక్కము!

[జయసింహసరస్వతులు చనుదెంచి, దుర్గాదాసు పాదములకుఁ బ్రణమిల్లెదరు.]

సరస్వతి—దేవా! సేవకురాలొసఁగు ఫలహారములఁ గైకొన లోనికి దయచేయుఁడు. ఇప్పటికే జాల విలంబమైపోయెను.

దుర్గాదాసు—అమ్మా! వచ్చుచుంటిని సమువుము.

జయసింహ—మహాత్మా! ఇచ్చట మీకెట్టికష్టము కలుగుచుంట లేదుకదా?

దుర్గాదాసు—ప్రభూ! కష్టమందురా? దేవర యాతిథ్యమందు నేను పరమసుఖము ననుభవించుచుంటిని.

జయసింహ—స్వామీ! నాయాతిథ్యమనకుఁడు. సరస్వతి యాతిథ్యమనుఁడు. సరస్వతియే సుందరంబైన యీతావును తమకుఁ దగుతావలంబై యుండునంచుఁ దలంచి, తానే యిందొక స్ఫటికహర్మ్యమును నిర్మింపఁజేసెను. ఏనాఁడు తాము మా యతిథులై, మమ్ముఁ బవిత్రులఁ గావించి, యొక నిర్జనస్థానమున నుండవలెననుయిచ్ఛఁ బ్రకాశ మొనరించితిరో, ఆనాఁడే యామె స్వయముగ నిచటి కరుదెంచి, వలయు నేర్పాటులు నన్నియుఁ గావించెను. ఈనెలవునం దానెలఁత ప్రత్యహము తమకొఱకై స్వయముగఁ బచనకార్యము నిర్వర్తించును.

దుర్గాదాసు—మహారాజా! యనుగ్రహమసీమము!

సరస్వతి—అనుగ్రహమా? అనుగ్రహమసకుఁడు. దేవా! ఇది మీ దీనురాలి యర్ఘ్యము. భక్తురాలినైవేద్యము. మహాత్ముండగు దుర్గాదాసు పవిత్రనామంబును వినినంతనే, రాజస్థానమం దెవరివక్షము స్ఫీతముకాదు?—గరువముచే నెవరి శిర మున్నతముకాదు? ఏకాంతభాగ్యబలమునను, పూర్వజన్మపుణ్యఫలమునను, అతిథిస్వరూపుగఁ బడసిన వేలుపు నీ దాసురాలు త్రికాలమందుఁ బూజసేసి, తన మనోవాంఛలఁ బూర్ణ మొనరించుకొనును.

[ద్వారికుఁడు ప్రవేశించును.]

ద్వారికుఁడు—మహారాజా! శాహోరు సేనాధిపతిదర్శనముఁ గోరుచు మొగలు వాహినీనాయకుఁడగు దిలేర్ఖాను ద్వారసమ్ముఖమున నిలువంబడి యుండెను.

దుర్గాదాసు—ఎవరు! దిలేర్ఖానా?

ద్వారికుఁడు—అవును స్వామీ! ఆతఁ డాపేరునే చెప్పెను.

దుర్గాదాసు—పోయి, పరమసమాదరమున నాతని నిటఁకుఁగొని రమ్ము [సరస్వతినుద్దేశించి] అమ్మా! నీ వింక లోని కరుగుము.

మేము కూడ యిపుడే వచ్చెదము.

సరస్వతి—మన్నింపుము. ఒకించుక సేపు స్వామిసాన్నిధ్యమున నిలువం బడనిండు!

[కరకమలముల ముకుళించి, దుర్గాదాసు మౌలనిలువంబడును.]

దుర్గాదాసు—దిలీర్ఖా నిపు డిచటికి వచ్చుటకుఁ గారణ మేమై యుండును?

జయసింహ—ఏమో తెలియకున్నది.

[దిలీర్ఖాను ప్రవేశించును]

దిలీర్—వందేగిమహాత్మా దుర్గాదాస్! [దుర్గాదాసుపాదముల కెరలి లేచి] మహాత్మా! దాసునకు జ్ఞప్తికివచ్చెనా?

దుర్గాదాసు—[దిలీర్ఖాను నాలింగన మొనరించుకొని] బాసుఁడవని బల్కఁదగునా? మిత్రమా! నా జీవనదాత నెట్లు మఱవఁగలుగుదును? ఆహా! నేఁ డెట్టిసుదినము. పవిత్రాత్ములరాక పరమ సౌభాగ్యదాయకముకదా! సఖా! నీ దర్శనభాగ్యము నాకు నేఁడలవడుటకు హేతువేమి?

దిలీర్—మహాత్మా! తీర్థదర్శన మొనరింప వచ్చితిని. హిందువులగు మీరలు వారణాసి, హరిద్వారి, సేతుబంధరామేశ్వరములాది తీర్థములకు యాత్రార్థమరుగుచు, ధన్యులై వచ్చుచుందురుకదా! నేఁగూడ మరణించుటకుఁ బూర్వము నిన్నొకమాఱుగాంచి ధన్యుండ నగుటకై వచ్చితిని.

దుర్గాదాసు—[క్షణకాలము నీరవుఁడై యుండి పిదప] దిలీర్ఖానూ! నేను సామాన్యమానవుండను. సాధ్యమైన తెఱంగున నిజకర్తవ్యము మాత్రము సలుపుచుందును.

దిలీర్ఖాను—మహాత్మా! ఈ పాపభూయిష్టయుగమున గద్దానినెందఱు సలుపుదురు? ఏ యుగమున భ్రాతలఁ దమ యంశములనుండి

[అయ్యవసరమందే, పరువుపరుగ్నునఁ గాశిము ప్రవేశించును].

కాశిము—ఏరీ! మామహరాజు యేరీ?—ఇదిగో! (కహా హైహో? కహా హై మహరాజ్? ఒయీహాహై) (దుర్గాదాసునకు భూమి ప్రణతయభివాదన మొసరించును.)

దుర్గాదాసు—ఎవరు! మనకాశిమే! ఆశ్చర్యము! కాశిమూ! నీవిచ్చటికి వెతకుకొని యెట్లు వచ్చితివి?

కాశిము—వెతుక్కు వెతుక్కు వచ్చాను మహారాజ్! ఎన్నిచోట్లు గాలించి, గాలించి వచ్చానో, యింక మీతో యేంచెప్పను మహరాజ్? (ఢుంఢ్తే ఢుంఢ్తే మైఆయుం మహరాజ్! మైనహింబోల్ సక్తాహుం కిత్నే జగామై ఘుండా!)

దుర్గాదాసు—కాశిమూ! నీవు మహరాజని యెవరిననుచుంటివి?

కాశిమ్—ఎవరిని చిరకాలు మంటూవస్తున్నానో, వారినే మహారాజ్! (జినోంకొ బహుత్ ఆగేసే మహరాజ్ కిహతాహువా ఆతుంధా వునోంకొ మహరాజ్!)

దుర్గాదాసు—కాశిమూ! ఇఁకనివట్లనరాదు. నీమహరాజు నామహరాజూకూడా యిపుడు యోధపురాధిపతియైన యశోతసింహుఁడు!

కాశిమ్—వానిపేరెత్తకండి మహరాజ్! వాఁడు విశ్వాసఘాతకుఁడు. [అయ్ మహరాజ్! ఉస్కానామ్ నహింబోలో! ఒనెముక్ హారామ్!]

దుర్గాదాసు—కాశిమూ! నీవెవరియొద్ద యిట్లనుచుంటివో యెఱుంగుదువా?

కాశిమ్—ఎఱుఁగుదును. నాదేవతదగ్గిఱ నాదేవునిదగ్గిఱ యిల్లా అంటున్నాను! అయినాసరే, నేనబద్ధంమాటను నోరుమూసుకుని వింటూకూర్చోలేను. ఎవడిని మీరు యిన్నాళ్ళనుండి మీగుండెల మధ్య వుంచుకునీ పెంచిపెద్దవాణ్ణి చేసినారో, యెవనికార్యము కొఱకు చెమటలు లూడ్చి, చివరకి మీజీవనమంతాకూడా ధార

పోసినారో, యెవనితల్లి మిమ్మల్ని కన్నబిడ్డవలె చూస్తూ
వుండేదో,—వాడుఅట్టిమిమ్మల్ని, యిప్పుడు, యీపెద్దయీడులో
—క్షమించండి మహారాజ్!—కంఠం నిండిపోయింది [With
sorrow]—యిక యేమీ చెప్పలేను! [మైజాంతాహూ. మైక
హాతాహూం మేరేఖుదాకేసామ్నే. పరంతూమైనహీ సున్‌సక్తా
హూం మూగిందకర్కే బేహాక్ బాత్. ఇస్కేఆప్ అప్నాదిల్
కాఖూన్సే అద్మీబనాయా, ఉస్తాకామ్‌మేఆప్ అప్నాజాన్‌దియేహై
ఇస్కామూ ఆప్‌కో లడకాకాతలే దేక్తీథీ,—ఒలయసా అద్మీకో,
యేబుడ్డాసిన్‌మే—మూఫ్‌కీజీ యేమహరాజ్!—మేరాగల్లా బంద్
హోగయా—మైఅవుర్ కూచ్ నహీంబోల్ సక్తాహూం!]

జయసింహ—కాశిమూ! ఇస్లాము ధర్మము (మతము) నీవంటి
మానుషుని కూడఁ గయూరు గావించునా?

దుర్గాదాసు—మహారాణా! సర్వధర్మములు (మతములు) యొకే
సత్యప్రబోధము సేయును—ఒకే మహానీతిశిక్షఁ బ్రసాదించును!
అయిన నేగైన మానుషులు కానిచో, ఆదోషము ధర్మముయొక్క
(మతముయొక్క) దోషముకాదు. ముసల్మాను మతమందుఁ
గాబ్లేష్ఖాకరా యుండెను! దిల్క్షాకా యుండెను!

[The words of Durgadas call to mind the sacred teaching of Sree Ramakrishna Paramahamsa. The great Bangalee saint expresses the same truth in a different form:—'just as all rivers fall in the same ocean, so also all religions, teaching the same truth lead but to the Supreme Ideal.' This leads us to the thought that, although religions may be diverse, yet God is the same to whom every kind of worship is acceptable, provided it is sincerely pursued. As all roads led to Rome in ancient Europe, so all worships lead to the Supreme. Sree Krishna says in the Bhagvadgeeta:—

ये यथामां प्रपद्यन्तो तांन्तथैव भजाम्यहम् ।
ममवर्त्मानु वर्तन्ते मृत्युसंसार वर्त्मनि ॥

"I bless each worshipper after the manner in which he worships me. Mankind, O Partha, in every way pursue my own path." Similar ideas are expressed in two more *Slokas* I give only the translations of those two *Slokas.*

(1) "The different devotees who desire to worship different images with faith and devotion, I grant them firm faith in their respective images or symbols."

(2) "That devote having served his own particular form with this faith, attains the fruits thereof as ordained by me."

This is because (to quote the Geeta once more);—

(3) "the Lord is seated in the heart of all creatures; and is revolving them as if upon a wheel with His Maya." This Maya is *Prakriti.*]

దిలీర్—నేటి హిందూమతమందు శ్యామసింహుఁడూ యుండెను; దుర్గాదాసూ యుండెను!!

కాశిమ్—[దుర్గాదాసు నుద్దేశించి]—అట్లైన హుజూర్ నావిన్నపము వాక్రుచ్చుతుంది. [హుజూర్! మేరా యేక్ అర్జీహోయ్!]

దుర్గాదాసు—ఏమి కాశిమూ?

కాశిమ్—హుజూర్ మీరు రాణాపెట్టే మెతుకులు తింటూ బ్రతుకుతున్నారని విన్నాను. అల్లా జరగరాదు. ఒక్కటే—లెక్క—అల్లా జరగరాదు! [మైసున్నాహుఁకె హుజూర్ ఆజ్ రాణాకా రోటీ ఖా— అద్మీబంద్ తేహై. ఒ అయిసా నహీ హోనా చాహియే!]

దుర్గాదాస—ఏలా జరుగరాదు?

కాశిమ్—నా కంఠంలో ప్రాణాలున్నంతదాక, మహారాజ్ మహాకరి గుమ్మంలో అడుగు పెట్టకూడదు. నేను భూమిమీద తిరుగుతూ వున్నన్నాళ్ళు ఆలా అనుకొట్టడం కొంచెమాత్రం చూడజాల్ను

లేదు. [జబ్ తలక్ మై జీతీహుం మహారాజ్ నహిజానా చాహియే దుశ్శేకాదర్వాజేపర్ మైనహి దేఖుంగా వుస్తో జబ్ తలక్ మై జీతాహుం]

జయసింహ—అదేమి!—కాశిమూ! నీవేమిచేయఁదలఁచుచుంటివి?

కాశిమ్—ఏంచెయ్యదల్చుకున్నానంటారా? రాణా! విను. నేను నా మహారాజును పోషించుకుంటాను. [క్యా మంక్యాహుంమైకర్నే! సానో రాణా, మై మేరా మహారాజుకో ఖిలావుంగా.]

జయసింహ—ఏలాగ?

కాశిమ్—ఏలాగ నాకు శక్యం అవుతుందో ఆలాగ. కష్టపడి చెమటోర్చి పోషించుకుంటాను—ముష్టెత్తి పోషించుకుంటాను. [జైసా మైనక్తాహుం. మైకామ్కర్కే వునోంకు ఖిలావుంగా—మై భిక్ మంగ్ కర్ ఖిలావుంగావునోంకు.]

జయసింహ—కాశిమూ! నీకేమైన పిచ్చిపట్టినదాయేమి? మహారాజ్జికి నీ వన్నముఁ గుడువఁబెట్టుటకు, నీకు దానిని ముందుబెట్టువారెవరు? నీ కది యెచ్చట దొరకును?

కాశిమ్—ఎక్కడదొరుకుతుందో అక్కడికే పోతాను! ఈ వేళమా రాణీగారు బ్రతికేవున్న యెడల, మా దుర్గాదాసుమహారాజ్ మెతుకుల కోసం వీళ్ళగుమ్మంవద్దా వాళ్ళగుమ్మంవద్దా భికారివాడైపోయి వుండకేపోవును. ఆ యిల్లాలు యెగిరిపోయింది. కాని, నే నింకా యెగిరిపోలేదు. నేను కష్టపడి నా దేవతను పోషించుకుంటాను— కలోగంజో యేం దొరుకుతుందో అదే పెట్టి పోషించుకుంటాను! [జాహోసేమైపావుం అగర్ హంలోకే రాణీ జీతీరహిథీ ఆజ్ కారోజ్, దుర్గాదాస్ మహారాజ్ దుశ్శేకాదర్వాజేమే నజాతా థాభీక్ మంగ్నే, ఒజీతానహిహై నుగర్ మైజీతాహుం, మైవునోంకు ఖిలావుంగా గరీబ్ ఖానా సేజో ముఝ్కుమిల్తాహై]

జయసింహ—అది సంభవమా?

కాశిమ్—ఎందుకు కాదు రాణా?—చూడు, దుర్గాదాస్ మహారాజ్! నీకెల్లా యిష్టమవుతుందో అల్లా చెయ్యి! ఏరుకో మహారాజ్,—రాణా దిగవిడిచే రాజభోగం కావాలా, లేక నేను పూజించిపెట్టే గంజీమెతుకులూ కావాలా?—ఏరుకో,—రాణాయొక్క పాదాల దగ్గిరుంటావా? లేకపోతే నా శిరస్సుమీద వుంటావా? చెప్పు! యేది కావాలో చెప్పు మహారాజ్! [కాయ్ నహీంహోసక్తాహై దేఖో! దుర్గాదాస్ మహారాజ్. తుమ్‌కరో జైసాతుమ్ మంక్తే హోచునో మహారాజ్! క్యాతుమ్ ఖావోగే అమీర్ ఖానాజోపే కాగయాహై రాణాసే; [యాతుమ్ ఖాలోగే] గరీబ్ ఖానా జోమైదేతాహూం యిజ్జత్సే?]

దుర్గాదాసు—కాశిమూ! నీవచనము లతిపవిత్రములు. దుర్గాదాసు నీ విచ్చు గంజిమెతుకులే కుడిచి బ్రదుకుదును! [ఇట్లనిదుర్గాదాసు లేచి, కాశిము నాలింగన మాచరించుకొని]—భాయీ కాశిమ్! [సోదరా! కాశిమ్]—నేఁటినుండి మన మిరువుర మన్నదమ్ములము. [పిదప దిలీర్ఖాను నుద్దేశించి]—మిత్రమా! వీక్షింపుము! ఈతఁ డెట్టి యుదారుఁడో, యెట్టి యుచ్చచరిత్రుఁడో, యెట్టి మహాత్ముఁడో వీక్షింపుము!

దిలీర్—మహాత్మా! సత్యము వచించితివి! అట్లే నిలువంబడుఁడు—మీర లిరువురు నేఁడు నా సమ్ముఖమం దట్లే నిలువంబడుఁడు; ఒక్కమాఱు మిమ్ముల నుభయులఁ గన్నులార గాంచనిమ్ము,—జగదీశ్వరా! నీ స్వర్గమం దెవ్వ రమరులనఁ బరగుచు నుందురని వింటినో, వారలు వీరలకంటె నధికులా?

సరస్వతి—మహాత్ములారా! వందనము!!

[ తెర పడును ]

సంహారము

So stand the noble Delir, the high-souled Kasim, the immaculate Saraswati, the metamorphosed Jayasinha and the Angelic Durgadas with the nimbus of glory shining resplendent round their brows as the evening Sun showers upon them admiration and benediction with the flood of his golden light, and as the firmament above painted in myriad and variegated hues by the invisible and invincible Pencil of the Creator, indeed makes the scene as glorious, as splendeferous, as magnificent as Elysiam perhaps to vindicate the observation of Delir that 'these must have been the Angels that live in a region of perpetual bliss and perennial beauty'. Words in vain express the feelings and thoughts that incessantly crowded upon my mind when, notwithstanding my feeble powers, I undertook the pleasant task of ushering these immortal beings into the ken of the Telugu public's vision. Yet, I will assay to offer my tribute of homage and veneration to our hero in my own humble way, reluctantly relinquishing the endeavour of commenting upon the other holy characters just to preclude the necessity of transcending the purlieus of this volume.

The history of human evolution whether religious, political or social can be epitomized in the biographies of those that are endued with powers not vouchsafed to the common run of mankind. Should the measure of a man's greatness, alike from the subjective and objective sides, be the depth and extent of his influence upon the thought of his friends and foes, then Durgadas could be acclaimed as the greatest man that lived on the globe a few centuries ago — the most magnificent meteor that shed great lustre all over the world shining in the temporal and spiritual firmament of Moghul India.

There can therefore be nothing more instructive, more interesting, more inspiring and more soul-entrancing than a punctillious study of the life and character of that towering personage that inspired Muse in the sacred vaults of literature. Our hero was *ipsofacto* the embodiment of all that is great and laudable. Endued with the dash and the driving force of Mahomed, the purity of Zorastra, the self-less-ness of Jesus and the compassion of Buddha and possessing a heart that overflowed with the milk of human sweetness and at the same time imbued with a strong and potent will that did not quail before troubles and tribulations of the most appalling character. Durgadas brought back India

which was drifting in the eddies and cross-currents of tyranny and destruction to her true moorings. That he was a statesman, a warrior, and a saint rolled into one was attested by the admirable *modus operandi* which he had recourse to while endeavouring to save the young Ajit and to keep the honour and fair name of Rajstan especially of Marwar unsullied by cudgeling with all his power the tyranny and cruelty that governed the actions of the Philip II of *Hindustan*. His dauntlessness kept the vindictive Aurangzeb stupified in his throne in the Durbar-hall; his fore-thought saved the young Ajit and his valorous mother at Delhi from the enemy's appalling onslaught; his ineffable prowess broke the impregnable Moghul phalanx on many an occasion; his spirit of compassion and commiseration nobility and magnanimity made him condescend to vouchsafe safety to the enemy's son; his fearless advocasy of what he deemed right and just urged him to suffer the displeasure of his nearest and dearest ones to court expatriation to stand before a malignant sword for saving an innocent lady and subsequently to uphold the honour of a green girl looked in the flower of her age in the lascivious caress of an ebullient youth; his admirable soul-force constrained him to ceremoniously brush aside the love-overtures of a Paragon of beauty that, if led by our hero on 'the prim-rose path of dalliance', could bestow upon him all the opulence of the terrestrial regions and his absolute self-less-ness pressed him to spurn the dazzling baits administered unto him alike by the wily and villanous Aurangzeb and his voluptuous and impetuous spouse. The more we think of the life of this illustrious Tribune, the more we are struck with the idea that it was a career of victory — Victory of the spirit over the weakness of the flesh, victory of his ideal over the tremendous odds arrayed against him, and above all, a stupendous victory over the all-powerful Aurangzeb. His career was therefore a long chapter of triumphs won by the dynamic force of his invincible will, that was unbending in the pursuit of its straight ends. His mind was always obsessed by his intense longing to elevate his fallen nation — longing which gave him no rest all through his life and which to his great chagrin and dismay, was not fructified on account of (as he himself avers) the unfortunate distrust and disunion that existed amongst the Hindus themselves. The call of his *Marwar-mâta*

was to him what the music of Krishna's flute was to His devotees who would give up everything in the super-abundance of love. He scornfully flung aside, as we saw above, the temptations offered by wealth and case and embraced a life of poverty and suffering. There we find the rich mould in which he was cast, so utterly unlike that to which we (as the noble Delir aptly observes) are accustomed to find in the world which abounds with treachery mischief and deception. Had he yielded to Temptation he could have easily become the King of Marwar yea of India. But his virile soul yearned for something higher and nobler. Could gold power and pelf satisfy a soul that burned with such passion for self-realisation and self-fulfilment? Could he, imbued with the spirit of saints, be content with lowlier ends, when he had caught a glimpse of the ideal. Oh! the mind brims up with admiration and emotion when we contemplate the greatness of this person whose soul was stirred to its inmost depths and whose warm sensibilities were roused to an unwonted pitch of enthusiasm by the contemplation of the greatness of Bharatamata who was free and felt her life in every limb and who developed a mighty civilisation long before the Eternal City had been built upon the seven hills, before Babylonian astronomers had learnt to gaze upon the starry world. He lived therefore a dedicated life — a life consecrated to the noblest human impulses and endeavours and to the best and truest interests of Marwar, Rajastàn and Bharatavarsha. From him proceeded the chastening aspiration thàt made the whole country vibrant. He had to contend with difficulties galore, and cankering worries. But these could not repress the àrdour of a great soul which was caught up in the lime-light of a consecrated task for the uplift of the fallen Hindus. The many ordeals wherethrough he successfully came out, brought out the metal and effulgence of his golden aspiration. It called forth the best and noblest in his nature and made his name (as Saraswati says) dàngle on the lips of every Rajpoot. The discipline of suffering through which he passed was only the prelude to the splendid heritage to which we his country-men have for long been àspiring and from which (let us believe) we can no longer be shut out.

Though the Rajpoot was not infrequently moved by feelings of revenge when some injury was done unto him, yet Durgadas

entertained no thought of reprisal when his brother, the brave soning became a victim to the foul 'assassination effected through his enemies' — assassination, to quote the words of James, "which made no alteration in his humanity whenever the chance of war placed his foe in his power, and in this, his policy seconded his virtue." When self-government (as Hutton said) can be found in every line of Wordsworth, it can be clearly perceived in all the thoughts, words and deeds of Durgadas whose mind was always attuned to the lyre of the Angels. The fact that he possessed great self-control could be well demonstrated by the circumstance that, when the disgruntled Ajit, for whose sake he (Durgadas) shed his blood, mercilessly banished him from Marwar, he didn't give vent to any feeling of ire, but bid his lord adiew with all his saintly docility and with a reverent obeisance. We may here observe that like the puritan of yore, he was a strange mixture of contrarities. He would prostrate himself before his lord and before God but he would fearlessly defy the man-made-law that would threaten to wound the sentiments of freedom. Well might his mother Marwar say !

"This was the happy warrior; this was he,
That every man in arms should wish to be"

Believing, as he did, that he was entrusted with a glorious mission and clothed with a noble trust he saw the glimpses of a regenerated Hindu nation, his devotion for its uplift, as observed before, being sans bounds. What Matthew Arnold wrote about his father,

*scilicet:*

"Then in such hour of need,
Of your fainting dispirited race,
Ye, like angels, appear,
Radiant with ardour divine;
Beacons of hope, ye appear;
Langour is not in your heart,
Weakness is not in your word,
Weariness not on your brow,"

could be applied to Durgadas with peculiar fitness, since, to boot the many qualities already delineated in the above pages, we find our hero dowered with an iron tenacity of will that made him truckle to no-body, with divine fervour and with magnificent prowess and magnetism which made the brave and patriotic Rajputs come within the orbit of his personality though, in fact, he always wore the garb of a servant following the command of Mahamaya or Rajasinha. We can further observe that had he been put at the helm of all gubernatorial affairs he could have displayed the same powers of nation-building as Solon or